
JOY®
Cream of Creams
రాయలసీమ
THRUPTHI ASSOCIATES
Plot No.F-9, Industrial Estate,
Proddatur-516 362. Kadapa Dt., A.P.
Tel. 08564-250636 Fax : 08564-258465
కోస్తా ఆంధ్రా
THRUPTHI FOODS
Depo II - D.No. 1-3/18-35,
Vidyadharapuram, Vijayawada.
Tel. 0866-6530156, Cell. 9849991235
తెలంగాణా
THRUPTHI MARKETING
Depot : D.No. 138, Sri Krupa Market,
Malakpet, Hyderabad-36.
Tel. 040 - 65181115 Cell.9849991257
తృప్తి
ఆంధ్రప్రదేశ్ అంతటా
JOY ఐస్‌క్రీమ్ సరఫరా చేయువారు
THRUPTHI FROZEN FOODS

# చతుర

సంపుటి -33
సంచిక - 4
మే 2010
388వ సంచిక



ముఖచిత్రం : నమిత

ముఖపత్రాలంకరణ : రాజుయాట



'ఆ ఎస్.ఐ. నీపై లాఠీ పెట్టినప్పుడు భయపడిపోతి' సీత ఏడుస్తూ రాఘవపై వాలిపోయింది.
'ఛ, ఎందుకేడుస్తావు? నన్నేమీ చేయలేదు కదా!' అన్నాడతను.
'నీ మంచే కాపాడింది. లేకపోతే నే సచ్చిపోయిందును' అంది సీత.
'సీతా! నాపైన నీకెందుకింత ఇది?' అన్నాడు రాఘవ.
'ఎందుకంటే అందుకే..' అంటూ గట్టిగా హత్తుకుంది సీత.
ఇంతకీ రాఘవను పోలీసులు ఎందుకు బెదిరించారు? సీతారాఘవుల ప్రేమ సఫలమైందా? ఆద్యంతం ఆసక్తిగా చదివించే

**కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్లై**

**మర్రిమాను సాక్షిగా..**

22 పేజీలో..

బొమ్మలు : పిన్నాడ రవి

నిరంతర కృషి - నిర్విరామ ఫలితాలు

**గత 19 సంవత్సరములుగా కోరుకొండ సైనిక స్కూలు ప్రవేశ పరీక్షలలో 800కు పైగా సీట్లు సాధించిన ఏకైక సంస్థ**

# శ్రీ శారదా విద్యానికేతన్

**కోరుకొండ, విజయనగరం జిల్లా, Pin: 535 214**

ఫోన్ నెం: 246149, 246111, స్థాపితం: 1981, సెల్: 94403-83464, 9391155275



వ్యవస్థాపకులు
స్వర్గీయ వాద్రేవు సీతారామారావు






వి. శ్రీనివాసరావు (బుజ్జి)
డైరెక్టర్

**2008 - 2009 సం॥ సైనిక స్కూల్ ప్రవేశ పరీక్షలలో 6వ తరగతినందు స్టేట్ 2వర్యాంక్ మరియు 9వ తరగతినందు స్టేట్ ఫస్టు ర్యాంక్‌తో పాటు 80 సీట్లలో 54 సీట్లు సాధించిన సంస్థ.**

| YEAR | ROLL NO | NAME | |
|---|---|---|---|
| 1991 | 6555 | CH.V. SUDHAKAR | (STATE I RANK) |
| 1993 | - | D. KIRAN | (STATE I RANK) |
| 1994 | - | D. RAMU | (STATE I RANK) |
| 1995 | - | V. KALYAN | (STATE I RANK) |
| 1996 | 7098 | V. PRANEETH | (STATE I RANK) |
| 1997 | 6613 | A.S.P. KUMAR | (STATE I RANK) |
| 1998 | 4651 | K. PAVANKUMAR | (STATE I RANK) |
| 1999 | 2070 | B. KRISHNAMURTHY | (STATE I RANK) |
| 2000 | 5077 | K. CHIRANJEEVI | (STATE II RANK) |
| 2001 | 1079 | V.V.PRUDVI | (STATE I RANK) |
| 2002 | 4042 | PAVANKUMAR | (STATE 3RD RANK) |
| 2002 | 4080 | ANOOP KUMAR MISRA | (STATE 4TH RANK) |
| 2002 | R.I.M.C. | ASHOK VARMA ROLE NO.3 | |
| 2003 | 6007 | MANOJKUMAR RATHOUR | (STATE 2ND RANK) |
| 2003 | 50010 | K. SAIKIRAN | (STATE 1st RANK) |
| 2004 | 9508 | V.SAI ABHILASH | (STATE 1st RANK) |
| 2005 | 6606 | J. Ravi Kiran | (STATE 1st RANK) |
| 2006 | 1062 | N. Naveen | (STATE 2nd RANK) |
| 2007 | 5102 | M. Manoj Kumar | (STATE 3nd RANK) |
| 2008 | 90011 | VISAL SAGAR | (STATE 1st RANK) |
| 2009 | 6012 | G. Paulspurgen | (STATE 1st RANK) |

కోరుకొండ, గుడిలోవ, నవోదయ, RIMC (డెహ్రాడూన్), బెంగుళూరు, బెల్గాం మిలటరీ పాఠశాలల ప్రవేశ పరీక్షలకు క్రమశిక్షణతో అత్యుత్తమ కోచింగ్ ఇచ్చి రాష్ట్రంలో ప్రథమ స్థానంలో నిలిచిన సంస్థ.

**STATE 1st RANK**



**T. JITENDRA**
R.No: 30013
9th Class

**మాకు ఎక్కడా బ్రాంచీలు లేవు**

**బాల బాలికలకు హాస్టల్ వసతి కలదు**

**2010-2011 సం॥ సైనిక్ స్కూల్ 6వ తరగతి మరియు 9వ తరగతి ప్రవేశ పరీక్ష శిక్షణ తరగతులు 01-05-2010 నుండి ప్రారంభించబడును.**

**2010-2011 సైనిక్ స్కూల్ 6వ తరగతి ప్రవేశ పరీక్షలో 5, 6 Rankలతో పాటుగా 33 సీట్లు, 9 తరగతిలో 1Rankతో పాటుగా 5 సీట్లు సాధించిన సంస్థ.**

వివరములకు
**వి. శ్రీనివాసరావు (బుజ్జి) డైరెక్టర్**

అపార్ట్‌మెంటాలజీ 28

# దొంగనోటు దొంగ కౌన్ హై?



యర్రంశెట్టి శాయి

(గత సంచిక తరువాయి..)

"బాడ్‌లక్! నాకెప్పుడూ ఒక్కటయినా వస్తోంది"

"అంటే మీకూ దొంగనోట్లు వస్తున్నాయా?"

"దొంగనోట్లు అనకు- నకిలీనోట్లు అను- లేకపోతే సెక్షన్ మారిపోతుంది మళ్ళీ"

"ఇంతకూ మీరా దొంగనోట్లేం చేశారు సార్?"

"వాటిని మంచి నోట్లతో ఎక్స్ఛేంజ్ చేయాలని పదిరోజుల్నుంచీ తిరుగుతున్నా. తమాషా ఏంటంటే బాంకుల్లో ఎక్స్ఛేంజ్ చేసినా అవీ దొంగనోట్లే వస్తున్నాయ్"

"దొంగనోట్లు అంటున్నారేంటి? సెక్షన్ మారిపోద్దిగా?"

"అవునవును.. నకిలీనోట్లు..నకిలీనోట్లు"

"మీ పరిస్థితే ఇలా ఉంటే ఇంక మేమేం చెయ్యాలి సార్?"

"మీ పరిస్థితికేమయింది? తెలుగుగంగలో మునగటమే"

మాకు చిరాకేసుకొచ్చింది.

"సరే.. అదంతా ఎందుగ్గాని సార్.. మేము ఆ బాంక్ మేనేజర్ మీద కంప్లెయింట్ ఇవ్వదల్చుకున్నాం"

అతను ఉలిక్కిపడ్డాడు.

"ఏంటి? కంప్లెయింట్ ఇస్తారా? మీకేమయినా మెంటలా? మన స్టేట్‌లో ఇలా దొంగనోట్ల కేసులు రిజిస్టర్ చేస్తూ కూర్చుంటే రోజుకి లక్ష కంప్లెయింట్స్ రిజిస్టర్ చేయాల్సి వస్తుంది"

"అంటే మా కంప్లెయింట్ తీసుకోరా సార్?"

"ఇంకా డౌటా?"

"అవున్సార్! కొంచెం డౌటే. ఇప్పుడే వెళ్ళి పోలీస్ కమిషనర్‌గారితో మీరు కంప్లెయింట్ రిజిస్టర్ చేసుకోనన్నారని చెప్తా!"

"పెద్ద ఉపయోగం ఉండదులేగానీ ఒకసారి డీజీపీకి కంప్లెయింట్ చేయకూడదూ? వెరయిటీగా ఉంటుందిగా"

విజయ్ యాదవ్ ఓ క్షణం ఆలోచించాడు.

"దానిబదులు తుగ్లక్ చానెల్‌వాళ్ళ దగ్గర కెళ్ళామనుకోండి! ఎలా వుంటుంది?"

"సరదాగానే ఉంటుంది.. వెళ్ళండి! ఇంకా

నిలబడ్డారేం? వెళ్ళండి, వాడు దొరక్కపోతే 'దగుల్బాజీ' చానెల్ అనీ అమీర్‌పేటలో కొత్తగా పెట్టారు. అక్కడికెళ్ళండి"

మేము బయటికి వచ్చేశాం! కొంత దూరం వెళ్ళాము. ఆ సబ్ఇన్‌స్పెక్టర్ మోట ర్‌సైకిల్ మీద స్పీడ్‌గా వచ్చి మమ్మల్ని కలుసుకున్నాడు.

అతని వెనుక ఇద్దరు కానిస్టేబుల్స్.

"హలో! వన్ మినిట్.. ఆగండి"

"ఏమిటి? "

"నా మీద కంప్లెయింట్ ఇవ్వడానికి టీవీ చానెల్‌కెళ్తున్నారా? "

"డౌటా? " అడిగాడు జగన్.

"అయితే, నాకో కొత్త అయిడియా వచ్చింది"

"కొత్త అయిడియాలొస్తే మీ డైరీలో రాసుకోవాల్సార్. ఇలా ఊళ్ళో అందరికీ ఛేజ్ చేసి వినిపించకూడదు."

"ఆ మాట నిజమేగానీ నిన్ను మూసేసే ముందు నీతో డిస్కస్ చేయటం అవసరం గదాని వచ్చా"

అందరం ఉలిక్కిపడ్డాం.

"ఏంటి? నన్ను మూసేస్తారా? " అడిగాడు జగన్.

"అవును"

"ఎందుకు? "

"నీ మీద చాలా కేసులున్నాయ్"

"వ్వాట్? నా మీద కేసులా! ఏంటవి? "

"నెంబర్ వన్.. దొంగనోట్ల చెలామణీకి ప్రయత్నించటం, నెంబర్ టూ అంతర్ రాష్ట్ర నకిలీ నోట్ల ముఠాలతో కలిసి నకిలీ నోట్లు బంగ్లాదేశ్ నుంచి దిగుమతి చేసుకోవటం, నెంబర్ త్రీ.. బ్యాంక్ సిబ్బంది సాయంతో నకిలీ నోట్లను ఎటిఎమ్ ద్వారా చెలామణీ చేయటం. త్రీనాట్ త్రీ.." అంటూ కానిస్టేబుల్‌ను పిలిచాడతను.

"యస్సార్"

"వీడిని నాన్‌బెయిలబుల్ సెక్షన్ కింద మూసేయడానికి ఈ కేసులు చాలను కుంటా? "

"మీరు మరీ టూమచ్ సార్. కొంచెం హైలెవెల్లో ఉన్నోడిని మూయాలంటే కేసులు ఉండాలిగానీ ఈ మిడిల్‌క్లాస్‌గాళ్లకు కేసులు ఎందుకు సార్! ఏ కేసూ లేకుండా మన లాకప్‌లో ఎంతమంది లేరు? "

"అది కరెక్టేగానీ ఇవాళ్రేపు ఈ చానెలోళ్ళతో జర కిరికిరిగుంది కదా.. అందుకే"

"ఆ చానెలోళ్ళను కూడా లోపటేద్దాం సార్!"

"హలో! కొంచెం ఓవర్‌గా మాట్లాడుతున్నట్లున్నారు? " అన్నాడు జగన్.

"అవును! నీకు టాకింగ్ కంటే యాక్షన్ లైకింగనుకుంటా. త్రీనాట్ త్రీ తీసుకెళ్లి లాకప్‌లో పడేయండి" అనగానే జగన్‌ని పట్టుకుని పోలీస్‌స్టేషన్‌కి లాక్కెళ్ళసాగారు.

మేమంతా అడ్డుపడ్డాం.

"ఇదన్యాయం. చానెల్‌కి చెప్తామని బెదిరించినంత మాత్రాన మా వాడిమీద దొంగ కేసులు పెట్టి అరెస్ట్ చేస్తారా? " అరిచాడు శంకరమూర్తి.

"హమ్ టీవీ చానెల్‌కెళ్ళి నీ సంగతంతా చెప్తాయ్!" అన్నాడు హమీద్‌మియా.

"టీవీ చానెల్సంటే చాలా ముచ్చటగా ఉన్నట్లుందే మీకు. మీ బులపాఠం తీరుస్తా! టీవీ చానెల్‌ని నేనే పిలిపిస్తా!" అంటూ ఏదో చానెల్‌కి ఫోన్ కొట్టాడు.

"మనం వీడితో మాట్లాడటం అనవసరం. ముందు ఒక లాయర్‌ని పట్టుకుని బెయిల్ ట్రై చేద్దాం" అన్నాడు విజయ్.

తీరా మేము లాయర్ దగ్గరకెళ్ళేసరికి అప్పటికే తుగ్లక్ చానెల్లో జగన్‌ని ఇంటర్వ్యూ చేస్తున్నాడు జర్నలిస్ట్.

"గజనీ! ఈ జగన్ ఒక అంతర్‌రాష్ట్ర దొంగల ముఠా నాయకుడని పోలీసులు అనుమానిస్తున్నారు గజనీ.. ఇతనికి ఆల్ ఖైదాతో కూడా దగ్గర సంబంధాలున్నాయనీ, ఆ నెట్‌వర్క్ ద్వారానే బంగ్లాదేశ్ నుంచి నకిలీ నోట్లు దిగుమతి చేసుకుంటున్నాడనీ



తెలుస్తోంది"

జగన్ మండిపడ్డాడు.

"ఏయ్, నీకేమయినా మెంటలా? నాకు ఆల్‌ఖైదాతో సంబంధాలున్నాయా? ఎవడ్రా నీకు చెప్పింది. ఆడ్నీ నిన్నూ నిలువుగా నరుకుతా" అంటూ జగన్ అతని మీదకెళ్ళడంతో ఇంటర్వ్యూ ఆగిపోయింది.

"నిందితుడు మా జర్నలిస్ట్‌మీదా, కెమెరా మీదా దాడి చేయటం వల్ల ఆ వివరాలు పూర్తిగా అందించలేకపోతున్నాం! త్వరలో మరిన్ని వివరాలు అందిస్తాం" అంటూ ఆ న్యూస్ ముగించింది న్యూస్ రీడర్.

"దిసీజ్ టూమచ్" అన్నాడు హమీద్‌మియా.

"ఈ చానెలోళ్లు పెద్ద న్యూసెన్స్ అయిపోయారు" అన్నాడు విజయ్. ఆ సాయంత్రాని కల్లా జగన్‌ని బెయిల్‌మీద విడిపించాం. తీరా జగన్ ఇల్లు చేరుకునేసరికి ఓ వ్యక్తి ఇంటి దగ్గర అతని కోసం ఎదురుచూస్తూ కనిపించాడు.

"ఎవరు మీరు? " అడిగాడు జగన్

"నమస్తే సాబ్! నా పేరు బాల్‌రాజ్. ఓల్డ్‌సిటీ నుంచి వచ్చా"

"ఏం కావాలి మీకు? "

"అదే టీవీలో మీ ఇంటర్వ్యూ చూసినా సార్. దాన్దిక్కుకెళ్లి నీతో జర మాట్లాడదామనీ వచ్చా"

"ఏం మాట్లాడాలి? "

"మనిద్దరమే సీక్రెట్‌గా మాట్లాడితే మంచిగుంటది సార్. ఈళ్ళందరి ముందూ మంచిగుండది"

మేమంతా మొఖాలు చూసుకున్నాం-

"సరే- బయట నిలబడతాంలే" అని బయటికొచ్చి కిటికీ దగ్గర నిలబడ్డాం.

లోపల్నుంచి వాళ్ళ మాటలు చాలావరకు వినబడుతూనే ఉన్నాయ్.

"గదే సార్. నేను గూడా నీ లెక్కనే నకిలీ నోట్ల దందా జేస్తున్నా!

అయిదేళ్ళకెళ్ళి నా దందా మంచిగా నడుస్తున్నది. సిటీ అంతా నాకు ఏజెంట్లు, సబ్ ఏజెంట్లూ ఉన్నారన్నట్లు"

"ఇదంతా నాకెందుకు జెప్తున్నావ్? " చిరాగ్గా అన్నాడు జగన్.

"గదే సార్.. నువ్ జాలీ నోట్స్ డైరెక్ట్‌గా బంగ్లాదేశ్‌కెళ్ళి హోల్‌సేల్‌గా ఇంపోర్ట్ జేసుకుంటున్నావని తుగ్లక్ చానెల్లో చెప్తున్రు! మమ్మల్ని మీకు ఏజెంట్స్‌గా అపాయింట్ జేసుకుంటే మీకు రొటేషన్ ఎక్కువవుతది- మాకూ ప్రాఫిట్స్ పెరుగుతాయ్"

జగన్‌కి వళ్ళు మండిపోయింది.

"ఏయ్! నీకేమయినా దమాకుందా? నేను దొంగనోట్లు వ్యాపారం చేయటమేంటి? ఆ మెంటల్ చానెలోడు ఏదో వాగితే నువ్వది నమ్మేస్తావా? " అన్నాడు ఆవేశంగా.

"కోపమొద్దు సార్! నువ్వీదందా జేస్తున్నట్లు నేను భీ ఎవళ్ళకీ జెప్ప! మనలో మనం జూసుకుందాం! ఇగో నా బిజినెస్ కూడా క్లియర్ టరమ్స్‌తో ఉంటది సార్. మిగతావాళ్ళ లెక్క 'ధోకాబాజ్' ఉండది! నువ్ నాకు కోటి రూపాయలు నకిలీ నోట్లు ఇచ్చినావనుకో.. నేన్నీకు యాభై లక్షలు మంచినోట్లిస్తా! ఎట్లున్నది నా ఆఫర్? "

జగన్ లేచి నిలబడ్డాడు.

"ఏయ్! నీకు మంచిగా చెప్తే అర్థం

# కాంచాని హాస్పిటల్ వారి కృతజ్ఞతాభివందనములు



కాంచాని హాస్పిటల్, తాడిపత్రి.

అమ్మా, నాన్న శుభాశీస్సులతో...

**కాంచాని నాగమునెమ్మ**
**కాంచాని పుల్లారెడ్డి**

8-4-2010 తేదీ గురువారం
శ్రీ కాంచాని హాస్పిటల్ నూతన భవనం
ప్రారంభించిన సందర్భంగా విచ్చేసిన బంధుమిత్ర
శ్రేయోభిలాషులకు మా హృదయపూర్వక
కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం.

ఇట్లు

**డాక్టర్ కె.వి.చంద్రమౌళిరెడ్డి**, ఎం.బి.బి.ఎస్., ఎం.డి.
**డాక్టర్ కె.హేమలత**, ఎం.డి., డి.జి.ఒ.
తాడిపత్రి.

తాడిపత్రి పట్టణంలో మొట్టమొదటిసారిగా అత్యంత
ఆధునిక సౌకర్యాలతో, లిఫ్ట్ సిస్టంతో ప్రారంభమైన
'కాంచాని హాస్పిటల్'కు శుభాభినందనలతో...

అభినందనలతో...

**కె.వి.శివారెడ్డి**, సి.ఇ.ఒ.
**శ్రీమతి కె.విజయలక్ష్మి**
తాడిపత్రి.

Eenadu-Tadipatri-8008573061

కాదా? నాకలాంటి దందా లేదని చెప్తుంటే నీక్కాదూ? "

"అయితే ఇంకోమాట జెప్తా సార్.. కోటికీ అర్వై లక్షలు మంచినోట్లిస్తా! ఇంత మంచి రేటు ఎవ్వరూ ఇవ్వరు. గింతకంటే ఈ సిటీలో ఎవడూ నీకెక్కువివ్వడు"

"అరె నీయవ్వ! చెప్తుంటే నీక్కాదూ? "

"ఇంక లాస్ట్ మాట చెప్తున్నా సార్! కోటికి డెబ్బయ్ లక్షలు మంచి నోట్లిస్తా! ఇంత మంచి ఆఫర్ దావూద్ ఇబ్రహీమ్ కూడా ఇవ్వడు సార్"

జగన్‌కి కోపం ఆగలేదు. అమాంతం అతని కాలర్ పట్టుకున్నాడు.

"ఏయ్.. మర్యాదగా నా ఇంట్లోనుంచి పోతావా లేదా? "

మేమంతా పరుగుతో వెళ్ళి జగన్ వాడిని కొట్టకుండా అడ్డుపడ్డాము.

"జగన్! వీడినేమీ అనకు. లేకపోతే ఆ ఎస్సైగాడు ఇంకో కేస్ పెడతాడు నీమీద" అన్నాడు విజయ్.

దాంతో జగన్ అతన్ని వదిలేశాడు.

వాడు ఇంక ఆగకుండా హైస్పీడులో పరుగెత్తాడు బయటకు. ఆ తర్వాత రెండ్రోజుల వరకూ దొంగనోట్ల వ్యాపారస్తులు పది పది హేనుమంది బిజినెస్ అంటూ జగన్ కోసం వస్తూనే ఉన్నారు. తన్నులు తిని పోతూనే ఉన్నారు.

"ఈ న్యూస్ చానెల్స్ వల్ల ఇంత న్యూసెన్స్ ఉందని నాకు తెలీదు" అన్నాడు జగన్.

"అసలు దొంగనోట్ల వ్యాపారం చేసేవాళ్ళు మన రాజధానిలో ఇంతమంది ఉన్నారంటే నాకు చాలా షాకింగ్‌గా ఉంది" అన్నాడు శంకరమూర్తి.

"మన స్టేట్ అభివృద్ధి చెందిందని రాజకీయ నాయకులు స్టేట్‌మెంట్ ఇస్తుంటారు. వాళ్ళ ఉద్దేశం దొంగనోట్ల చెలామణీలో అభివృద్ధి చెందిందనే" అన్నాడు మొహిందర్.

మర్నాటి నుండీ అలా జగన్‌కోసం వచ్చే వాళ్ళను గేట్ దగ్గరే ఆపేయమని సెక్యూరిటీకి ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చాడు హమీద్‌మియా.

ఆ మర్నాడు మళ్ళీ జగన్ కోసం సబ్ఇన్‌స్పెక్టర్, అతనితోపాటు తుగ్లక్ చానెల్ జర్నలిస్ట్ రాజు వచ్చేసరికి మాకు అనుమానం కలిగి అందరం జగన్ ఫ్లాట్ బయట నిలబడ్డాం.

లోపల్నుంచి జగన్, సబ్‌ఇన్‌స్పెక్టర్ గొంతులు వినబడుతున్నాయి.

"చూడు జగన్‌భాయ్.. నీ దగ్గర దాచేదేముంది? నీమీద దొంగనోట్ల కేస్ బనాయించినప్పుడు నువ్ నిజంగానే బంగ్లాదేశ్ వెళ్ళి నకిలీ నోట్లు ఇంపోర్ట్ చేసుకుని మీ ఏజెంట్స్ ద్వారా చెలామణీ చేయిస్తున్నావన్న సంగతి నాకు తెలీలేదు.

నిజంగా నువ్ నకిలీ నోట్ల దందా జేస్తుంటే అరెస్ట్ చేయడానికి నేనేం పాగల్ గాడినా! మన ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నన్ని దొంగనోట్ల ముఠాలు ఇంకే స్టేట్‌లోనూ లేవు. అయినాగానీ ఒక్కళ్ళనయినా అరెస్ట్ జేసి జైలుకి పంపామా? లేదుగదా? అందుకని జర దొంగనోట్లు మాక్కూడా సప్లయ్ చేశావనుకో.: మేమూ నాలుగు పైసలు కమాయించుకుంటాం. మా పోలీసోళ్ళ జీతాల సంగతి నీకు తెలీందేముందిరా భయ్. రోజూ నాలుగు పెగ్గులు కొట్టడానికి కూడా చాలదు. పెండ్లాం బిడ్డలుగలోళ్లం. జర మదద్‌జెయ్ భాయ్. అదీ ఒక్క పెండ్లాం కాదు..ఇద్దర్ని పోషించాలె"

జగన్ మండిపడ్డాడు.

"ఇదిగో నీక్కూడా మెంటలా? నేను సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ని- దొంగనోట్ల దందాజేసే ఖర్మ నాకేంటి? అసలు ఆ అనుమానం ఎందుకొచ్చింది నీకు? "

"నాకన్నీ తెలుస్తయ్‌రా భయ్! దొంగలంతా రోజూ నీ దగ్గరకొచ్చి మొత్తం వాళ్ళ దందాల ఇన్‌ఫర్మేషనంతా నాకు చెప్పిపోతారు. వాళ్ళే చెప్పారు- రెండు రోజుల్నుంచీ దొంగనోట్ల దందాజేసే వాళ్ళందరూ నీ

చుట్టూ తిరుగుతున్నారని. అప్పుడు తెల్సింది నాకు- నిన్ను అరెస్ట్ చేసి నేనెంత తప్పుజేశానోనని! ఆ ముఠాలతో ఎంత వ్యాపారం చేసుకుంటావో చేసుకో! కానీ నాక్కూడా ఒక షేర్ ఇవ్వు.. ఏమంటున్నా? "

జగన్‌కి మండిపోయింది.

"అరె! చెప్తుంటే నీక్కాదు? ఇంకోసారి దొంగనోట్లడిగావంటే మర్యాదగా ఉండదు"

ఎస్‌ఐ చానెల్ వాడితో మాట్లాడాడు.

"చూశావా రాజూ! నువ్ నాతో ఉండటం వల్లే జగన్‌భాయ్ అలా మాట్లాడుతున్నాడు. నాతో బిజినెస్ కమిటయితే రేపు నువ్వే బ్లాక్‌మెయిల్ చేస్తావ్ కదా? అట్లాంటి పనులు చెయ్యనని ఆయనకు చెప్పు"

వెంటనే రాజు మాట్లాడాడు.

"క్షమించు జగనన్నా! నేను బ్లాక్‌మెయిల్ చెయ్యటానికి రాలే! ఇన్‌స్పెక్టర్ సార్‌కి నకిలీ నోట్ల ఏజెన్సీగిన్నా ఇస్తే నాకూ మా ఏరియాకి ఏజెన్సీ ఇవ్వన్నా! లక్ష దొంగనోట్లకు నేను అరవై వేల మంచి నోట్లిస్తా!"

జగన్‌కి ఇంకా కోపం ఆగలేదు.

"ఇదిగో నాకు తిక్కరేగిందంటే మంచిగుండదు. మర్యాదగా వెళ్ళిపోండి! నన్ను తర్వాత జైల్లో వేసినా ఓకే. ముందు మీ ఇద్దరి అంతు చూస్తా!"

తిక్కగా అరిచాడు జగన్.

"అరె! అంత కోపం ఎందుకన్నా! మేమేం విలన్స్ కాదు. మా టీవీ చానెలోళ్ళ సంగతి నీకెరుకలేందేముంది? జీతాలు తక్కువ. జల్సాలెక్కువ! ఎంతమందినని బ్లాక్‌మెయిల్ జేస్తాం చెప్పు! మొన్నటికి మొన్న ఆ రాయలసీమ లీడర్‌ని బ్లాక్‌మెయిల్ జేస్తే వాడు మమ్మల్ని కిడ్నాప్‌జేసి కర్నూలు తీసుకుపోయి ఇదిగో.. ఈ చెయ్యి ఇరిచేశాడు. ఇంకోసారి రాయలసీమోళ్ళ జోలికి పోమని వాడికాళ్ళమీద పడి బతిమాలినాక ఇడిచిపెట్టిండు" అన్నాడు తుగ్లక్ చానెల్ రాజు.

"అయితే నన్నేం చేయమంటావ్? "

"నాకు నకిలీనోట్ల ఏజెన్సీ ఇవ్వనీకి ఇష్టం లేకుంటే- పోనీ నెలకు పాతికవేలు కమిషనివ్వు! ఇంక మా చానెల్ నీ జోలికి రాకుండా నేను జూసుకుంటా"



మా ప్రెసిడెంట్ హమీద్‌మియాకి ఇంక కోపం ఆగలేదు.

"ఏయ్! మీకేమయినా దమాకుందా? మా అపార్ట్‌మెంట్స్‌ల అన్నీ మంచి సిటిజెన్స్ ఉన్నాయ్‌రా! మీ పోలీసోళ్ల లెక్క, మీ టీవీ చానెలోళ్ల లెక్కా ఫాల్తూదందా- హమ్ నహీ కర్‌తే! సమ్‌జా? జగన్‌కి ఏటీఎంలో ఒక దొంగ నోటొస్తే- దునియాకీ కిరికిరీ చేస్తున్నయ్. మంచిగా ఈడకెళ్ళిపోండ్రి! కాకుంటే మా అపార్ట్‌మెంటోళ్లం అందరం కలిసి ఎటాక్ చేస్తయ్. మేము మీ ఇద్దర్నీ క్షైమా జేస్తయ్" ఆవేశంగా అనేసరికి ఇన్‌స్పెక్టర్‌కి కోపం వచ్చింది.

"అంటే.. మేము మంచిగా చెప్తే వినరన్న మాట! సరే, ఒరే రాజూ.. ఈళ్లకు, దొంగ నోట్ల దందాకి ఇంటర్నేషనల్ లింక్స్ ఉన్నవని, న్యూస్‌లో జెప్పు! బంగ్లాదేశ్‌తో వీడికి దొంగనోట్ల లింకుందని కేసులు పెడతా!"

"వీడొక్కడి మీదా కేసులు పెడితే కాద్సార్ ఈ అపార్ట్‌మెంట్స్‌లో అందరూ ఇదే దందా జేస్తున్నారని బనాయించినారంటే అందరూ సుధరాయిస్తరు"



"అవురా- తలో లక్షా ఇస్తేగానీ ఇడవనంటే ఆళ్ళే పైసలు తెచ్చిస్తారు కొడుకులు"

వాళ్ళిద్దరూ అలా రెచ్చిపోయి మాట్లాడు తూంటే మొహిందర్‌సింగ్ స్తంభం వెనుక నుంచి మా మధ్యలోకొచ్చాడు.

"ఏందిరా! మా అందరిమీదా దొంగనోట్ల- దొంగ కేస్‌లు పెడతారా?" అడిగాడతను.

ఇన్‌స్పెక్టర్‌కి కోపం ఆగలేదు.

"సాలే నను 'రా' అంటావ్ బే" అంటూ కాలర్ పట్టుకుని దూరంగా జీప్‌లో కూర్చున్న కానిస్టేబుల్స్‌ని పిలిచాడు.

"ఈ సాలేగాళ్ళందర్నీ జీప్ ఎక్కించండి!" అన్నాడు మహదర్పంతో కానిస్టేబుల్ మా దగ్గరకు రాబోతూంటే, అప్పుడే టేబుల్ మీదున్న మా కాలనీ టి.వి.లో ఒక ఫిలిమ్ మొదలయింది మా కాలనీ లీడర్స్ ఉన్నారు.

ఇన్‌స్పెక్టర్ రాజూ నకిలీ నోట్ల ఏజెన్సీ ఇమ్మని మా వాళ్లని బెదిరించటం, ఇవ్వ నంటే అరెస్ట్ చేస్తాననటం - అన్నీ డైలా గుల్తో సహా కనిపిస్తూండేసరికి అందరూ షాకయి నిలబడిపోయారు.

"ఏమంటార్రా ఇప్పుడు! మీ డ్రామా అంతా సెల్‌లో షూట్ చేశామని పరేషాన్లో ఉన్నారా? ఇప్పుడీ సినిమా తీసుకెళ్ళి వేరే చానెలోళ్లకి ఇచ్చామనుకో - ఏమవుతార్రా మీరిద్దరూ" అడిగాడు మొహిందర్ వాళ్ళిద్దరి మొఖాలూ మాడిపోయినయ్.

అమాంతం మా కాళ్ళమీద పడ్డారు.

"సార్- అలవాట్లో పొరబాటు జరిగిపో యింది. సారీ సార్ ఫిల్మ్ ఎవరికి ఇవ్వ కండి! ఇంక జన్మలో మీ అపార్ట్‌మెంటోళ్ళ జోలికి రాము" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నన్ను కూడా క్షమించడన్నా! నన్ను జైల్లో వేయిస్తే మీకేం లాభం! నా ఉద్యోగం పోతది! ఇంక జన్మలో గిసంటి దందాలు జేయనన్నా! మళ్లీ మీ జోలికొస్తే చెప్పు తీసు క్కొట్టండి-"

"మా జోలికే కాదు. ఇంకెవర్ని బ్లాక్‌మె యిల్ చేశారని తెలిసినా, ఇంకెవరిమీద దొంగ కేస్‌లు పెట్టారని తెల్సినా - ఈ ఫిల్మ్ అందరి సెల్‌లకూ పంపిస్తాం-" బెదిరిం చాడు మొహిందర్.

"నువ్వే చూస్తావ్ గదన్నా! మీరెట్ల జెప్తే అట్ల నడుచుకుంటాం"

"జానేదో భాయ్. వీళ్ళిద్దరినీ చట్టానికి అప్పజెప్పినా- మనకేమీ ఫాయిదా ఉండయ్- ఎందుకంటే- వీళ్ళిద్దరితోనే బ్లాక్ మెయిలిం గ్‌లూ, దొంగ కేస్‌లూ ఖతమ్ అవ్వయ్!

పూరా దేశమంతా గిసంటి కర్రెప్టెడ్ వాళ్ళ తోనే 'హౌస్‌ఫుల్' ఉన్నయ్"

"ఇప్పుడు వీళ్ళని వదిలేస్తే వీళ్లు రెచ్చిపో తారు కదా!" అడిగాడు శంకరమూర్తి.

"వీళ్ళని పనిష్మెంట్ చేసినా ఉపయోగం లేవ్ - మొత్తం మనదేశంలో డెమొక్రసీయే డిఫెక్టివ్ ఉన్నయ్- చైనా టైప్ కమ్యూనిజం వస్తేనే ఈ దేశం బాగుపడతయ్-" అన్నాడు హమీద్‌మియా.

అందరం ఆలోచనలో పడ్డాం-

నిజంగా చైనా టైప్ ప్రభుత్వమే మన దేశాన్ని రక్షిస్తుందా? మేము డిస్కస్ చేసు కుంటూంటే ఇన్‌స్పెక్టర్, తుగ్లక్ చానెల్ జర్నలిస్టు రాజూ నెమ్మదిగా అక్కడినుంచి జారుకున్నారు. Ⓒ



అతికొద్ది సినిమాల్లో నటించడం ద్వారానే పరిశ్రమలో తన స్థానాన్ని సుస్థిరం చేసుకున్న ఆ కేరళ భామ 2003లో మళయాళ సినిమా 'మనస్సినక్కరె' ద్వారా రంగప్రవేశం చేసింది. తర్వాత శరత్‌కుమార్‌తో తమిళంలో 'అయ్య', రజనీ కాంత్‌తో 'చంద్రముఖి', అజిత్‌తో 'బిల్లా' చిత్రాల్లో నటించింది. లక్ష్మి, బాస్, యోగి, తులసి, దుబాయ్ శీను - తదితర తెలుగు సినిమాలతో యువత మదిని దోచింది. ఆయా భాషా ప్రజల అభిరుచులకు అనుగుణంగా తన శరీర బరువును మలచుకుంటూ సాగుతున్న ఆ ఇరవై ఐదేళ్ల నయనతార తన ఆరోగ్య రహస్యాలను వివరించిందిలా..

# నయన నాజూకు రహస్యం

★ సరైన ఆహారం, నిరంతర పరిశ్రమతోనే నా శరీర సౌష్టవాన్ని కాపాడుకుంటున్నాను. ఎంత తలమునకలుగా పని ఉన్నా వ్యాయామాన్ని మాత్రం ఎప్పుడూ ఎగ్గొట్టను. ఎక్కడికెళ్లినా అందుబాటులో జిమ్ ఉంటే తప్పకుండా ప్రతిరోజూ వెళతాను.

★ భవిష్యత్తు గురించిన బెంగ, గతాన్ని తలచుకుని బాధపడటంలాంటివి నేనెప్పుడూ చేయను. మన చేతిలోనున్న వర్తమానాన్ని అందంగా మలచుకుంటూ సాగడమే నా తత్వం.

★ ఎంతో కష్టపడి అందమైన ఆకారాన్ని సాధించుకున్నాను. దాన్ని ఉత్తిపుణ్యానికే పోగొట్టుకోలేను. అందువల్లనే ఫిట్‌నెస్ పరంగా ఎప్పుడూ రాజీ పడను. ఈ విషయంలో మనసులో ఎక్కడా నెగిటివ్ ఆలోచనకు తావివ్వను.

★ అందం, ఆరోగ్యానికి సంబంధించి చాలా కచ్చితంగా ఉండటంతో కొన్ని ఆహార పదార్థాలను తినకుండా ఉండాల్సివస్తోంది. ముఖ్యంగా కొబ్బరినూనెతో అమ్మ వండే చేపలకూర మిస్ అవుతుంటాను. పళ్లరసాలు, నీరు బాగా తాగుతాను.

★ ప్రేక్షకులు సినీ తారలు అందంగా ఉండాలని కోరుకుంటారు. అందువల్ల నేను చర్మ సంరక్షణకోసం ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నాను. వాతావరణంలో మార్పులు, ఒక ప్రదేశంలోని నీటిగుణం, కాస్మెటిక్స్ సైతం చర్మంపై తీవ్ర ప్రభావాన్ని చూపిస్తుంటాయి. అందువల్ల జాగ్రత్తలు తప్పని సరి.

★ ప్రతిరోజూ వ్యాయామం చేస్తున్నా అత్యంత కఠినమైన సాధనల జోలికి మాత్రం వెళ్లను. అలాగే తినే ఆహారం మీద నియంత్రణ పాటిస్తాను. గుడ్డెద్దు చేలో పడ్డట్టు తిండి విషయంలో ఇష్టానుసారం చేయకుండా సరైన రీతిలో నియంత్రణ పాటించడంతోనే ప్రగతి

సాధ్యం. అందువల్లనే స్వీట్లు, ఐస్ క్రీములు, నూనె పదార్థాలు అసలు ముట్టను. అయితే మసాలా పదార్థాలంటే నాకిష్టం. ఇష్టాయిష్టాలను కూడా మన ఆరోగ్యం దృష్ట్యా చక్కగా మలచుకో వాల్సివుంటుంది.

★ ఇక హాబీస్‌లోనూ అనేక మార్పులు, చేర్పులు జరుగుతుంటాయి. మం చి శ్రావ్యమైన సంగీతాన్ని ఆస్వాదించడం, దూరాభార ప్రయాణాలు, కొత్త ప్రదేశాలను చూడటం నాకిష్టమైన పనులు. అలాగే చాలా దూరం డ్రైవ్ చేసుకుంటూ పోతుంటాను.

★ నేను చాలా సున్నితమైనదాన్ని. ఎప్పుడైనా నేనూహించినదానికి భిన్నంగా జరిగినప్పుడు నా మొహంలో కోపం, దుఃఖంలాంటివి ప్రస్ఫుటంగా కన్పిస్తాయి. దాపరికం నావల్ల కాదని అంటుంటారు.

★ నాకు దైవభక్తి మెండు. కష్టాల్లో దేవుడే ఆదుకుంటాడనే నమ్మకం ఆత్మవిశ్వాసాన్ని, ఊరటని ఇస్తుంది. అలాగనీ నాలో గుడ్డితత్వమో, ఉన్మాదమో ఎంతమాత్రం లేదు.

★ ఇక అమ్మానాన్నలు నాతో చాలా చనువుగా, స్నేహంగా ఉండటంతో ఎలాంటి విషయమైనా వారితో పంచుకుంటాను. నేను వారి గారాలపట్టినైనా మరీ ఎక్కువగా ముద్దు చేయరు.

★ చాలామంది నా కళ్లు అందంగా ఉంటాయని ప్రశంసిస్తుంటారు. నా మనోహరమైన చూపులు, హావభావాలు బాగుంటాయంటారు. బహుశా ఇదే నాలోని ప్లస్ పాయింట్.

★ అందం అనేది దేవుడు మనకు ప్రసాదించినది. కాస్త జాగ్రత్తలు తీసుకుని ఆరోగ్యాన్ని కాపాడుకోవడం మన చేతల్లోని పని. ఆరోగ్యవంతులే మానసికంగా, శారీరకంగా చురుకుగా ఉంటారు.



★ నా నడుం చుట్టుకొలతను, అధిక బరువును దించుకునేందుకు ట్రైనర్‌ను ఏర్పాటు చేసుకున్నాను. మా అమ్మ కూడా నా బరువు, నా రూపం విషయంలో ఎప్పటికప్పుడు సలహాలు ఇస్తుంటుంది.

★ ధ్యానం, యోగ చేస్తూ, ఆహార నియమాలను పాటించమని అమ్మ సూచించింది. ప్రశాంత చిత్తంతోనే చాలా సాధించగలం. చివరికి బరువు తగ్గడమైనా అంతే.

★ నా విషయంలో ఒక్కో సినిమాకు బరువు పెరగడం, తగ్గడంలాంటివి జరిగాయి. అయితే నాజూకుగా ఉండేందుకు విచక్షణా రహితంగా తీవ్రమైన వ్యాయామాలు చేయడం స్త్రీలకు అంత మంచిది కాదని డాక్టర్లు చెబుతుంటారు. ఇది ప్రతి ఒక్కరూ గుర్తుంచుకోవాల్సిన అంశం.

—కె.ఆర్.జి

# మనసున ఉన్నదీ...

★ ఏప్రిల్‌లో ప్రచురించిన 'ఇల్లు' నవల చాలా బాగుంది. సొంత ఇంటికోసం మధ్యతరగతి గృహిణి పడేపాట్లను రచయిత్రి చాలా స్పష్టంగా వివరించారు. అలాగే చివర్లో ఊహించని విధంగా కుటుంబ సభ్యులందరినీ దూరంచేసి, పద్మజను ఒంటరిదాన్ని చేసి, నవలకు చక్కటి ముగింపు ఇచ్చారు. ఇంత మంచి నవలను ప్రచురించిన చతురకు ధన్యవాదాలు.

**–ఎ.వి.సూర్య నారాయణ,**
న్యూమెట్టుగూడ, సికింద్రాబాద్

★ 'ఇల్లు' నవల ముగింపు మాత్రం బాధ కలిగించింది. ఎంతో కష్టపడి ఇష్టంగా కట్టుకున్న ఇంటికి వెళుతుంటే ప్రమాదంలో పద్మజ తప్ప అందరూ చనిపోతారు. నవలను చక్కగా తీర్చిదిద్ది ముగింపు మాత్రం ఎందుకిలా విషాదం చేశారోనన్పించింది.

**– ఎం.రుక్మిణీ కృష్ణ,**
హరిపురికాలనీ, హైదరాబాద్

★ చతుర ప్రచురించినప్పటి నుండి విడవకుండా చదివే పాఠకురాలిని నేను. ఇంతవరకూ ఈ మాసపత్రిక ద్వారా లెక్కలేనన్ని నవలలను చదివాను. ప్రతినెలా మొదటివారంలో చతురకోసం ఎదురు చూస్తుంటాను. మేగజైన్‌ను అందంగా తీసుకుని వస్తున్న సంపాదకులకు ధన్యవాదాలు.

**– పి.అనసూయ, చెన్నై**

★ నాలుగు ప్రత్యేకతలు గల సాహితీ వేదికగా ఏప్రిల్ 'చతుర' అలరారింది. మునిపల్లె లక్ష్మీరమణ 'ఇల్లు' ముగింపు ఎంతో స్ఫూర్తిదాయకం. అభాగ్య వృద్ధ స్త్రీలకు కొండంత అండగా నిలిచిన పద్మజ పాత్ర చాలా ఆకట్టుకుంది. జ్ఞానపీఠాలులో బహుముఖీన ప్రతిభా పాటవాలుగల శివరామ కారంత్ సాహిత్య విశేషాలను చదివి ఆనందించాను. అలాగే అస్పృశ్యతా దురాచారంపై మూడు దశాబ్దాల క్రితమే ఇనాక్ రాసిన పద్యనాటకం 'మునివాహనుడు' కథ వెనుక కథ బాగుంది. ఇక చివరిగా సైన్సు నవలా చక్రవర్తి హెచ్.జి.వెల్స్ 'ది ఐలాండ్ ఆఫ్ డా.మోరో' నవలలో ఉన్మాదుల చేతుల్లో ఆధునిక శాస్త్ర పరిజ్ఞానం పడితే వచ్చే ప్రమాదాన్ని హెచ్చరించడం బాగుంది. ఇన్ని మంచి విషయాలతో వెలువడిన చతురకు అభినందనలు.

**– ఎం.డి.సౌజన్య, తెనాలి**

★ 'ఇల్లు' నవల ముగింపు విషాదం కలిగించినా, చివరకు పద్మజ జీవితాన్ని సామాజిక సేవ వైపుకు మలుపు తిప్పడం బాగుంది. ఈసారి అపార్ట్‌మెంటాలజీలో ఏటీఎమ్‌ల గురించి వ్యంగ్యంగా వివరించిన తీరు చాలా బాగుంది. కథ వెనుక కథ, కాలాతీతం చాలా ఆసక్తిని కలిగించే శీర్షికలు. వీటి ద్వారా చాలా తెలుసుకుంటున్నాం. ముఖ్యంగా ఆంగ్ల పరిజ్ఞానం తక్కువగా ఉన్న నాబోటి పాఠకులకు ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక మృష్టాన్న భోజనమే.

**–ఎం.శ్రీలక్ష్మి, వైజాగ్**

★ 'రాజకీయాలు యమవీజీ గురూ' సరదాగా ఉంది. రాజకీయ నాయకుల గిమ్మిక్కులను భలే రాశారు. 'ఉందిలే మంచికాలం ముందు ముందునా' టాంక్‌బండ్ కథ బాగుంది. 'ఇల్లు' నవలలో శ్రీరామ్మూర్తి క్యారెక్టర్ సహజత్వానికి భిన్నంగా ఉందేమోనన్పించింది. అలాంటివారు అందరినీ మోసగించి ఉడాయిస్తారే తప్ప స్వామీజీగా మారుతారా అనే సందేహం కలిగింది. నవల ఆద్యంతం చాలా ఆసక్తిగా చదివించింది.

**– వాడవల్లి రమాదేవి,**
ఆరుగొలను, కృష్ణాజిల్లా

---

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు,
చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ –500 082
ఈ మెయిల్ చిరునామా:
vipula.chatura@gmail.com

# కాప్షన్ మీదే - 17



**ఈనాడు** కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు **శ్రీధర్** వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి!
బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

**మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 19**

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : vipula.chatura@gmail.com

## ఉత్తమ వ్యాఖ్య :

**'పొట్ట'కోసం నేను ట్రయలేస్తుంటే,**
**మన 'పుట్ట'లో నుంచి మీరొచ్చారా ...**

–ధరణికోట శివరాం ప్రసాద్,
బోరబండ, హైదరాబాద్




## కాప్షన్ మీదే -16

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

**గురువుగారెప్పుడూ మనఆటే నేర్పిస్తారుగానీ.. ఏ కథక్కో కూచిపూడో నేర్పవచ్చుగా!**

–వాడపర్తి వెంకటరమణ, విశాఖపట్నం

**ఎవడిడబ్బా వాడు కొట్టుకుంటున్నప్పుడు.. మన బూరా మనం ఊదుకోవాల్సిందే!**

– కె.ఎన్నార్ నమ్మి, మార్టేరు

**ఫీజు తేవడం మరిచావా?**
**చచ్చాం, మింగుతాడేమో!**

– మహబూబ్‌షాహిద్ అహ్మద్, సూర్యాపేట

**వేసవి ఉచిత శిక్షణా శిబిరం**

– ముమ్మిళ్ల వందన,
హన్మకొండ, వరంగల్

# హిందీ కవితాకాశంలో నవతార అజ్ఞేయ్



సచ్చిదానంద్ హీరానంద్ వాత్స్యాయన్ అజ్ఞేయ్

**వ్యక్తి చైతన్యానికి ప్రాధాన్యమిచ్చి ప్రగతిశీల భావుకుడిగా, నవ్యకావ్య శైలి రూపకర్తగా, ప్రయోగవాదిగా ఆధునిక హిందీ సాహిత్య గగనాన అజ్ఞేయ్ ధ్రువతారై నిలిచారు. ఆయన ప్రతిభావ్యుత్పత్తులతో, దేశభక్తితో సాహిత్యానికీ, సమాజానికీ విశిష్ట సేవలందించారు. 'కిత్నీ నావోంమే కిత్నీబార్' అనే కవితా సంపుటికి 1978లో జ్ఞానపీఠ్ పురస్కారాన్ని అందుకున్నారు.**

సచ్చిదానంద్ హీరానంద్ వాత్స్యాయన్ కలం పేరు అజ్ఞేయ్. వాత్స్యాయన్ 1911 మార్చి 7న ఉత్తరప్రదేశ్‌లోని సుప్రసిద్ధమైన కుశీనగర్‌లో జన్మించాడు. వాత్స్యాయన్ తండ్రి పండిత్ హరినంద్ శాస్త్రి, పురాతత్త్వశాఖోద్యోగి. ప్రాచీన లిపి ప్రవీణుడాయన. తరచు బదిలీల కారణంగా దేశంలోని వివిధ నగరాలకు కుటుంబం తరలి వెళ్లవలసి వచ్చేది. అందుచేత వాత్స్యాయన్ బాల్యం ఊటీ, మద్రాసు, లాహోరు, లక్నో, జమ్మూ, శ్రీనగర్, పాట్నా, బరోడా, నలందా తదితర చోట్ల గడిచింది. హరినంద్ శాస్త్రి, సంస్కృతంలో గొప్ప పండితుడు. బాల్యం నుంచే వాత్స్యాయన్ సంస్కృతం, హిందీ, పర్షియన్, ఇంగ్లీషు భాషలు అధ్యయనం చేయసాగాడు. ఆయన చదువు వేర్వేరుచోట్ల సాగింది. విద్యాభ్యాసంతోపాటు రచనా వ్యాసంగం కూడా పురోగమిస్తూ వచ్చింది. పంజాబు విశ్వవిద్యాలయం మెట్రిక్ పరీక్ష ప్రయివేటుగా హాజరై ఉత్తీర్ణుడయ్యాడు. మద్రాసు క్రైస్తవ కళాశాలలో ఇంటర్మీడియట్ చదివాడు. లాహోరులోని ఫార్మన్ కళాశాలలో బీఎస్సీ చదివాడు. ఎంఏలో చేరి మొదటి సంవత్సరం పూర్తిచేశాడు. భగత్‌సింగ్ క్రాంతికారీ దళంతో సంబంధాలున్నందున నాలుగేళ్ల జైలుశిక్ష విధించాడు. విడుదలైన పిమ్మట ఆగ్రాలోని 'సైనిక్' పత్రిక సంపాదక మండలిలో కొంతకాలం పనిచేశాడు. తర్వాత కోల్‌కతాలోని 'విశ్వభారత్' పత్రికలో చేరాడు. వాత్స్యాయన్ ఆకాశవాణిలో, సైన్యంలో సేవలందించాడు. ప్రతీక్, దిన్‌మాన్, నవభారత్, టైమ్స్ పత్రికల సంపాదకత్వం వహించారు. ఆయనకు హిందీ, ఇంగ్లీషు భాషల్లో విశేష పాండిత్యం వుంది. కాలిఫోర్నియా, హైడెల్‌బెర్గ్ విశ్వవిద్యాలయాలలో భారతీయ సాహిత్య సంస్కృతులు బోధించాడు. జోధ్‌పూర్ విశ్వవిద్యాలయంలో తులనాత్మక సాహిత్యం ఆచార్యుడుగా పనిచేశాడు. ఎన్ని పదవులు నిర్వహించినా నిరంతరం రచనా ప్రక్రియను కొనసాగించాడు.

జ్ఞాన పీఠాలు 16

వాత్స్యాయన్ రచనా జీవితం 'ఆనందబిందు' అనే లిఖిత పత్రికతో ఆరంభమయింది. ఆయనే దానిని నడిపాడు. అప్పటికి ఆయన వయస్సు కేవలం పదకొండు సంవత్సరాలు. కళాశాల విద్యార్థిగా ఎన్నో గేయాలు రచించాడు. రవీంద్రుడు, ప్రేమచంద్, నిరాలా, జైనేంద్ర, మహాదేవి వర్మ, వినోబా, ఫ్రాయిడ్, ఇలియట్, లోహియా,

కార్ల్‌మార్క్స్, ఎం.ఎన్.రాయ్, జయప్రకాష్ పట్ల ఆయనకు ప్రత్యేకాభిమానం. జైల్లో ఉన్నప్పుడు తన పేరు చెప్పకుండా కథలు రాసి జైనేంద్రకు పంపారు. ఆయన వాటిపైన 'అజ్ఞేయ్' అని చేర్చి 'జాగరణ్' పత్రికకు పంపగా అవి ప్రచురణ అయ్యాయి. అప్పటి నుంచి వాత్స్యాయన్‌కు 'అజ్ఞేయ్' కలంపేరు రూఢి అయింది.

తన తొలి కవితా సంపుటి 'భగ్నదూత్'ను అజ్ఞేయ్ ఇరవైరెండోయేటనే వెలువరించాడు. ఛాయావాద కాంతులు విరజిమ్మే కృతి ఇది. హిందీ కవితాకాశంలో నూతన తార ప్రకాశమానమైనట్టు విమర్శకులు గుర్తించారు. గద్యపద్యాత్మక కావ్యం 'చింతలో స్త్రీ, పురుషుల మధ్య వివిధ రూపాలలో ప్రకటితమయ్యే ఆకర్షణను, వైమనస్యాన్ని ఆవిష్కరించారాయన. అయిదు భాగాలతో సాగిన బృహత్‌కావ్యం 'ఇత్యలమ్'. సామాజిక సమస్యలను ఇతివృత్తాలుగా స్వీకరించి, అనేక కోణాలలో కవిత్వీకరించిన కావ్యం 'బావ్‌రా అహేరి'. ఇంకా 'అరీ ఓ కరుణాప్రభామయ్', 'సాగర్ ముద్రా', 'మహావృక్షకే నీచే', 'కిత్నీ నావోంమే కిత్నీబార్', 'అంగన్‌కే పార్ ద్వార్', 'ఇంద్రధను రౌందెహుయే' మొదలైన ఆయన కవితా సంపుటాలు మానవతావాదాన్ని అద్భుతంగా అనేక పార్శ్వాలలో ప్రదర్శించాయి. నూతన ప్రతీకలకు నాంది పలికాయి. కొత్త భావ సముదాయాన్ని పాఠకులకందించాయి. ఆయన విలక్షణ కావ్యశైలికి శ్రీకారం చుట్టాడు.

కవిగా ఎంత శిఖరప్రాయులో అజ్ఞేయ్ నవలాకారునిగా అంత ఉన్నతపథం చేరుకున్నారు. 'శేఖర్ ఏక్ జీవనీ' నవల విప్లవమార్గం పట్టిన ఒక యువకుని వృత్తాంతం. ఇది వ్యక్తిస్వేచ్ఛకు పట్టంకట్టే నవల. ప్రధానంగా ఫ్రాయిడ్ సిద్ధాంత ప్రభావం కనిపిస్తుంది. మనస్తత్త్వ విశ్లేషణ భూమికగా రచించిన నవల 'నదీకే ద్వీప్'. అస్తిత్వ వాదాన్ని ప్రతిపాదించే నవల 'అప్నే అప్నే అజ్నబీ'లో మరణభీతిని అజ్ఞేయ్ అసమాన కౌశలంతో చిత్రీకరించాడు. కథారచయితగా కూడా ఆయనకు హిందీ సాహిత్యంలో విశిష్ట స్థానముంది. స్త్రీ పురుష సంబంధాలు, విప్లవ పంథా, నూతన జీవనరీతులు, మనోవిశ్లేషణ యిత్యాదుల చుట్టూ ప్రతిభాన్వితంగా అల్లిన కథలు 'శరణార్థి', 'జయదోల్', 'యే తేరె ప్రతిరూప్' మొదలైన కథాసంపుటాలలో కనిపిస్తాయి. 'ఉత్తర్ ప్రియదర్శి' నాటకం, 'ఆత్మనేపద్' అనే విమర్శనం, ఇంకా యాత్రా వృత్తాంతాలు, వ్యాసావళి, అనువాదాలు, సంకలనాలు మొదలైనవి అజ్ఞేయ్ సాహితీసేవను వెల్లడిస్తున్నాయి. ఆయన సంపాదకత్వంలో నాలుగు భాగాలుగా వెలువడిన 'తార్ సప్తక్' నూతన శైలికి కాణాచి.

జ్ఞానపీఠ్ పురస్కారాన్ని చేకూర్చిన 'కిత్నీ నావోంమే కిత్నీబార్' అజ్ఞేయ్ కవితా వైదుష్యానికి సముజ్జ్వల నిదర్శనం. ఈ కావ్యాన్ని భారతీయ జ్ఞానపీఠ్ 'ఏక్ తీర్థ యాత్ర్ కా కావ్య్ హై, సచ్ ముచ్ కిత్నీబార్ కవి కిత్నీ నావోంమే నికలా హై అప్నే సత్యకే అనుసంధాన్‌మే, జిస్కీ చోటీసీ జ్యోతికహానీ ఫిర్‌కర్ భీ ఏక్ ఝుల్‌మల్ ప్రభా మండల్ మనీ రహతీ హై' అని ప్రశంసించింది. అజ్ఞేయ్ 1962-67 మధ్యకాలంలో రాసిన 44 కవితల సంపుటి యిది. ఈ గ్రంథం 1967లో వెలువడింది. ఈ కవితల నిండా ప్రతీకలు, శైలీ విన్యాసాలు, ప్రగతిశీల భావాలు, జీవిత సత్యాలు, మార్మికత, మానవీయ మూల్యాలు, నూతన ఉపమానాలు, అభివ్యక్తి గాఢత, ఆత్మాశ్రయం, ఛందో విన్యాసాలు, నుడికారపు సొగసులు పాఠకుల్ని ఆబ్బురపరుస్తాయి. ఒక విధంగా యిది ఆత్మకథాత్మక మహారచన. జీవన యానాన్ని పెక్కు పడవల ప్రయాణంతో పోల్చి సాగించిన కవితల మాలిక.

'కాంతులు వెదజల్లే నావలెన్నో/ తీసుకెళ్లాయి పెక్కుసార్లు నన్ను / దూరదూర ప్రాంతాలకు / నూతన సీమల్లో వీచే / జాలిలేని పవనాలు / చిట్లగొట్టాయి నా పెదవులను / ఎన్నెన్నో పర్యాయాలు / వేదనల పాలయ్యాను / దైన్యానికి లోనయ్యాను / బాధాతప్తుణ్ణయ్యాను' అని సంవేదన వెలిబుచ్చాడు. అజ్ఞేయ్ జీవిత ఘట్టాలను రసనిర్భరంగా మలిచి ఈ అసమాన కృతిని అందించారు.

అజ్ఞేయ్ కేంద్ర సాహిత్య అకాడమి అవార్డు, గోల్డెన్ రీత్ అవార్డు అందుకున్నారు. హిందీ సాహిత్య సమ్మేళనం ఆయనకు 'సాహిత్య వాచస్పతి' గౌరవం, విక్రమ విశ్వవిద్యాలయం గౌరవ డి.లిట్ ప్రదానం చేశాయి. సచ్చిదానంద్ హీరానంద్ వాత్స్యాయన్ అజ్ఞేయ 1987 ఏప్రిల్ 4న న్యూఢిల్లీలో దివంగతులయ్యారు. ఆయన అంతిమ కవితలో 'నేను అన్ని వైపులా తెరచే వున్నాను / మనసా నాలో బందీ అయినాను / పదంలో నేను ఇమడలేను / నేను నిశ్శబ్దంలోని ఛందస్సును' అని ప్రకటించారు.

–గోవిందరాజు రామకృష్ణారావు

# చతుర కథ

# చట్టం మా చుట్టం

ఆ రోజు ఆదివారం. కూరగాయల కోసం రైతుబజార్‌కి వెళ్తున్నాను. దారిలో పోలేరమ్మ గుడి వుంది. పెద్దగుడేం కాదు. రోడ్డు పక్కన చిన్నగుడి. అందులో మనిషి పట్టడు. దీపారాధన బైట నుంచి చెయ్యాల్సిందే.

"అయినా రోడ్డు పక్కన గుళ్లు కట్టడమేమిటి? మతిలేని పనులు కాకపోతే" అన్నాను పక్కనున్న పెద్దమనిషితో.

ఆయన నవ్వి "ఒకప్పుడు ఈ ప్రాంతం ఊరికి చివర. పోలేరమ్మ అంటే పొలిమేర అమ్మ, ఊరిని రక్షిస్తుందని నమ్మకం. ఇప్పుడు ఊరు పెరిగి గుడి కాస్తా సెంటర్‌లో వుంది" అన్నాడు.

"ఓహోఁ..." అన్నాను.

ఆయన పెద్దాయన కాబట్టి అన్నీ తెలిసివుంటాయి అని సంతృప్తిపడ్డాను.

ఇంతకీ విషయం ఏమిటంటే పోలేరమ్మ గుడి ముందు కొందరు మేకని బలివ్వడానికి సిద్ధంగా ఉన్నారు. ఆ మేక మెడలో బంతిపూల దండేసి, ముఖానికి పసుపు, కుంకుమ పూసి డప్పులు కొడుతూ హంగామా చేస్తున్నారు.

"మాష్టారూ! జంతుబలి నేరంకదా? మరీ పబ్లిగ్గా జంతుబలికి సిద్ధ పడుతుంటే ఎవరూ పట్టించుకోరేం" అన్నాను.

నా అజ్ఞానానికి నవ్వి, "ఈ దేశంలో ఎన్నో వేల చట్టాలుంటాయి. వాటిని పాటించే వాళ్లుండరు. చట్టాలు చేసేవాళ్లే వాటిని పట్టించుకోరు. అయినా ఎవరో పట్టించుకోవాలంటావేం బాబూ! నువ్వే పట్టించుకోరాదూ!" అని వెళ్లిపోయాడు.

నాకు ఎక్కడో చురుక్కుమంది. నిజమే! ఆ ముసలాయన బాగానే బుద్ధి చెప్పాడు. అన్యాయంతో రాజీపడటం మనిషిచేసే పెద్ద నేరమని నేతాజీ సుభాష్ చంద్రబోస్ అన్నారు. నేనే పట్టించుకోవాలి. ఆ బుజ్జిమేక ప్రాణం కాపాడాలి అని నిర్ణయించుకున్నాను.

పోలీస్ స్టేషన్‌కి ఫోన్ చేయాలనుకున్నాను. అక్కడ మా మేనమామ సుబ్బారాయుడు హెడ్ కానిస్టేబుల్. స్వయంగా వెళ్లి కంప్లైంట్ ఇవ్వాలని, రైతు బజార్‌కెళ్ళే పని మానుకుని పోలీస్ స్టేషన్ వైపు బయల్దేరాను.

దారిలో ఒక స్టేషనరీ షాపు దగ్గర ఆగి ఒక తెల్లకాగితం తీసుకుని కంప్లైంట్ రాశాను.

మహారాజశ్రీ స్టేషన్ హౌస్ ఆఫీసర్ గారికి,

అయ్యా!

ఇక్కడికి ఫర్లాంగు దూరంలో రోడ్డు పక్కన వున్న పోలేరమ్మ గుడి దగ్గర ఒక మేకను బలి ఇవ్వడానికి సిద్ధంగా వున్నారు. చట్టప్రకారము జంతుబలి నిషేధము. కాబట్టి వెంటనే తగిన చర్యలు తీసుకొనగలరు.

ఇట్లు
విధేయుడు

కంప్లైంట్ మీద సంతకం చేసి జేబులో పెట్టుకుని పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళాను.

మా మేనమామ సుబ్బారాయుడు అక్కడ హంగామా చేస్తున్నాడు. ప్రహరీగోడ చుట్టూ వేపమండల తోరణాలు కట్టిస్తున్నాడు.

"ఏంటి మామా! హడావుడి? " అని అడిగాను.

"సమయానికి వచ్చావురా! కొంచెం వుండు. లోపల కూర్చో. ఈ ఆదివారం నీకు బజారెళ్ళే పని తప్పిస్తాను. వేటమాంసం తీసుకెళ్దువుగాని" అన్నాడు.

"ఎక్కడిది మామా? " అని అడిగాను.

"మా స్టేషన్లో మేకపొట్టేలు బలిస్తున్నాంలే" అన్నాడు నవ్వుతూ.

నేను అదిరిపోయాను. ఇదేమిటి ఖర్మ? జంతుబలిని అరికట్టవలసినవాళ్ళే జంతుబలి ఇవ్వడమా? అని నా నోట మాటలు రాలేదు.

"అదేంటి మామా? స్టేషన్లో జంతుబలేమిటి? " ఆశ్చర్యపోతూ అడిగాను.

"ఏంలేదులేరా! ఈ మధ్య మా ఇన్‌స్పెక్టర్ గారికి ఏదీ కలిసిరావడంలేదు. అందరితో పేచీలొస్తున్నాయి. పోలేరమ్మకి శాంతి చేయాలని మేకని బలివ్వమన్నాడు. ఈ రోజు ఆదివారం గదా? " అని పకపక నవ్వాడు.

"అదేంటి మామా? జంతుబలి నిషేధం కదా? ..." అని నేను ఏదో చెప్పబోతుంటే అడ్డుపడి "సింగినాదం. మేకని కబేళాలలో నరికితే పుణ్యం, బైట బలిస్తే పాపమా? ..." అన్నాడు తేలిగ్గా.

ఇక నేనేం మాట్లాడను?

–వాణిశ్రీ

ప్రజాసేవకోసమే పనిచేస్తున్నామని చెప్పుకునే పోలీసులు, నక్సలైట్ల పదఘట్టనల కింద ఆ కుగ్రామం నలిగిపోయింది. పచ్చని పంట పొలాలతో అలరారే ఆ ఊరు మొత్తం గజగజలాడిపోయింది. పరస్పరం ఎంతో ప్రేమించుకుని, మూడు ముళ్లబంధంతో ఒకటి కాబోతున్న సీతారాఘవుల ప్రణయానికి అనూహ్యమైన అగ్నిపరీక్ష ఎదురైంది.. కేవలం ఓ చిన్న అనుమానం పెనుభూతమై.. వారి పచ్చని జీవితాలకు అగ్గిపెట్టింది. ఆధిపత్య పోరులో నలిగి పోతున్న అటవీ సమీప గ్రామాల ప్రజలు ఎదుర్కొంటున్న వెతలు ఎలాంటివి? ప్రజలకోసం పని చేస్తున్నామంటూనే ఇరువర్గాలూ గ్రామీణుల సున్నితమైన భావాలను, మానవీయ విలువలను ఎలా గొంతునులిమేస్తున్నాయన్న విషయాన్ని అత్యంత ఆర్ద్రంగా చిత్రించిన...

కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్లై

# మర్రిమాను సాక్షిగా..



బ్రహ్మాండం బద్దలైనట్లు, దిక్కులు పిక్కటిల్లేటట్లు, చెవులు పగిలిపోయేటట్లు ప్రేలుళ్ళ శబ్దం.

తాడెత్తున ఎగిరి పడుతున్న కాంక్రీటు దిమ్మెలు. గభీగభీమని కూలుతున్న ఇటుక గోడలు. అల్లంత దూరాన ఎగిరి పడుతున్న సిమెంటు రేకులు.

ఇనుప పైపులూ, పాళాలూ, గరండాలు సొట్టలుపడి, మెలికలు తిరిగి, తూట్లు పడి వందా, రెండువందల అడుగుల దూరాన పడుతున్నాయి.

ఫ్యాక్టరీ ఆవరణలో నిలబెట్టిన ట్రాన్స్‌ఫార్మరు స్తంభాలతోపాటు కూలిపోయి భగ్గు భగ్గున మండుతోంది.

ఫ్యాక్టరీ గోడౌన్లలో పేర్చిన వేలకొలదీ వేరుశెనగ గింజల బస్తాలు అంటుకొని పొగలు కమ్ముతూ మండుతున్నాయి.

వందలకొద్దీ వేరుశెనగనూనె డ్రమ్ములు పేలిపోయి నూనె నాలుగు దిక్కులకూ పలచగా పారుతూ ఉంది.

ఆ నూనె కూడా మంట అంటుకొని మండుతూ ఉంది.

ఫ్యాక్టరీ ఆవరణలో ఒక పక్కగా ఉన్న సెక్యూరిటీ సిబ్బంది గృహాలూ, ఆఫీసు గదులూ పునాదులు కదిలిపోవడంతో మెల్లమెల్లగా కూలిపోతున్నాయి. ఆ గృహాలలో ఉండే జనం ఆర్తనాదాలు చేస్తున్నారు. గేటువైపు పరుగులు తీస్తున్నారు.

ఫ్యాక్టరీ ఆవరణలో గుట్టలు గుట్టలుగా ఉన్న వేరుశెనగ పొట్టు నిప్పురవ్వలు పడి అంటుకొని పొగ దట్టంగానూ, మంట సన్నగానూ రగులుతూ ఉంది.

అంతవరకూ పండువెన్నెలలో మిలమిల మెరుస్తూ నిశ్శబ్దంగా నిద్రిస్తూ ఉన్న ఫ్యాక్టరీ నిమిషాలలో బీభత్సంగా తయారైంది. ఆ భయానక దృశ్యాన్ని చూచేవాళ్ళ గుండెలు నీరవుతున్నాయి.

ఆ ఫ్యాక్టరీ ఆవరణ పొడవు దాదాపు కిలోమీటరు. ఆ ఆవరణకు అవతల ఇరవై ముప్పై ఇండ్లుండే చిన్న కాలనీ. ఆ ఇండ్లలో కూడా ఈ ప్రేలుడు దెబ్బకు భూమి కంపించింది. కిటికీలు టపటపా కొట్టుకున్నాయి. నిద్రలో ఉండిన జనం దిగ్భ్రాంతితో లేచి అరుస్తూ బయటకు పరుగులు తీశారు. ఎడంవైపు తిరిగి చూస్తే భయంకరంగా మండుతున్న ఫ్యాక్టరీ కనిపిస్తూంది. సెక్యూరిటీ సిబ్బంది ఆర్తనాదాలు వినిపిస్తున్నాయి. కాలనీ జనాలకు ఏమీ అర్థంకాక నిలబడిపోయారు. నాలుగైదు నిమిషాలు నిలబడి, తమ ఇండ్లకు ప్రమాదమేమీ జరగలేదని గ్రహించి ఫ్యాక్టరీ సిబ్బందికి ఎదురుగా వెళ్ళారు. సెక్యూరిటీ సిబ్బంది పిల్లాపాపలతో, ఎదురుగా పరుగెత్తుకొని వస్తున్నారు.

"ఏం జరిగింది? "

"బాంబులు"

"ఎవరో? "

"తెలియదు"

"ఫ్యాక్టరీ? "

"కూలిపోయింది. కాలిపోతావుంది."

"పదండి మన యిండ్లకాడికి పదండి. తెల్లారినాక సూసుకుందాం"

అందరూ కలిసి సెక్యూరిటీ సిబ్బంది భార్యాబిడ్డల్ని కాలనీ ఇండ్లలో వదిలేసి మళ్ళీ ఫ్యాక్టరీ దగ్గరికి పరుగెత్తారు.

స్కూలు టీచరు ఫైరాఫీసుకూ, సర్పంచి పోలీసోళ్ళకూ ఫోన్ చేశారు.

అర్థగంట తర్వాత ఫైరింజన్లు వచ్చాయి.

ఓవర్ హెడ్ ట్యాంకు స్తంభాలు కదిలిపోవడంతో ట్యాంక్ కూలిపోయి నీళ్ళు వరదలయ్యాయి. అవి నూనె డ్రమ్ముల మంటల్ని ఆర్పేశాయి. ఫైరింజన్లు కొంతసేపు మంటల్ని ఆర్పి మళ్ళీ నీళ్ళు నింపుకొని రావడానికి వెళ్ళిపోయాయి.

తెల్లవారుతూ ఉండగా పోలీసు డిపార్టుమెంటువాళ్ళూ, ఏడు గంటలకు రెవిన్యూ వాళ్ళూ వచ్చారు. ఫ్యాక్టరీకి ఎదురుగా రోడ్డుకవతల కూలిపోకుండా ఉన్న బస్ షెల్టర్

క్రింద కూర్చొని కాలనీవాళ్ళ దగ్గరా, సెక్యూ రిటీ సిబ్బంది దగ్గరా వాంగ్మూలాలు రికార్డు చేసుకున్నారు.

ఎనిమిది గంటలపైన చిత్తూరు నుంచి కలెక్టరూ, యస్.పి. విచ్చేశారు. ఫ్యాక్టరీ ఆవరణ అంతా పరిశీలించి వివరాలు వ్రాసుకున్నారు. ఫోటోలు తీయించారు.

అప్పటికే చుట్టుప్రక్కల గ్రామాల నుంచి వందల సంఖ్యలో జనం వచ్చేశారు. వాళ్ళలో చాలామంది ఫ్యాక్టరీకి శెనక్కా యలు తోలిన రైతులే. చాలామందికి ఫ్యాక్టరీ నుండి డబ్బు రావాలి. కొందరికి ఏజెంట్ల ద్వారా, దళారీల ద్వారా డబ్బు రావాలి. అందరూ లబోదిబోమంటూ గందరగోళంగా గోల చేస్తున్నారు.

"మా డబ్బులు ఎట్లా వస్తాయి? "

"ఫ్యాక్టరీ యజమానుల్ని పిలిపించండి"

"కలెక్టరుగారు మా డబ్బు ఇప్పించాలి"

ట్రాఫిక్ స్తంభించిపోయింది. గొడవ పెద్దదైంది. అప్పటికప్పుడు రైతునాయకు లంటూ నలుగురైదుగురు పుట్టుకొచ్చారు. ఎలాగైనా గొడవను పెద్దది చేసి ప్రజల దృష్టిలో హీరోలుగా కనబడాలి. పోలీసు లతో గొడవపడి అరెస్టు కావాలి. పత్రిక లలో ఫోటోలు పడాలి. వచ్చే ఎన్నికల్లో ఏదో ఒక పార్టీ టిక్కెట్టు కొట్టేయొచ్చు

అంతవరకు తమతమ డబ్బుల కోసం అంగలారుస్తూ దిగులు పడుతూ ఉండిన రైతుల్ని ఈ రైతునాయకులు రెచ్చగొట్టి నినాదాలు చేయించడం మొదలుపెట్టారు.

పోలీసులు ట్రాఫిక్‌ను దారి మళ్ళిం చారు. జనాన్ని చెదరగొట్టే ప్రయత్నం చేయనీకుండా కలెక్టరు పోలీసుల్ని కట్టడి చేశాడు. పోలీసు జీపుకు ఉండే మైక్‌లో కలెక్టరు మాట్లాడడం ప్రారంభించాడు.

"మీ డబ్బుకేం భయం లేదు. మీవి మీకు ముట్టే ఏర్పాటు చేస్తాను. చూస్తు న్నారు కదా! ఫ్యాక్టరీ పూర్తిగా ధ్వంసమైపో యింది. లక్షల రూపాయల విలువచేసే సరుకు నాశనమైంది. కోట్ల విలువ చేసే ఫ్యాక్టరీ యంత్రాలూ పనికిరాకుండా పోయాయి. రికార్డంతా శిథిలాల కింద కూరుకుపోయింది. ఈ శిథిలాలన్నీ తొల గించి, రికార్డు బయటికి తీసి పరిశీలిం చాలి. ఫ్యాక్టరీ యజమానుల్ని పిలిపించి ఇన్‌సూరెన్సు వివరాలు రాబట్టాలి. దీని కంతా కొంత సమయం పడుతుంది. తప్పదు. వేరే మార్గం లేదు."

"అదంతా అయ్యేదెప్పుడు? పంటను నమ్ముకొని బ్రతుకుతున్న రైతులు అప్పటి దాకా ఓర్చుకోగలరా? ఎరువులకూ, సేద్యపు ఖర్చులకూ చేసిన అప్పులు తీర్చే దెప్పుడు? అప్పులవాళ్ళు ఊరికే ఉంటారా? " అన్నారు రైతు నాయకులు.

"తొందరగా ఈ కార్యక్రమమంతా పూర్తి చేస్తాం. ఈ వ్యవహారాన్ని చక్కబెట్టేందుకు తాశిల్దారు హోదాలో ఒక స్పెషలాఫీస రును, ఒక డిప్యూటీ తాశిల్దారును నియమి స్తున్నాను. ఫ్యాక్టరీకి కాపలా ఉండడానికి స్పెషల్ పోలీసుల్ని నియమిస్తున్నాను. శి థిలాలను తొలగించే పని ఒక కాంట్రాక్ట రుకు అప్పగిస్తున్నాను. ఇంతకుమించి నేను మాత్రం ప్రస్తుతానికి చేయగలిగింది ఏముంది? మీరందరూ ఇక్కడి నుండి ప్రశాంతంగా వెళ్ళిపోతే తదుపరి కార్యక్ర మాలు చూస్తాం. మీరిలాగే ఆందోళన చేస్తుంటే మేమూ ఇక్కడే కూర్చుండి పోతాం. ఏ పనీ జరగదు. ఆలోచించు కోండి" అని కలెక్టరు రెండు చేతులూ తల వెనుక పెట్టుకొని కుర్చీలో వెనక్కి వాలి కూర్చుండిపోయాడు.

రైతులకు ఏమీ తోచలేదు. కలెక్టరు చెబుతున్న మాటలు యుక్తంగానే కనబడు తున్నాయి. ఈ స్థితిలో ఇంతకుమించి ఎవరు మాత్రం ఏం చేయగలరు?

రైతు నాయకులు నిరుత్సాహపడిపో యారు. కనీసం లాఠీచార్జీకైనా ఉత్తర్వులి స్తాడనుకున్న కలెక్టరు ఇలా చేతులెత్తేసి

కూర్చుండిపోగానే రైతునాయకులు గాలి తీసేసిన బెలూన్లయిపోయారు.

రైతులందరూ మెల్లగా వెళ్ళిపోసాగారు. కొందరు ఫ్యాక్టరీ చుట్టూ తిరిగి చూస్తున్నారు. అధికారగణం పది నిమిషాల్లో పీలేరు గెస్ట్‌హౌసులో సమావేశమయ్యారు.

ఆ ఫ్యాక్టరీ అత్యున్నత రాజకీయ నాయకుడిది. ఫ్యాక్టరీ విధ్వంసవార్త హైదరాబాదు చేరిపోయింది. మంత్రులు, సచివాలయం సెక్రెటరీలు అతివేగంగా స్పందిస్తున్నారు. కలెక్టరుకూ, యస్.పి.కీ నిర్విరామంగా సందేశాలిస్తున్నారు.

"ఇది నక్సలైట్ల పనే. సందేహం లేదు. మొదట వాళ్లపని పట్టాలి. రైతులకేం? ఎలాగో కాలం గడుపుతారు. నక్సలైట్లను ఇలాగే వదిలేస్తే మళ్ళీ మరో ఫ్యాక్టరీ, మరోవ్యాపార కేంద్రం. దీనికి అంతం ఏది? కాబట్టి మొదట వాళ్ళపని పట్టాలి.

ఎస్.పి. ఫోన్ మోగింది. హైదరాబాదు నుండి అత్యున్నత పోలీసు అధికారి మాట్లాడుతున్నాడు.

"ఫించా, నెరబైలు ఏరియాల్లో కూంబింగ్ ఆపరేషన్ ముమ్మరంగా చేయండి. నో అరెస్ట్, నో ఎంక్వయిరీ, నో కేస్, సింప్లీ ఎన్‌కౌంటర్. దట్సాల్- అండర్‌స్టాండ్? "

"యస్ సార్, యస్ సార్" యస్.పి. వినయంగా వింటున్నాడు. పైవారి ఆదేశాలు చాలా దారుణంగా ఉన్నాయి.

"అదనపు బలగాలు పంపుతాం, అడవులు గాలించండి. అడవి ప్రక్క పల్లెలలో మన ఇన్‌ఫార్మర్లను ప్లాంట్ చేయండి."

"యస్ సార్"

యువర్ మూవ్‌మెంట్స్ షుడ్‌బి కాన్ఫిడెన్షియల్."

"యస్ సార్"

'ఇంకెన్ని కొంపలు కూల్తాయో, ఎందరు బలైపోతారో' అనుకున్నాడు ఎస్పీ. ఆ పాపాలన్నీ భరించాల్సింది తానే.




మధ్యాహ్నం పన్నెండు దాటుతోంది.

మే నెల ఎండ కాల్చేస్తూ ఉంది.

వీధులలో జనసంచారం లేదు.

పశువుల కొట్టాలలో దూడలు పడుకొని డొక్కలు ఎగరేస్తున్నాయి.

గాటి బండలపైన నిలబడి కోళ్ళు రెక్కలు దిగజార్చి ఒగురుస్తున్నాయి. అప్పుడప్పుడూ రెక్కల కిందా, వీపుపైనా, ముక్కులతో గోక్కుంటున్నాయి.

జలదారి గుంటలలో, కాలువలలో కుక్కలు దిట్టంగా కూర్చొని నాలుకలు వెళ్ళబెట్టి ఒగురుస్తున్నాయి. అప్పుడప్పుడు కనబడని దేన్నో ఉద్దేశించినట్టుగా కోపంగా గుర్రుగుర్రుమంటున్నాయి.

పోలేరమ్మ రచ్చబండ దగ్గర వేపచెట్టు మీద రెండు కాకులు కూర్చొని కర్రుకర్రుమంటున్నాయి తీరుబాటుగా.

పెద్ద రచ్చబండమీద రావి, వేప మాకుల నీడలో కరవల ఆంజనేయాచారీ, ఈడిగ కృష్ణయ్యా పులీమేకా ఆడుతున్నారు. ఆంజనేయాచారి ప్రక్కన జగన్నాథరెడ్డీ, కృష్ణయ్య ప్రక్కన గాండ్ల మాణిక్యంశెట్టి గూర్చొని ఆట చూస్తూ సలహాలిస్తున్నారు.

మరోపక్క డెబ్బైయేండ్ల ఆదెప్ప బండపైన బద్దెలో వక్కా, ఆకూ పెట్టి మరో చిన్న రాయితో దంచి నోట్లో వేసుకొని, సున్నపు డబ్బీలోంచి కాసింత సున్నం తీసి నోట్లో వేసుకొని పళ్ళులేని దవళ్ళతో నము

ల్తున్నాడు. ఈడిగ కృష్ణయ్యకు మాణిక్యం శెట్టి ఏదో చెబుతూ ఉండడం చూచి-

"ప్రక్కనుండే వాళ్ళు నోరుమూసుకొని ఆట చూస్తా ఉండాల, వాగ్గూడదు" అన్నాడు ఆదెప్ప, మాణిక్యం శెట్టి నెత్తిన ఒక మొటిక్కాయ వేస్తూ.

వీధి మొగదల ఉన్న మిద్దెటింటిలో సీత, సంగటి ముద్దలు చేసి, సత్తు బేసి న్‌లో పెట్టి, పెద్ద ప్లేటు మూసి పెట్టింది. వంకాయలు, పచ్చిమిరపకాయలు, పుల్ల గూర ఎనిపి పెద్దగిన్నెలో పెట్టింది. వంటింటిలోంచి ఇంటి ముందరికి వచ్చి పొలంవైపు తలెత్తి చూసింది. "ఈపాటికి నాయన కపిల వదిలేసి ఎద్దులను తోలు కొని ఇంటికి వస్తూ ఉండాల. రాలేదే? " అనుకొంది.

వసారా అరుగుమీద కూర్చొని పీటకింద అణగేసి ఉంచిన మఙ్జాకుల్ని తీసి విస్తర్లు కుట్టసాగింది సీత. అమ్మ ఇంటివెనక పెరట్లో రాగులు విసురుతూ ఉంది. గుబ్బు గిబ్బుమనే విసర్రాయి శబ్దం చెవులకింపుగా వినబడుతూ ఉంది.

వీధిలో చెప్పుల శబ్దం వినబడేసరికి సీత, నాయన వస్తున్నాడేమో అనుకొని తలెత్తి చూసింది.

నాయన కాదు.

ఎవరీ మనిషి? ఇంత ఎండలో దుమ్ము కొట్టుకొని వస్తున్నాడు. పది రోజుల గడ్డం పెరిగింది. నాలుగునెలల క్రాపూ పెరి గింది. మోకాళ్ళపైన పట్టాపట్టీ డ్రాయరు అంచులు కనబడేలాగా లుంగీపైకి మడిచి కట్టాడు. నల్లగోటు పసుపురంగు బనీను బాగా మాసిపోయింది. భుజం మీద వేసు కున్న షర్టూ, తలకు రెండు చుట్లు కూడా తిరగని తువ్వాలు, చంకలో ఒక సంచీ, భారంగా వస్తున్నాడు. ఆ నడక చూస్తూ ఉంటే 'ఎంత దూరం నుండి నడిచి వస్తు న్నాడో, పాపం' అనిపిస్తూ ఉంది. అతని ఆయాసం చూస్తూ ఉంటే, అతడు భోంచేసి ఎన్ని పూటలయిందో అనిపిస్తూ ఉంది.

అరె! తమ ఇంటివేపే వస్తున్నాడే. వీధి దాటి తమ ఇంటి ముంగిటిలోకి వచ్చేస్తు న్నాడే! ఏం పనో?

వీధినుంచి ఆ ఇంటి వాకిటివరకు ముప్పై అడుగుల ఖాళీ జాగా ఉంది. అదంతా ఇంటి ముంగిలి కిందే లెక్క.

సీత చటుక్కున లేచి మెల్లగా తలుపు దగ్గరికి వెళ్ళి నిలబడింది.

"అమ్మా" అంటూ పిలిచింది సీత, ఇంటి లోపలికి తొంగిచూస్తూ.

"అయిపోవచ్చింది.. వస్తున్నా" అని సమాధానం వచ్చింది.

అతను నేరుగా వచ్చి అరుగు మీద చతి కిలబడి స్తంభానికి ఆనుకున్నాడు. తువ్వా లుతో ముఖంమీద కారుతున్న చెమట తుడుచుకున్నాడు. చెమటోడుతున్న ముంజేతులనూ, రొమ్మునూ తుడుచుకు న్నాడు. సీత ఇదంతా చూస్తూ నిలు చుంది. అతను సీతవైపు చూచి కుడిచేతి బొటనవ్రేలు నోటివద్దకు చేర్చి 'నీళ్ళు' అన్నట్లు సైగ చేశాడు. సీత గిరుక్కున ఇంట్లోకి పోబోయి, వెంటనే వెనక్కి తిరిగి తటపటాయిస్తూ,

"ఏ ఇండ్లోళ్ళు" అంది మెల్లగా.

"రెడ్లమేలే, పెద్ద చెంబుతో నీళ్ళు తే" అన్నాడు అలసటగా కళ్ళు మూసుకొని.

'అబ్బో! పొగురు పెద్దదే. కండ్లల్లో ఊపిరి లేకపోయినా' అనుకొంది సీత.

పరుగులాంటి నడకతో లోపలికి వెళ్ళి పెద్ద ఇత్తడి చెంబుతో నీళ్ళు తెచ్చింది. అతను ఇంకా స్తంభానికి ఆనుకొని కళ్ళు మూసుకొనే ఉన్నాడు.

ఏమని పలకరించాలి!

చెంబు శబ్దం వచ్చేలా అతని ప్రక్కన పెట్టి, ఒక అడుగు వెనక్కొచ్చింది సీత.

ఆ శబ్దానికి అతడు కండ్లు తెరచి చూసి, చెంబు రెండు చేతులతో ఎత్తి పట్టుకొని ఆత్రంగా రెండు గ్రుక్కలు నోట్లో పోసుకు

న్నాడు. పొరబోయింది. తలమీద, మెడ మీద తట్టుకున్నాడు. తరువాత నిదానంగా అరచెంబుడు నీళ్ళు తాగేశాడు. అరచేతిలోనికి కొన్ని నీళ్ళు ఒంపుకొని ముఖంమీద అద్దుకున్నాడు. అలాగే చెవులమీదా, మెడ మీదా నీళ్ళు అద్దుకున్నాడు. మళ్ళీ ముఖం మీద కాస్త చల్లుకొన్నాడు. నడినెత్తిన కొన్ని చల్లుకున్నాడు. మిగిలిన నీళ్ళు త్రాగేసి చెంబు కాస్త దూరంగా అరుగుమీదే పెట్టేశాడు. తడిసిన అరచేతులతో ముంజేతులు తుడుచుకున్నాడు.

సీత చెంబెత్తుకొని లోపలికి పోయింది.

ముఖంమీద తేమను తువ్వాలుతో తుడుచుకొని, తువ్వాలుకొనతో గాలినిసురుకుంటూ స్తంభానికి ఆనుకొని కళ్ళు మూసుకొని ఉండిపోయాడతను. దుమ్ము కొట్టుకుని, ఎండకు, చెమటకు నల్లబడిన అతని ముఖం, కడుక్కోగానే తేట పడింది.

ఓ పది నిమిషాలు గడిచాయి.

ఇంటి యజమాని పెద్దిరెడ్డి కపిలబాన భుజానికి తగిలించుకొని ఎడ్లను తోలుకుంటూ వస్తున్నాడు. ఎడ్లు తొందర తొందరగా నేరుగా ఇంటి ఎడమ వైపు నున్న పశువుల కొట్టంలోకి వెళ్ళిపోతున్నాయి.

"ఎవురాడ కూసోనుండేది?" అన్నాడు పెద్దిరెడ్డి, కొట్టంవైపు నడుస్తూ.

అతను కళ్ళు తెరిచి చూచాడు. పెద్దిరెడ్డిని చూడగానే అతడే ఇంటి యజమాని అని గ్రహించాడు. పెద్దిరెడ్డి వయస్సు యాభైకి అటూ ఇటుగా ఉండవచ్చు బక్కపలచని మనిషి. పెద్దగా పొడగరి కూడా కాడు. నీళ్ళల్లో నానిన కపిలబాన బరువుగానే ఉంది. అతను వెంటనే లేచి తువ్వాలు తలకు చుట్టుకొని పెద్దిరెడ్డి దగ్గరికి వెళ్ళి కపిలబాన అందుకోబోయాడు.

"ఒద్దొద్దు- నువ్వు కూసో బో- నేనెత్తకపోతా కదా- నువ్వు కూసో బో" అంటున్నా వినకుండా పెద్దిరెడ్డి భుజం మీద నుండి కపిలబానను తీసుకొని పశువుల కొట్టంలోనికి నడిచాడతడు. పెద్దిరెడ్డి చూపించిన వైపున వ్రేలాడుతున్న కొంకిగ డకు కపిలబానను తగిలించాడు.

పెద్దిరెడ్డి ఎడ్లను గాటి దగ్గర కట్టేశాడు. అంతలోపల అతడు ప్రక్కనే ఉన్న గడ్డివామిలో నుండి రెండు కట్టలు వరిగడ్డి తెచ్చి గాటిలో విదిలించాడు. ఎడ్లు రెండూ ఆవురావురుమంటూ తింటున్నాయి.

'ఎక్కడోడు ఈ మనిషి? ఈ చొరవకు ఏమర్థం?' అనుకొంటోంది వాకిలి వద్ద నిలబడి చూస్తున్న సీత. అక్కడే ఉన్న తొట్టిలో నీళ్ళు, సత్తుచెంబుతో ఎత్తి, కాళ్ళూ, చేతులూ, ముఖమూ కడుక్కున్నాడు పెద్దిరెడ్డి. ఇద్దరూ వచ్చి చెరొక అరుగు మీద కూర్చున్నారు ఎదురెదురుగా.

బనీను జేబులోంచి పెద్దిరెడ్డి బీడీకట్ట, అగ్గిపెట్టె తీసి బీడీ ముట్టించి రెండు పీల్పులు పీల్చి అతనికేసి చూచి తల ఆడించాడు 'ఇక చెప్పు నీ కథ' అన్నట్లు.

"నా పేరు రాఘవరెడ్డి. మాది పీలేరు కివతల మద్దిలేరు. నేను తొమ్మిదో తరగతి చదివేటప్పుడు మా నాయన చచ్చిపోయె. ఉండిన రెండెకరాల చేనూ అప్పులోళ్ళ పాలైపాయె. చదువు సాలించి నేనూ-మాయమ్మా కూలీ నాలీ చేసుకొని బతకతా ఉంటిమి. నాయన పోయిన రెండేండ్లకు ఊర్లో కలరా వచ్చి మాయమ్మ కూడా పోయె. ఒక్కణ్ణే రైతుల ఇండ్లలో సేద్యం పనులు చేసుకుంటా బతకతా ఉంటి. మూణ్ణెల్లకు ముందు మా ఊరు కాలిపాయె. కాలిపోయిందంటే అట్టాఇట్టా కాదు. ఇండ్లూ, ఇండ్లలో ఉండే గింజా గిౖట్రా, గుడ్డా గుసురూ, ఊరి పక్కన వాములూ అన్నీ తుౖట్రాగా కాలిపాయె. మాది మూడంకణాల పూరిల్లు. అది కూడా సుబ్బరంగా కాలిపోయి మొండిగోడలు మిగిలె.

ఒంటిగాణ్ణి నేనేంజేసేది? పెద్దపెద్ద

రైతులే నడుము విరిగి పడిపోయిరి. నేనెట్ల బతికేది? సేద్యంపని తప్ప వేరేపని తెలీదు నాకు. బేల్దారి పనికి పోతి. నా కంటె చిన్నోళ్ళు తాపీ పట్టుకొని పనిజేస్తా ఉండారు. నన్ను ఇటికలు మోయమని. తాపీ పట్టంగానే వాళ్ళు నా కంటే పెద్దోళ్ళై పోతారా? నన్ను కేవలంగా మాటాడితే నాకు ఎట్టుంటుంది? సేద్యంపని తప్ప ఇంకొక పనిచేయకూడదనుకొంటి. సేద్యం పనిలో నన్ను ఎవుడూ ఒక మాటనలేదు.

యా ఊర్లోనన్నా ఒక రైతు దగ్గర జీతా నికైనా చేరి నాలుగు దుడ్లు సంపాదించు కోని మల్లా ఇల్లు నిలేసుకోవాల. ఊరు రవంత తేరుకున్నాంక మల్లా ఊరు చేరు కోవాల అని ఎలబారితి. పీలేరు, రొంపిచెర్ల ఆ పక్క బావుల్లో, బోర్లల్లో నీళ్ళు లేవు. సేద్యాలు జరగలా. ఈ పక్క కొంచెం శాంబరంగా ఉండాదని ఎవురో చెప్తే ఈ పక్కకు ఎలబారితి. రెండు నెల్లుగా ఊరు దాటి ఊరువస్తానే ఉండా. యా ఊర్లోనూ రెండు మూడు దినాలు పనిజెప్పేవాళ్ళేగాని 'నిలబడు' అనేవాళ్ళు కనబడలే. ఈ దోవన పల్లెలు సూసుకుంటూ నెరబైలుదాకా పోదామని వస్తి" ఆగాడు రాఘవరెడ్డి.

"అయ్యయ్యో! ఎంత కష్టమొచ్చె. లేదర పిల్లోణివి. వింటా వుంటే నాకే ఎట్లానో ఉండాది. ఇట్లనే అబ్బోడా, కష్టాలన్నీ కట్ట గట్టుకొని ఒక్కసారిగా పైన పడేది. ఊపి రాడనీవు. అట్టాంటపుడే మనిషి తట్టుకొని నిలబడల్ల. కష్టాలు మనుషులకుగాక మాకులకొస్తాయా? దయిర్యంగా ఉండల్ల. నిబ్బరంగా ఉండల్ల. పెండ్లి కాలేదు గదా! పెండ్లన్నా అయ్యుంటే అత్తగారు కొంచెం ఆదరువుగా ఉండుందురు. పోనీలే పెండ్లి కాన్ది గూడా ఒక రకంగా మంచిదయింది. వచ్చిన కష్టమేదో నువ్వొకడివే పడ్తావు"

పెద్దిరెడ్డి పలికిన చల్లని ఓదార్పు మాట లకు రాఘవరెడ్డి హృదయంలో గూడు క ట్టుకొని ఉండిన దుఃఖం ఒక్కసారిగా సెల వేసింది. కళ్ళల్లో నీళ్ళు కమ్ముకొచ్చాయి. తువ్వాలుతో కళ్ళు తుడుచుకోసాగాడు.

"అరరె! అబ్బోడా- ఏందిది, ఏందిది. ఛఛ వయసు మొగోణివి. ధైర్నం ఒదిలేస్తే ఎట్టా? మనం మనుషులుగా పుట్టిందెం దుకు? ఒకరికొకరు సాయపడేందుకు కదా! కష్టాలొచ్చినప్పుడు ఒకరికొకరు ఆదు కోకపోతే కులాలేల? మతాలేల? మను షులు కొందరు చేరి ఊర్లు కట్టుకునేదెం దుకు? అసలు మనిషి జన్మఏల? మొబ్బు కాలం కొన్నాళ్ళు, ఎన్నెలకాలం కొన్నాళ్ళు. ఏదీ శాశ్వతంగా ఉండదు. నీకూ ఒక మంచి కాలమొస్తుంది. ధైర్నంగా ఉండు."

రాఘవరెడ్డి కాస్త తేరుకున్నాడు.

"రొండు రోజులు నాచేత ఏదన్నా పని చేయించుకోండి. చూడండి. మీకు నచ్చితే పనిలో పెట్టుకోండి. తిరిగి తిరిగి శానా అలిసిపోయినా" అన్నాడు తలొంచుకొని.

"సరే, సరే, ముందు భోంచేద్దాం లెయ్. ఎప్పుడు తింటివో, ఎక్కడ తింటివో మాటల్లో పడి ఆకలిమాటే మరిసినా" అంటూ అరుగుమీద సీత కుట్టిపెట్టిన విస్త రాకులు రెండు తీసి చేతపట్టుకొని లోపలికి దారి తీశాడు పెద్దిరెడ్డి.

"లెయ్, కడుక్కురా" మళ్ళీ పిలిచాడు.

అంతవరకూ తలుపు ప్రక్కన నిలబడి అంతా వింటూ ఉండిన జానకమ్మా, సీతా లోపలికి వెళ్ళారు.

జానకమ్మ ఇద్దరికీ కాస్త ఎడంగా విస్తరా కులు వేసి ఒక్కొక్క సంగటి ముద్దవేసి పుల్లగూర వడ్డించింది. నెయ్యి పోసింది. రాఘవరెడ్డికి పెద్దచెంబుతోనూ, పెద్దిరెడ్డికి గ్లాసుతోనూ నీళ్ళు పెట్టింది.

ఒక ముద్ద తినేసి రాఘవరెడ్డి లేవబో యాడు. పెద్దిరెడ్డి అతని భుజం మీద చెయ్యివేసి అదిమి పట్టాడు.

"మొగమోట పడొద్దు. కడుపునిండా తిను" అన్నాడు.

"ఇంకొంచెం సంగటి పెట్టుకొని పెరుగే

సుకో అబ్బోడా" అంది జానకమ్మ.

"కొంచెం కూరతోటి తిని, కొంచెం పెరుగుతో కలుపుకో" అన్నాడు పెద్దిరెడ్డి.

భోజనాలయ్యాయి. పెద్దిరెడ్డి ఒక అరుగుమీద దిండు గోడకు చేరవేసి నడుం వాల్చాడు. రాఘవరెడ్డి మరో అరుగు మీదికి వచ్చి తువ్వాలు పరుచుకొని చేతి సంచీ, షర్టూ తలకింద పెట్టుకొని ఒళ్ళు వాల్చాడు. ఉదయం నుండి నిలకడ లేకుండా నడవడం, రెండు రోజులుగా సరైన తిండి లేకపోవడం, రోడ్డు ప్రక్కన టీ అంగళ్ళలో ఇడ్లీలతో, బోండాలతో, టీ నీళ్ళతో కాలం గడిపిన ఆయాసం, ఇప్పుడు కడుపు నిండుగా తృప్తిగా, రుచిగా తినడం, చివర గడ్డపెరుగుతో సంగటి చిక్కగా కలిపి జుర్రుకోవడం- రాఘవరెడ్డికి తెలియ కుండానే మత్తుగా కళ్లు మూతలు పడ్డాయి. అంతే, సాయంత్రం నాలుగు గంటలదాకా ఒళ్ళు తెలియకుండా నిద్రపోయాడు.

"అమ్మి, కుడితి తొట్టిలో రెండు బిందెల నీళ్ళు పొయ్" అన్న జానకమ్మ పిలుపు వినబడి మెలకువ వచ్చింది రాఘవరెడ్డికి. లేచి కూర్చొని చుట్టూ చూచాడు.

'పుష్టిగా తినేసి, దిట్టంగా అరుగు మీద పడుకొని నిద్రపోవడానికి తానేమి వాళ్ళింటి చుట్టమా?' అనుకుని గబుక్కున లేచాడు.

జానకమ్మ పేడ తట్టనూ, పొరకనూ పట్టుకొని పశువుల కొట్టంలోనికి వెళ్తా ఉంది. రాఘవరెడ్డికి కర్తవ్యం స్ఫురించింది. జీతగాడు చేయవలసిన పనులు గుర్తుకొచ్చాయి.

కొన్నాళ్లపాటు తాను త్రిప్పట లేకుండా ఒకచోట కుదురుగా ఉండాలన్నా, కడుపు మాడకుండా పూటకు ఇంత తినాలన్నా ఇప్పుడు తాను కల్పించుకొని పనులు చేయాలి. ఎక్కడ ఏ పని అవసరమో తానే కనిపెట్టి జొరబడి పనులు చేయాలి. తాను అక్కడ ఉండడం వల్ల ఆ ఇంటి వాళ్ళకు కాస్త వెసులుబాటూ, కొంత సుఖమూ కనబడాలి. తన సేవ వారికి గుర్తింపుకు రావాలి. తనను జీతగానిగా పెట్టుకోవాలన్న కోరికను వాళ్ళలో తానే కలిగించాలి.

రాఘవుడు జానకమ్మ దగ్గరికి వెళ్ళి "అక్కా! అవి ఇట్లీ" అని పేడ తట్టనూ, పొరకనూ లాక్కున్నాడు.

"ఒద్దొద్దు. నేన్జేసుకుంటా" అంటున్నా వినకుండా ఎద్దులపేడ తట్టకెత్తాడు. రాఘవుడు తట్టను భుజానికెత్తుకోగానే జానకమ్మ వీధికవతల చింతచెట్టు కింద ఉన్న దిబ్బను చూపింది. పశువుల కొట్టం శుభ్రం చేయడం పూర్తయింది.

సీత రాకపోవడం చూచి రాఘవరెడ్డే కుడితి తొట్టిలో నీళ్ళు పోశాడు. "అక్కా, ఉప్పు" అన్నాడు. జానకమ్మ ఒక చేటలో తవుడూ, ఒక బొచ్చెతో ఉప్పు తెచ్చి తొట్టిలో వేసింది. ఆ తొట్టిలోనే ఉండిన ఒక కట్టెతో బాగా కలియబెట్టాడు రాఘవరెడ్డి. ఎనుములకు కుడితి సిద్ధమయింది.

"అప్ప ఎక్కడ బొయినాడక్కా?"

ఈ రెండు సంబోధనలూ జానకమ్మకు కొత్తగానూ, ప్రియంగానూ ఉన్నాయి.

"బాయికాడ ఎద్దుల మేపతాండాడు"

"బాయి?" ఎక్కడ అన్నట్లు సాగదీశాడు.

"అదిగో అడివికి బొయ్యే దోవ ప్రక్కన...అదిగో అక్కడ పెద్ద మర్రిమాను కనబడతా ఉండ్లా? అదే మన బాయి"

రాఘవరెడ్డి ఇక అక్కడ నిలబడలేదు. బావి దగ్గరికి వెళ్ళిపోయాడు.

పల్లెనుండి అడవికి పోయే దారి మామూలు బండి బాటకంటే ఎక్కువ వెడల్పుగానే ఉంది. బాటకిరుపక్కల కలబంద చెట్లు, ముండ్లచెట్లు కంచెలాగా ఉన్నాయి. ఈ మొత్తం దారిని 'ఓని' అంటారు. రాఘవరెడ్డి 'ఓని' వెంబడి వెళ్ళి ఒక మిట్ట ఎక్కి

దిగి మర్రిమాని కింద బావి దగ్గరికి వచ్చాడు. అప్పటికే పెద్దిరెడ్డి గడ్డికోసి ఒక గంపలో అదిమి పెట్టివున్నాడు. రాఘవరెడ్డి ఆరేడు పొడుగాటి పుల్లలను గంప అంచుల వద్ద దోపి పెద్దిరెడ్డి చేతి నుండి కొడవలి అందుకొని గడ్డికోసి గంపలో ఎత్తుగా అదిమి పెట్టాడు. ముందుండిన దానికంటే రెండింతలయింది.

ప్రొద్దు గ్రుంకింది. పెద్దిరెడ్డి గంపను నెత్తికెత్తుకోబోయాడు.

"నువ్వుండప్పా" అని రాఘవరెడ్డి ముందుకొచ్చి గంపను ఎత్తుకున్నాడు.

పెద్దిరెడ్డి ముఖం ప్రసన్నమైపోయింది. గంపను రాఘవరెడ్డి నెత్తికెత్తి తాను ఎడ్లను అదలించుకుంటూ ముందు నడిచాడు. ఇంటికొచ్చేటప్పటికి సీత లాంతరు వెలిగించి వసారా దూలానికి వ్రేలాడదీసింది. పెద్దగా వెలుతురు లేకపోయినా ఇంటి ముంగిట పురుగూ పుట్రా తిరిగితే కనబడుతుంది. కొట్టంలో ఎడ్లూ, ఎనుములూ కనబడుతున్నాయి. వీధిలో వెళ్ళే మనుషుల్ని గుర్తుపట్టవచ్చు. ఇంట్లో చిమ్నీలున్న చిన్న బుడ్డీదీపాలు రెండున్నాయి.

ఆ రాత్రి తోకల వడ్ల బియ్యపు అన్నమూ, మధ్యాహ్నపు పుల్లగూరా, చారూ, పెరుగూ- అబ్బ! ఎన్ని ఏండ్లయిందో ఇలాంటి భోజనం కళ్ళచూచి, రుచి చూచి. తన తల్లి బ్రతుకున్నప్పుడు తిన్నదే. ఆమె పోయింతరువాత ఇలాంటి భోజనం మరిచేపోయాడు. తాను కూలి పని చేసిన ఇంటివాళ్ళు కూలివాళ్ళకు వేరుగా రాగి సంగటీ, సద్ద సంగటీ పెట్టేవారు. కూలిపని దొరికనప్పుడు తానే ఇంట్లో ఇంత అన్నం వండుకొని చారు పెట్టుకొనేవాడు. ఎవర్నినైనా అడిగి అంత కూరగానీ, మజ్జిగగానీ తెచ్చుకొని కాలం వెళ్ళబుచ్చేవాడు.

వీళ్ళు దయతలచి తనను జీతగానిగా పెట్టుకుంటే తాను ధన్యుడైనట్లే.

తన పిచ్చిగానీ తనను జీతగానిగా పెట్టుకున్న తరువాత తనకు ఇలాంటి అన్నం పెడతారా?

సొంతవూరు వదిలేసి వచ్చిన తరువాత ఈ రెండు నెలలుగా తాను గడుపుతున్న బ్రతుకు ఒక బ్రతుకా? నికృష్టపు బ్రతుకు, కనాకష్టపు బ్రతుకు! తాను సాగబారిన దారి వెంబడి ఎన్ని పల్లెలు దాటొచ్చాడు, ఎన్ని పల్లెలలో నిలిచాడు! ఒక్కొక్క పల్లెలో నాలుగైదు రోజుల పని ఒకే ఇంటి వద్ద దొరికేది. అక్కడ తన బ్రతుకు కొంచెం సుఖంగా గడిచేది. మూడుపూటలా తిండి, ఎక్కడో ఒకచోట చన్నీటి స్నానం. పడుకోవడానికి ఒకచోటు, చాటు దొరికేవి. పనిదొరకని రోజుల్లో పస్తే.

ఈరోజు ఎక్కడ పడుకోవాలనుకుంటూ, పశువుల కొట్టం ముందర అవకాశముందేమో చూడబోయాడు.

"మనం ముగ్గురం ఈ అరుగు మీద పడుకుంటాం, ఆ పిలగాణ్ణి ఆ అరుగుమీద పడుకోమందామా?" అన్నాడు పెద్దిరెడ్డి.

"కొత్తోణ్ణి నమ్మి ఇంటి ముందర ఎట్ల పడుకోమంటావు?" అంది జానకమ్మ.

"ఔను పక్క మనుషుల్ని నమ్మకూడదు. సమయానికి ఏదో కొన్ని సొల్లు మాటలు చెప్పి, నమ్మించి దగ్గర చేరతారు. నమ్మినంక అసలు బుద్ధి సూపిస్తారు. ఇట్లా కథలు ఎన్ని వినలా మనం" అంటూ

**కొత్తగాలి...**

**భూమ్యాకర్షణ శక్తి**
**ఉందని శాస్త్రవేత్తలంటే**
**ధరలను కిందకు లాగదేం?**
**అని సామాన్యుడి సణుగుడు!**

*– ధరణీకోట శివరాంప్రసాద్, హైదరాబాద్*

మరింత బెదరగొట్టింది సీత.

"అట్లని ఈ రాత్రిపూట యాటికి పొమ్మనేది. ఎంతైనా సరికాపోళ్ళ పిల గాడు"

"నిజంగా మన కాపోడేనంటవా? " అంది జానకమ్మ.

పెద్దిరెడ్డికి ఇంతసేపు తర్కించే అల వాటు లేదు. ఏదైనా అమీ తుమీ తేల్చేసి నిశ్చింతగా ఉండడం అతని అలవాటు.

"సరేలే, ఆ జంబు చాపా, రాగి గుబ్బ దిండూ ఇచ్చి మిద్దెపైన పండుకోమను. తెల్లారినంక చూసుకుందాం"

రాఘవరెడ్డి చాపాదిండూ ఎత్తుకొని మిద్దెపైకి వెళ్ళిపోయాడు. చల్లగాలికి ప్రశాంతంగా పడుకొని నిద్రపోయాడు.

ఇంటివాళ్ళు ముగ్గురూ మామూలు ప్రకారం ఒక అరుగుమీదే పడుకున్నారు.



పెద్దిరెడ్డివి రెండు కాండ్ల ఎద్దులు. చీక టిగా ఉండగానే పెద్దిరెడ్డి రెండుకాండ్ల ఎద్దులనూ నీళ్ళుతాపి పలుపులు కొమ్ము లకు చుట్టి వదిలేశాడు. అవి నేరుగా బావి దారి పట్టాయి. పెద్దిరెడ్డి కపిలబాన భుజానికెత్తుకున్నాడు.

పెద్దిరెడ్డి ఎద్దుల్ని అదిలించడమూ, ఎద్దులు నీళ్ళు తాగేటప్పుడు కి...య్యో... అని రాగం సాగదీయడమూ విని రాఘవ రెడ్డి లేచి, చాపా దిండూ చంకలో పెట్టు కొని మిద్దెదిగి వాటిని అరుగుమీద పడ వేసి పెద్దిరెడ్డి భుజానికెత్తుకున్న కపిల బాన తాను అందుకున్నాడు.

పెద్దిరెడ్డి వద్దనలేదు. ఆ రోజు రాఘవ రెడ్డిచేత పని చేయించుకొని చూడాలనుకు న్నాడు. నచ్చితే జీతగాడుగా కుదుర్చుకో వచ్చు అనే ఆలోచనలో కూడా ఉన్నాడు.

"ఈపొద్దు మనకు శానా పనుంది. చెరు కుతోట కోలెసాళ్ళన్నీ దున్ని ఎగెయ్యాల. కాలవలు కట్టల్ల. మడక దున్నేదానికి ఒక రిని, ఎగేసే దానికి ఇద్దరు కూలోళ్ళను రమ్మని నిన్ననే చెప్పుంటి. వాళ్ళొచ్చేదాకా కపిల్లోలి రెండు కయ్యలు పారగట్టల్ల"

"ఇంకొంచెం బాగా తెల్లారనీ అప్పా. నేనే మడక కడతా. కూలోళ్లను ఎగేసేపనీ, కాలవలు తీసేపని చూడమందాం" అన్నాడు రాఘవరెడ్డి.

మర్రిచెట్టుకింది సపారులో నుండి మోకు, తొండం తాడు, బండి, పుల్లిరుసు, జిల్లలు, అన్నీ తెచ్చి కపిల తోలడం మొద లుపెట్టాడు పెద్దిరెడ్డి.

"నాకు ఈ పని ఒకటి మాత్రం తెల్దప్పా. మా పక్క ఎక్కడ చూచినా కరెంటు మోటర్లే. లేదా ఆయిల్ ఇంజన్లే"

పెద్దిరెడ్డి ఊ కొడుతూ ఉన్నాడు. రాఘ వరెడ్డి ఆయన కపిలె ఎలా తోలుతున్నాడో గమనిస్తూ పది నిమిషాలు ఆగాడు.

"ఇట్రాప్పా, నేనూ రెండు బానలు తోలుతా" అన్నాడు కాస్త ధైర్యం వచ్చి, ఊరకే ఉండడం ఇష్టంలేక. పెద్దిరెడ్డి పగ్గాలు రాఘవరెడ్డికిచ్చి తప్పుకున్నాడు.

బాగా తెల్లవారగానే రాఘవరెడ్డి కపిల నిలిపేసి రెండోకాడి ఎద్దులతో మడక దున్నడం ప్రారంభించాడు.

రాఘవరెడ్డి పసివాడైనా అనుభవజ్ఞు డిలా కపిల తోలడం, మడక దున్నడం చూచి పెద్దిరెడ్డికి ముచ్చట వేసింది.

"ఈ పనంతా ఎప్పుడు నేర్చుకున్నావు రాఘవా? " అన్నాడు మెచ్చుకోలుగా.

"చెప్పినా కదప్పా. మాకుండింది రెండెక

రాల మిట్ట చేనే. సెలవు రోజుల్లో మా అమ్మా నాయనలతో కూడ నేనూ కూలికి పోతేనే సంసారం గడిచేది. ఆరో తరగతి నుండి అన్ని సేద్యం పనులూ చేసినా, మా నాయన పోయినాక చదువు చాలించి పదేండ్లుగా సేద్యమే చేస్తావుండా. మళ్ళో పైరు నాటినా, కలుపు తీసినా, చేన్లల్లో గడ్డి తవ్వినా, ఎద్దల్తో బంతి తొక్కించినా. కపిల తోలేది ఒకటే నాకు రాంది"

"ఫరవాలేదు. బిరీన నేర్చుకున్నావు. అయినా మన ఎద్దులు గట్టివిలే. బాగా పొగారినాయ్. భయం లేదు"

ఎనిమిది గంటలకు కూలివాళ్ళు వచ్చే శారు. జానకమ్మ ఒక సత్తు చెరవలో మజ్జిగ కలిపిన సద్దీ, రెండు సత్తు గ్లాసులూ, పైట కొంగులో రెండు పిడికిళ్ళ సన్న ఎర్రగడ్డలూ తెచ్చింది.

రాఘవరెడ్డీ, పెద్దిరెడ్డీ దోనె నీళ్ళతో ముఖం కడుక్కొని మర్రిచెట్టు క్రింద కూర్చున్నారు. మధ్య మధ్య ఎర్రగడ్డలు నంజుకుంటూ సద్దితాగడం ముగించారు. పెద్దిరెడ్డి బీడీ ముట్టించాడు.

కొద్దిరోజులుగా డస్సిపోయి ఉండిన రాఘవరెడ్డి ప్రాణం నిన్నటి కడుపునిండా తిండి, కంటి నిండా నిద్ర ,దొరకడంతో తేరుకుంది. మనస్సూ- శరీరమూ హుషా రుగా ఉన్నాయి. కూలివాళ్ళతో బాటు నిల పకుండా పనిచేశాడు, మధ్యాహ్నం దాకా.

అందరికీ భోజనాలొచ్చాయి. అందరూ భోజనాలకు కూర్చున్నారు. రాఘవరెడ్డి మాత్రం బావిలోకి వెళ్ళి బనీను, లుంగీ ఉ తికి గట్టున ఆరవేసి స్నానం చేసి తువ్వాలు చుట్టుకొని వచ్చి కూర్చున్నాడు. సీత అందరికీ సద్ద సంగటీ బెండకాయల పుల్లగూరా మొటిక్కాయల తాలింపూ వడ్డించింది.

సాయంత్రం ఇంటి ముఖం పట్టారు.

"ఇక్కడ సపారులోనే పెట్టేస్తే ఏం? ఎవరైనా ఎత్తకపోతారా? " అన్నాడు కపిల బాన ఎత్తుకుంటూ.

"ఎవురూ ఎత్తకపోరు. అడివి దగ్గర కదా! రాత్రిపూట నక్కలు కొరికేస్తాయి"

"సపారు ఎత్తుపెంచి నక్కలకందకుండా తగిలించాల" రాఘవరెడ్డి అన్నాడు.

పెద్దిరెడ్డి ఆ రోజు జరిగిన పని బేరీజు వేసుకొన్నాడు. రాఘవరెడ్డి సొంత మని షిలా పనిచేస్తూ ముందుకు పోతుంటే కూలివాళ్ళు వెనుక పడడానికి వీలులేకపో యింది. రెండింతల పని జరిగిందని పెద్ది రెడ్డికి సంతోషంగా ఉంది.

★ ★ ★

మరుసటిరోజు ఆకు తోటలో తీగలు దింపే పని. ఇది కాస్త నైపుణ్యంతో చేయ వలసిన పని.

పెద్దిరెడ్డి ఆకు తోట నిచ్చెన ఎక్కి తీగల కట్లు విప్పి దింపుతూ ఉంటే రాఘవరెడ్డి మొదళ్ళవద్ద కాలువలు త్రవ్వి తీగల కొనలు కొంతభాగం వదలి మిగిలిన తీగ లను కాలువలో పూడ్చి పెడుతున్నాడు. వదలిన కొనలను అవిశె చెట్లకు అంటగడు తున్నాడు. పెద్దిరెడ్డి ఇనుప గోరుతో తమ లపాకులు తుంచి తుంచి అందిస్తూ ఉంటే రాఘవరెడ్డి పొత్తులు పొత్తులుగా గంపలో పెడుతున్నాడు. కోసిన తమలపాకులు వెంటనే నెరబైలుకు పంపేయాలి. ఆలస్య మైతే వాడిపోతాయి. కొనేవాళ్ళు తక్కు వకు అడుగుతారు.

పని చకచకా జరిగిపోయింది. రాఘవ రెడ్డి పనితనాన్ని చూచి పెద్దిరెడ్డికి చాలా సంతోషమైంది. పసివాడైనా అన్ని పనులూ తెలివిగా చేసుకుపోతున్నాడు అని సంబరపడిపోయాడు.

మధ్యాహ్నం పనేమీ లేదు. మబ్బులు కమ్మినట్లే కమ్మి మాయమైపోతున్నాయి. మేఘాలు ఇంకా పుష్టిగా నీళ్ళు నింపుకున్న ట్లులేదు. బరువెక్కలేదు. చిన్నగాలికే చెల్లా చెదరైపోతున్నాయి. వాటి వాటం చూస్తుంటే వారం పది దినాల్లో వాన పడే

ట్టుంది.

రాఘవరెడ్డి ఆ వూళ్ళో నాలుగు వీధులూ చూచివద్దామని బయలుదేరాడు. అతడు ఆ వూళ్లో ప్రవేశించి అది మూడో రోజు అయినా అతడు ఊరి నాలుగు వైపులూ చూడ్డానికి గానీ, నలుగురితో మాట్లాడడానికిగానీ ఇంతవరకూ అవకాశం చిక్కలేదు.

ఆ వూరి పేరు కొండకింద పల్లె. పేరుకు తగ్గట్టే ఊరికి ఉత్తరాన అతి దగ్గర్లో శేషా చలం కొండల శాఖలున్నాయి.

ఆ వూళ్ళో ఉన్నవి తూర్పు పడమర లుగా రెండే వీధులు. రెండు వీధుల్లోనూ కలిసి ఇరవై, ఇరవై రెండు ఇండ్లుండవచ్చు. ప్రతి ఇంటికీ ఒక పశువుల కొట్టమో, గొర్రెల దొడ్డో ఉంది. ఇవికాక ఊరికి ఫర్లాంగు దూరంలో హరిజనవాడ. ఏడెని మిది ఇండ్లే. అక్కడ వీధులు లేవు. ఎవరి ఇష్టం వచ్చినట్లు వాళ్ళు కట్టుకొన్న ఇండ్లు.

ఊరి మధ్యలో కాస్త విశాలమైన ఖాళీ స్థలం. అక్కడొక రావిచెట్టూ, వేపచెట్టూ వాటి చుట్టూ మూడడుగుల ఎత్తున విశా లమైన రచ్చబండ. చెట్ల మొదళ్ల వద్ద పన సకాయ పరిమాణంలో రెండు నల్లగుండ్లు. ఆ గుండ్లకు అడ్డంగా వెడల్పాటి విబూది పట్టెలు... ఒకటి ఆ గ్రామస్థులకు విఘ్నే శ్వరుడూ, రెండవది సందర్భాన్ని బట్టి ఈశ్వరుడూ, సుబ్రహ్మణ్యస్వామి అన్నీనూ.

మరోచోట ఒక వేపచెట్టూ, దాని చుట్టూ ఒక అడుగెత్తు రచ్చబండ. రచ్చబండ మధ్యలో అటు చతురస్రమూ, ఇటు త్రిభు జాకారమూ కాని ఆకారంలో మూడడుగుల ఎత్తూ, మూడడుగుల వెడల్పూ, నాలుగం గుళాల మందమూ ఉన్న ఒక నిలువు బండ. దాని నిండా పసుపు పూతా, కుంకుమ బొట్లూ, పట్టెలూ. అది ఆ గ్రామానికి గంగమ్మతల్లి. దాని ప్రక్కన గంగరావిచెట్టు, చెట్టుకింద పొంగళ్ళు పెట్టే మూడేసిరాళ్ళ పొయ్యిలు. రెండు వీధుల లోనూ రెండేసి చేదబావులున్నాయి. మూడిండ్లలో సొంత చేద బావులున్నాయి.

ముందురోజే ఆ వూళ్ళో కొందరు రాఘ వరెడ్డికి పరిచయమయ్యారు. రాఘవరెడ్డి చరిత్ర కొంచెం వినే ఉన్నారు. ఒక ఇంటి అరుగుమీద కూర్చున్న ఇద్దరు రాఘవరె డ్డిని పలకరించారు.

"ఏమంటావుండాడు పెద్దిరెడ్డి? జీతానికి పెట్టుకుంటాడంటనా? " అన్నాడొకాయన.

"ఏమో, ఇంకా ఏమీ చెప్పలే. నేను పని చేస్తా ఉండా- ఆయన చూస్తా ఉండాడు. అట్లనే జరగతా ఉండాది. కూలి మాట ఆయనా ఎత్తలే. నేనూ అడగలే" అన్నాడు రాఘవరెడ్డి.

"రెడ్డి మంచోడులే. ఒంటిగాడు. సేద్యం కొంచెం పెద్దది. నీయట్లా జీతగాడు లేక పోతే ఒకడే సమాళించుకోలేడు. నిన్ను వదులు కొనేవాడైతే ఏ రోజు కూలి ఆ రోజే ఇచ్చేసేవాడు. వదలడనుకుంటా. నిలుపుకుంటాడులే. బుద్ధిగా పనిచేసుకొని బతుక్కో" అన్నాడు మరో మనిషి.

రాఘవరెడ్డి కూడా ఆ రీతిలోనే ఆలోచి స్తున్నాడు. ఆ వూళ్ళో మరే రైతుకూ జీత గాణ్ణి పెట్టుకొనే అవసరమూ లేదు. శక్తి లేదు. పెద్దిరెడ్డి వద్దనుకుంటే తాను మరో ఊరు వెదుక్కోవలసిందే.

★ ★ ★

సాయంత్రం దీపాలు పెట్టేవేళ యాది రెడ్డి భాస్కరరెడ్డీ, అతని తల్లి మంగమ్మా వచ్చారు పెద్దిరెడ్డి ఇంటికి. పెద్దిరెడ్డే పిలి పించినట్లుంది.

అందరూ అరుగుమీద కూర్చున్నారు. దూలానికి లాంతరు వ్రేలాడుతూ ఉంది. కొంతసేపటికి కరవల ఆంజనేయాచారీ, ఈడిగ కృష్ణయ్యా, ఉత్తారెడ్డీ వచ్చారు. వస్తూనే ఉత్తారెడ్డి "ఏందీ.. బావాబామ్మర్దీ మీటింగు? ఏంది సంగతి? " అంటూ వచ్చి కూర్చున్నాడు.

"సమయానికొచ్చినారు. కూచోండి. చిన్న

పంచాయితీ" అన్నాడు భాస్కరరెడ్డి.

"మంచి పంచాయితీ అయితే కూసుంటా. ఆచ్చారిని పొమ్మనండి. దొంగ పంచాయితీ అయితే ఆచ్చారిని ఉండమనండి, నేపోతా" అన్నాడు ఉత్తారెడ్డి.

"మెట్టిరిగి పోతుంది సొగిలి నా కొడకా. నేను దొంగల పంచాయితీ చేసే వాణ్ణంట్రా? " అన్నాడు ఆంజనేయాచారి.

అందరూ గొల్లున నవ్వారు.

"అయితే అబ్బోడా! మీదే వూరంటివీ" అంటూ సాగదీసింది మంగమ్మ.

"మాది పీలేరుకివతల మద్దిలేరు, పెద్దమ్మా" అన్నాడు రాఘవరెడ్డి.

ఆ కలుపుగోలు పిలుపుకే మురిసిపోయింది మంగమ్మ.

"మద్దిలేట్లో ఎవురి పిల్లోణివి. మీ నాయన పేరేమి? " అంది మంగమ్మ కాస్త ఆసక్తి కనబరుస్తూ.

"క్రిష్టారెడ్డి.. చెరుకు క్రిష్టారెడ్డి"

గోడకానుకొని కూర్చున్న మంగమ్మ చటుక్కున ముందుకు జరిగి "ఏందీ- మల్లా చెప్పు" అంది.

"మా నాయన పేరు చెరుకు క్రిష్టారెడ్డి"

"మద్దిలేరు- చెరకు క్రిష్టారెడ్డి- ఈ పేర్లు విన్నానే- మీ అమ్మ పేరు- అదే.. నోట్లోనే ఉంది రావడం లేదు... మంచిపేరు.." అంది మంగమ్మ తల గోక్కుంటూ

"సునందమ్మ" అన్నాడు రాఘవరెడ్డి.

"ఆc! ఆc! సునంద- సునంద - నువ్వు సునంద కొడుకువా? సునంద ఎవురంటే... ఒరే భాస్కరా- మీ గోవింద మ్మత్త ఉందే- అదేరా- మా సిద్దారెడ్డన్న భార్య... ఆ గోవిందమ్మొదినెకు ఒక అక్క ఉండేది సుందరమ్మని. ఆమెను తిరుపతి దగ్గర చెర్లోపల్లిలో ఇచ్చుంట్రి. నా పెండ్లప్పుడు సుందరమ్మ, ఆమె కూతురు సునంద వచ్చుంట్రి. అప్పుడు సునంద పదేండ్ల పిల్ల. సుందరమ్మ మొగుడు సుద్ద పరిగిలి వెధవంట. పైసా సంపాదించే వగ లేదు కానీ తాగేదానికి మాత్రం కావాల. ఆ దిగులుతోనే ఆమె మల్ల రెండేండ్లకే కాలమైపోయె. ఆ వెధవ మల్లా పెండ్లి చేసుకున్నాడంట. ఆ వచ్చిన మహాతల్లికి సునందంటే పడేది కాదంట. సరిగా సూసుకొనేదికాదంట. అప్పుడనంగానే ఈ క్రిష్టారెడ్డి- వీళ్ళ నాయన- చెర్లోపల్లి దగ్గర ఇటిక బట్టీలకాడ పనిచేస్తా వుండినాడంట. ఆ మహాతల్లి ఎట్లనో ఈ క్రిష్టారెడ్డి సమాచారం ఎల్లబెరికి, కలేసి సునందనిచ్చి పెండ్లి చేసేసింది. పీడా పొయ్యిందిలే అనుకుంది. క్రిష్టారెడ్డి మల్లా మద్దిలేరు చేరుకున్నాడని వినుంటి. అయితే అబ్బోడా! నువ్వు సునంద కొడుకువా? అట్ల చెప్పు" అంది మంగమ్మ గతాన్ని తిరగదోడుకుంటూ.

మొత్తానికి తేలిందేమిటంటే భాస్కరరెడ్డి తల్లికి రాఘవరెడ్డి దూరపు బంధువు. నిస్సందేహంగా కాపోళ్ల పిల్లవాడే. అంటే రెడ్ల పిల్లగాడే.

రెండు రోజులుగా రాఘవరెడ్డి సేద్యపు పనులు ఎట్లా చేసుకొచ్చిందీ మాట్లాడుకున్నారు. "ఏడాది పాటైనా ఉంటావా మధ్యలో ఎల్లిపోతావా" అని నిగ్గదీశారు.

"రెండు మూడేండ్లు ఎక్కడా పోను. రవంత కాళ్ళు చేతులూ కూడదీసుకోని మా వూళ్ళో మల్లా ఇల్లు నిలేసుకొనేవరకూ ఉంటా" అన్నాడు రాఘవరెడ్డి నిష్కర్షగా.

భాస్కరరెడ్డి మాట్లాడాడు.

"ఇదిగో రాఘవా. మా పెద్దిరెడ్డి మామ మెత్తనోడు. గట్టిగా మాట్లాడను కూడా మాట్లాడడు. ఇంతకు ముందు ఇట్లనే ఇద్దరు ముగ్గురు జీతానికుంటామని వొచ్చి నాలుగైదు నెలలు నమ్మకంగా వుండి, జీతం డబ్బులు మొత్తం తీసేసుకుని చెక్కేసినారు. జీతగాళ్ళుండినప్పుడు ఆయన సుఖపడిందీ లేదు. లేనప్పుడు వెనక పడిందీలేదు. ఒంటిగాడైనా ఎట్లనో సమాళించుకుంటా వస్తావుండాడు. ఈ నడమ రవంత మెత్తబడినాడు. నువ్వొచ్చినావు.

సాటి కాపోడిని. ఎత్తొచ్చినావు. నీకూ చెయ్యి అందించాల. రెండు దినాలు నీ పని చూచినాము. శ్రద్ధగా పని చేస్తావుం డావు. నువ్వు గట్టిగా నిలబడి సేద్యం బాగా చేసుకుంటాపోతావని మనసు కొచ్చింది. నిన్ను జీతానికి పెట్టుకుంటాడు. ఏమంటావు? గట్టిగా నిలబడతావా? ”

రాఘవరెడ్డి ఏమీ మాట్లాడలేదు. “ఊం” అన్నాడు. పొమ్మనకుండా ఉండమంటు న్నారు. అదే పదివేలు.

“ఇదిగో ఇక్కడ ముగ్గురు పెద్ద మనుష లుండారు. మొలకల పున్నమ పోయి పద్దైదు దినాలయింది. పై సంవత్సరం మొలకల పున్నమ పోయి అమాస వచ్చే దాకా పని చెయ్యాల్ల. ఇప్పుడొక షర్టూ, ఒక లుంగీ పంచె తీసిస్తాము. దీపావళికి ఇంకొక జత తీసిస్తాము. సంవత్సరానికి ఐదు నూర్లు జీతం. వీళ్ళు ఏమి తింటారో నీకూ అదే పెడతారు. జీతగానికని వేరేగా చేసిపెట్టరు. ఎంతైనా సాటి కాపోడివి. ఏమి ఆచ్చారీ, క్రిష్ణయ్యా, ఉత్తారెడ్డీ వింటా వుండారా? ” అన్నాడు భాస్కరరెడ్డి

“సాలుకి అయిదు నూర్ల జీతం, రెండు జతల గుడ్డలూ, మూడు పూటలా వాళ్ళు వొండుకొనే భోజనం. ఇంకా దొబ్బు డాయా? ఉండిపోక” అన్నాడు ఉత్తారెడ్డి.

ఆచారీ, కృష్ణయ్యా అదే మాట అన్నారు.

రాఘవరెడ్డికి సంతోషంగానే ఉంది. ఒక సంవత్సరం పాటు ఒకచోట నిలబడేదానికి అంతమాత్రం ఆధారం దొరికితే చాలు. ఇల్లు వేసుకొనేందుకు కావలసిన డబ్బు సంపాదించుకోవచ్చు. ఒక మేకపిల్లనో, గొర్రెపిల్లనో పట్టి మేపుకుంటే సంవత్సరానికి ఎన్ని జీవాలయ్యేది! రెండు మూడేండ్లలో ఇల్లు కట్టుకోవచ్చు.

“లుంగీ పంచెలుండాయి ఎక్కడికైనా పోవాలన్నా రావాలన్నా ఒక పెద్ద పంచె ఉంటే బాగుంటుంది” అన్నాడు మెల్లగా.

“లుంగీ పంచెకు ఇంకంత ఎగేస్తే పెద్ద పంచె వస్తుంది” అన్నాడు భాస్కరరెడ్డి.

పెద్దిరెడ్డి మాట్లాడకపోవడం చూసి రాఘవరెడ్డి “మళ్ళీ దీపావళికి తీసిచ్చేది వద్దు. ఇదే చాలు” అన్నాడు ఆత్రంగా

“సరేలే. రేపు నెరబైలు సంతలో కొను క్కుందాములే” అన్నాడు పెద్దిరెడ్డి.

“ఇదిగో రాఘవా. ఇప్పుడే చెబుతా వుండా. రేపు సంతలో నీ ఖర్చుకు యాభై రూపాయలిస్తాడు మామ. తరువాత దీపా వళికి కావాలంటే నూర్రూపాయలిస్తాడు. మిగిలిన లెక్కంతా మొలకల పున్నానికే. మధ్య మధ్య దుడ్లు అడగకూడదు” అన్నాడు భాస్కరరెడ్డి.

“అంతేలే రాఘవరెడ్డి. నీకు మాత్రం ఏం ఖర్చుంది? యాడికన్నా పోవాల్నా రావల్నా. పెద్ద మొత్తం ఒకసారిగా తీసు కుని ఇల్లు కట్టుకో” అన్నాడు ఆచారి.

రాఘవరెడ్డి తలూపాడు.

“ఆచారీ క్రిష్ణయ్యా, ఉత్తారెడ్డీ మీరు ముగ్గురూ సాక్షులు. బాగా జ్ఞాపకం పెట్టు కోనుండండి” అన్నాడు భాస్కరరెడ్డి.

అక్కడ అగ్రిమెంట్లూ రాతకోతలూ ఏమీ లేవు. ఉండవు.

4



**మ**రుసటిరోజే నెరబైలు సంత. పెద్ది రెడ్డి రాఘవరెడ్డిని బండి కట్టమన్నాడు. వసారా అరుగుమీద కుడివైపు చివరిగ దిలో బండి సామాన్లున్నాయి. బండి కూసులు, కడిశీలలు, ఇత్తడి పొన్నులు

బిగించిన కాడిమానూ, బయటికి తీశాడు రాఘవరెడ్డి. గూట్లో కందెన తీసి చక్రాలకూ, ఇరుసుకూ పట్టించాడు. కాడిమాను బండికి కట్టి, కూసులు చెక్కాడు.

ఆ గదిలో ఇంకా ఆరు ఇనుప తగార్లూ, పుల్లలతో అల్లిన వడ్డె తట్టలు నాలుగూ, వెదురు గంపలు నాలుగూ, రెండు పెద్దపారలూ, ఒక గొనంపార, పదహైదు గుద్దెండ్లూ, చెర్నాకోలలూ, చెడీబడ సామాన్లు గదినిండా ఉన్నాయి.

ఎడమవైపు చివరి గదిలో పదహైదు వేరుశెనక్కాయల మూటలూ, తవుడు మూట, నారకట్టలూ, పాతనులక మంచమూ ఉన్నాయి.

బండి సిద్ధమయింది. పెద్ద ఎద్దులు కట్టి వాటి మెడలకు గంటల పట్టెడలు కట్టాడు.

**కొత్తగాలి...**

**ముగ్గిన**
**జాబిలి పండు పగిలిందా?**
**వెన్నెల రసం**
**విరజిమ్మిందే**

– మాధవీ సనారా, అనకాపల్లి

రెండు గంపలనిండా కూరగాయలూ, ఒక గంప సన్న ఎర్రగడ్డలూ, చిన్న వెదురు గంపలో తమలపాకులూ బండికెక్కాయి. నాలుగు కట్టల వరిగడ్డి కూడా వేసుకున్నారు. రాఘవరెడ్డి నొగలమీద, పెద్దిరెడ్డి బండిలోపలా కూర్చున్నారు.

సంత దగ్గర బండి ఆగగానే రొంపిచెర్ల సాయిబులూ, పీలేరు మార్కెట్ బేరగాళ్లూ వచ్చి చుట్టుకున్నారు. రెండు గంపల కూరగాయలనూ ఒట్టు మొత్తంగా బేరం చేస్తున్నారు. పెద్దిరెడ్డికి బాగా పరిచయమున్న సాయిబు బలవంతాన గంపలను దించుకోబోయాడు. రాఘవరెడ్డి గంపలను దింపనివ్వలేదు. సంతగేటు వసూలు చేసేవాడి దగ్గర చీటీలు కొని గంపలను ఒకచోట దింపి చిల్లరగా అమ్మసాగాడు.

"అన్నా, ఏందిది? ఇదెప్పటినుంచి" అన్నాడు సాయిబు మొగం అదోవిధంగా పెట్టి. పెద్దిరెడ్డికి కాస్త ఇబ్బందిగా ఉంది. తన మామూలు పద్ధతి మార్చడం బాగాలేదనిపిస్తూ ఉంది. "అది కాదు రాఘవా" అంటూ ఏదో చెప్పబోయాడు.

"ఏం పరవాలేదు నువ్వుండప్పా. ఆరుగాలం కష్టపడి వీళ్ళకు ధారపోయాల్నా? ఓపిగ్గా కూచుంటే మంచి రేటుకు అమ్ముకోవచ్చు" అన్నాడు రాఘవరెడ్డి.

"ఎవరన్నా ఈ పిలగాడు? " అడిగాడు సాయిబు.

"మనోడేలే" అన్నాడు పెద్దిరెడ్డి ఏమనాలో తోచక. సరికులస్తుణ్ణి జీతగాడు అని చెప్పడానికి నోరు రాలేదు పెద్దిరెడ్డికి.

"నేను వీళ్ళింట్లో సేద్యానికి నిలిచినా. నా పేరు రాఘవరెడ్డి" అన్నాడు రాఘవరెడ్డి కుండ బద్దలు కొట్టినట్లు. జీతగాడైనందుకు తాను సిగ్గుపడవలసిన పనిలేదు. దాచుకోవలసిన పనీ లేదు.

చూస్తూండగానే సరుకంతా అమ్ముడుపోయింది. ఎండకాలం కాబట్టి తమలపాకులు ఎక్కువగా రాలేదు. సంతకు వచ్చిన సరుకు మంచి ధర పలికింది. ఆ రోజు తొంభై ఎనిమిది రూపాయలొచ్చాయి. పెద్దిరెడ్డికి చాలా సంతోషమయింది.

సంతలో రాఘవరెడ్డికి ఒక చొక్కా గుడ్డ, ఒక పెద్దపంచె తీసి ఇచ్చాడు. ఒప్పందం ప్రకారం యాభై రూపాయలూ ఇచ్చాడు.

రాఘవరెడ్డి పసుపుగోటు ఉండే నీలం రంగు బనీన్లు రెండూ, రెండు మీటర్ల పట్టాపట్టీ గుడ్డ, ఒక తువ్వాలూ, ఒక లైఫ్ బాయ్ సోపు, ప్లాస్టిక్ రేజరూ, బ్లేడులూ, చిన్న అద్దమూ, దువ్వెనా కొనుక్కున్నాడు. సంతలో ఒక మూల టార్పాలు పట్టపైన

ఒకతను పాత పుస్తకాలు అమ్ముతుంటే అక్కడికి వెళ్లి ఘంటసాల పాటల పుస్తకం కొన్నాడు. ఇంకా అక్కడ కాశీ మజిలీ కథలు, భట్టి విక్రమార్క కథలు, కొన్ని పాత డిటెక్టివ్ నవలలూ, పాత పుస్తకాలూ అమ్ముతూంటే పావలాకొకటి లెక్కన 'ఖబడ్దార్', 'పెట్టెలో శవం', 'కదిల్తే కాల్చేస్తా', 'మిస్టరీ కిల్లర్' డికెట్టివ్‌పుస్తకాలు కొన్నాడు. ఇంకా పదహైదు రూపాయలు ఉన్నాయి.

సంతలో కనబడిన మిట్టపల్లె టైలర్ ఖాదర్‌వలీకి షర్టుగుడ్డా, పట్టాపట్టీ గుడ్డా ఇచ్చి కొలతలిచ్చాడు. బట్టలు రేపే కావాలన్నాడు. సాయంత్రం సంతనుండి ఇంటికి రాగానే తన వస్తువులన్నీ చేతి సంచీలో వేసి వసారా దూలానికి తగిలించాడు.

మరుసటిరోజు ప్రొద్దున సద్ది వేళవరకూ కపిలె తోలి సద్ది అన్నం తినేసి మిట్టపల్లెకు వెళ్లి షర్టూ డ్రాయర్లూ తెచ్చుకున్నాడు. గంగమ్మ రచ్చబండ దగ్గర గంగరావి చెట్టు కింద మునిరాముడు ఒక రైతుకు గడ్డం గీస్తూ ఉంటే అక్కడే ఉండి రైతు వెళ్లిపోగానే తాను కూర్చొని "క్రాపు- కొంచెం కురచగానే కత్తిరించు. ఎండాకాలానికి బాగుంటుంది- మీసం సన్నగా ఒదులు, పలచగానే కత్తిరించు" అని చెప్పి కత్తిరింపించుకున్నాడు. అద్దంలో చూచుకున్నాడు. నాలుగు నెలల క్రాపూ, పదహైదురోజుల గడ్డమూ చీదర వదలిపోయింది. సంచీ తీసుకొని బాయి దగ్గరికి వెళ్లి బావిలో బాగా స్నానం చేశాడు. తలా, ఒళ్ళూ రెండుసార్లు సబ్బుతో బాగా రుద్దుకున్నాడు. పాత బట్టల్ని ఉతుక్కున్నాడు. కొత్త షర్టూ, కొత్త పంచె కట్టుకొని ఇంటికి తిరిగొచ్చి సంచీ దూలానికి తగిలించాడు. ఉతికిన బట్టలు ఆరవేసుకున్నాడు.

కొత్త రూపంలో, కొత్త బట్టలతో మెరిసిపోతున్న రాఘవరెడ్డిని చూచి జానకమ్మ చిన్నగా నవ్వింది.

"ఇప్పుడు బాగుండావు" అన్నాడు పెద్దిరెడ్డి ముక్తసరిగా.

## సోక్రటీసు చతురోక్తులు

**గ్రీకు తత్వవేత్త సోక్రటీసు ప్రతిదాన్నీ ప్రశ్నిస్తూ తార్కికంగా ఆలోచించాలన్నాడు. అది గిట్టని పాలకులు విషమిచ్చి చంపారు. వివిధ సందర్భాల్లో ఆయన నోటినుండి వెలువడిన చతురోక్తులలో కొన్ని...**

### ఇదో కాలక్షేపం!



సోక్రటీసు పొదుపరి జీవితం గురించి తెలిసిన ఒక వ్యక్తి ఒకరోజున ఆయన్ని మార్కెట్‌లోని ఒక అంగడిలో తళతళలాడుతున్న వస్తువులను పరిశీలిస్తుండగా గమనించి, 'నువ్వేంటి, మార్కెట్‌కు రావడం ఏంటి?' అంటూ వ్యంగ్యంగా ప్రశ్నించాడు.

'నాకెప్పుడూ అవసరంలేని, అవసరం రాని వస్తువులు మార్కెట్‌లో ఎన్ని ఉంటాయో చూద్దామని వచ్చాను. నాకు ఇదో కాలక్షేపం' అని సోక్రటీస్ దీటుగా జవాబిచ్చాడు.

సీత కళ్లు పెద్దవి చేసుకుని తిరిగి తిరిగి చూస్తూ లోపలికి వెళ్లిపోయింది.

భాస్కరరెడ్డి ఆ దారిన పోతూ రాఘవరెడ్డిని తేరిపార జూచి దగ్గరికొచ్చి "భేష్. ఇప్పుడు కాపోళ్ళ పిల్లోడి మాదిరుండావు. ఇట్లే ఉండు" అని భుజం తట్టి పోయాడు.

కూలీ డబ్బులకోసం వచ్చిన కూలివాళ్లు రాఘవరెడ్డిని చూసి "ఎవురూ? మన రాఘవరెడ్డేనా? గుర్తే తెలియలేదే! ఎంతైనా రెడ్డిబిడ్డ రెడ్డిబిడ్డే. ఆ కళ యాడికిపోతుంది? " అన్నారు.

ఇందరి మాటలు వింటూ ఉంటే రాఘవరెడ్డిలో కాస్త ఆత్మవిశ్వాసమూ, ధైర్యమూ

ప్రవేశించాయి. బెరుకుపోయింది. తాను మామూలు జీతగాడు కాదు, కాస్త ప్రత్యే కత ఉన్న జీతగాడు. తన కులమే తన కున్న ప్రత్యేకత.

సాయంత్రం పెద్దిరెడ్డినడిగి వసారా గదిలోని పాత నులకమంచాన్ని తీసుకొని తెగిపోయిన, సాగిపోయిన త్రాళ్లు బిగించు కొని పశువులకొట్టం వద్ద వేసుకున్నాడు. 'గొడ్లకాడ మనిషి లేకుంటే ఎట్టా?' అన్నాడు తనలోతాను అనుకుంటున్నట్లు. మొదటి రోజిచ్చిన చాపాదిండూ తెచ్చుకున్నాడు.

★ ★ ★

గంగ పండగ. పల్లెలో సంబరం. ఆ రోజు అత్యవసరమైన పొలం పనులు ఉన్నవారు తప్ప ఊరి వాళ్ళందరూ తీరి కగా రచ్చబండల దగ్గర చేరారు.

గంగమ్మ కొలువున్న రచ్చబండకు ఇరు ప్రక్కలా మూడేసి రాళ్ళు పొయ్యిలాగా పెట్టి వాటిమీద కొత్త కుండలతో పొంగళ్ళు వండుతూ ఉన్నారు ఆడవాళ్ళు. వాళ్ళ వెన కాలే అల్లంత దూరాన మగవాళ్ళు నిలబడి కట్టె పుల్లలూ, నీళ్ళూ వగైరా అందిస్తు న్నారు. పెద్ద రచ్చబండ మీద కొందరు గంగమ్మకు బలి ఇవ్వబోయే కోళ్లను కాళ్ళు కట్టేసి ప్రక్కన పెట్టుకొని మాట్లాడుకుంటు న్నారు. మునిగాడూ, కర్రోడూ, ఎంగిటి గాడూ గంగమ్మ ఎదురుగా కొంత దూరాన నిలబడి పలకలు కొడుతున్నారు.

పెద్దిరెడ్డి ఇంటి తరఫున పొంగలి వండ టానికి సీత వచ్చింది.

బియ్యం కడిగి పొయ్యిమీద పెట్టి గంపలో చూచుకుంటే గరిటె లేదు. పెద్ది రెడ్డి ఎక్కడో దూరంగా ఉన్నాడు. రాఘవ రెడ్డి దగ్గరలో ఉన్నాడు. అటువైపు తిరిగి జగన్నాథరెడ్డితో మాట్లాడుతున్నాడు. 'ఇదిగో' అని పిలిచింది సీత.

రాఘవరెడ్డికి వినబడలేదు. ఇటువైపు చూడలేదు.

"ఇనపళ్ళా? నిన్నే" అంది కాస్త గట్టిగా.

రాఘవరెడ్డికి జగన్నాథరెడ్డి సైగ చేశాడు 'సీత పిలుస్తోంది' అన్నట్లు. రాఘవరెడ్డి వెనక్కు తిరిగి చూచాడు.

"గరిటె మరిచిపోయినా.." అంటూ సాగదీసింది సీత.

"ఇంటికి పోయి తేవల్నా? "

"ఎట్లైనా సరే, నువ్విక్కడ సూసుకుంటా నంటే నేనేపోయి తెచ్చుకుంటా"

"వద్దులే. నేనే పోతా" అని జోరుగా అడుగులేస్తూ వెళ్లిపోయాడు రాఘవరెడ్డి.

ఆడవాళ్ళ మధ్య నిలబడి పొయ్యివైపు చూస్తూ ఉండడం కంటే ఆ గరిటేదో తానే తేవడం మంచిది అనుకున్నాడు కాబోలు.

"ఏందే.. మొగుణ్ణి పిలిచినట్లు పిలస్తా వుండావు, ఏంది కథ? " అంది నాగరత్న సీతవైపు కాస్త వంగి ఆమెకే వినబడేటట్లు.

"పండ్లు రాలగొడతా. నోటికి ఎంత మాటొస్తే అంతమాట కూసేదేనా! హద్దూ పద్దూ ఉండొద్దూ" అంది సీత కొడతాన న్నట్లు చేయి పైకెత్తి.

"లేని మాటేమీ చెప్పలేదే నేను. నువ్వు ఆ మనిషిని పిలిచింది అట్లనే కదా. నేను దాని అర్థం ఇడమరిచి చెప్తి. అంతే! ఏదీ నువ్వు ఆ మనిషిని పేరుపెట్టి పిలువు. లేదా ఓ రాఘవన్నా అనైనా పిలువు. మల్ల నేను మాట్లాడితే పొరకతో కొట్టు" అంది నాగరత్న.

"పోయే- రవుడీ నా సవితీ" అంది సీత నాగరత్న చెంపమీద ఒక పోటు పొడుస్తూ.

"నిజంగా, నిజంగా నన్ను నీ సవితిని చేసుకుంటావంటే? " అంది నాగరత్న నవ్వుతూ.

సీత ఒక కట్టెపుల్ల అందుకోవడం చూచి నాగరత్న లేచి పరుగెత్తింది. సీత తరుము కుంది. ఇద్దరూ పొంగళ్ళ మధ్య అడ్డది డ్డంగా పరుగెత్తుతూ ఉన్నారు.

దూరంగా పెద్దవాళ్ళెవరో అరుస్తున్నారు. "మేయ్, పొంగళ్ళ దగ్గర ఏందే ఆటలు?

అగ్గి దగ్గర ఆ పరుగులేందే? పూజయ్యేవరకూ ఒళ్ళుమీద భయమూ, భక్తీ ఉండనీండి. ఆనంక ఎట్లైనా ఎగురుదురు"

అంతలోపల రాఘవరెడ్డి గరిటె తెచ్చి సీత చేతికిచ్చాడు. నాగరత్న మాటలు విన్న తరువాత సీత మనస్సులో ఏదో కదలిక ప్రారంభమయింది. దాదాపు నెల రోజులుగా చూస్తూన్న రాఘవరెడ్డిని ఇప్పుడు మళ్ళీ మళ్ళీ చూడాలనిపిస్తూ ఉంది. చూస్తూ ఉంది.

పొంగళ్ళు వండడం పూర్తయింది. చాకలి గురవడు గంగమ్మకు పసుపూ కుంకుమా పూసి అలంకరించాడు. వేప మండలతో తోరణం కట్టాడు. పూలదండలు చుట్టాడు. గంగమ్మ శిల ముందర వేపమండలు పరిచి, దానిపైన తెల్లగుడ్డ పరిచి, పొంగళ్ళు రాశి పోయించాడు. భక్తులు మొక్కుబడిగా తెచ్చిన కొత్త చీరలు గంగమ్మ శిలపై పెట్టి తిరిగి వారికి ఇచ్చేశాడు. ఊరివాళ్ళు తాము తెచ్చిన కోళ్ళను గంగమ్మకు బలి ఇచ్చారు. ఆ ప్రాంతం రక్తసిక్తమైంది. తలలు తెగిన కోళ్ళు పైకి ఎగిరెగిరి పడుతున్నాయి.

అందరూ గంగమ్మకు ప్రదక్షిణలు చేశారు. గంగమ్మ ముందర చిల్లర డబ్బులు వేశారు. గంగిరావి ఆకులు తెంపుకొచ్చి పొంగళ్ళ రాశిలోంచి ప్రసాదం తీసి పెట్టుకొని కళ్ళకు అద్దుకొని తిన్నారు.

కోళ్ళ తలలనూ మొండేలనూ పట్టుకొని మగవాళ్లు ముందు నడుస్తుండగా ఆడవాళ్ళు గంపలను నెత్తికెత్తుకొని వెనక నడుస్తున్నారు, వారి వారి ఇండ్లకు.

ముందు రాఘవరెడ్డీ వెనుక సీత నడుస్తూ ఉంటే వెనుక నుంచి సీత జడ పట్టుకొని లాగింది నాగరత్న. సీత వెనుదిరిగి చూచింది. నాగరత్న కన్నుకొట్టి తల ఎగరేసింది. సీత మోచేత్తో నాగరత్న డొక్కలో ఒకపోటు పొడిచి రాఘవరెడ్డిని దాటుకొని చకచకా తమ ఇంటికి వెళ్ళిపోయింది.

## 5

పెద్దిరెడ్డీ, జానకమ్మా బలిజపల్లెలో ఎవరిదో పెండ్లి ఉందంటూ తెల్లవారకముందే లేచి వెళ్లిపోయారు. తొమ్మిది గంటలకే వచ్చేస్తామన్నారు. తెల్లవారుతూండగా రాఘవరెడ్డి చెరుకు తోటలో పనుందంటూ వెళ్ళిపోయాడు.

సీత పాచిపనులు ముగించుకొని, పాలు పితికి కాగబెట్టి, స్నానం చేసొచ్చి చద్దన్నం తినింది. ఎనిమిది దాటింది. ఇక రాఘవరెడ్డికి చద్ది ఎత్తుకు పోవాలి. ఇంతవరకూ బావి దగ్గరికిగానీ, చేని దగ్గరికిగానీ తానొకతే రాఘవరెడ్డికి చద్దిగానీ, అన్నంకానీ ఎత్తుకొని వెళ్ళింది లేదు. అక్కడ అమ్మో, నాయనో ఎవరో ఒకరు ఉండేవారు. ఈ రోజు ఎవరూ లేరు. అమ్మా నాయనా ఎప్పుడొస్తారో ఏమో? రాఘవరెడ్డి ఎదురు చూస్తూ ఉంటాడు. ఇక తప్పదు.

**కొత్తగాలి...**

**ఎక్కడికి వెళ్లాలనుకుంటున్నావ్?**
**ఈ రోడ్డు అడ్డదిడ్డంగా**
**అడ్డూ ఆపూ లేకుండా సాగి**
**దభీమని ఆగిపోతుంది**
**మనని ఆటపట్టించడానికి**

- ఎ.వి.రెడ్డిశాస్త్రి, శ్రీకాకుళం

సీత అద్దంలో చూచుకుని తల పైపైన దువ్వుకుంది. బొట్టు సరిదిద్దుకుంది. కట్టుకున్న బట్టల్ని సవరించుకుంది. సత్తు బోగానిలో చద్దన్నం పెరుగుతో కలుపుకొని ఒక ఆకులో ఊరగాయలు పెట్టుకొని బావి దగ్గరికి వెళ్ళింది. రాఘవరెడ్డి చెరుకుతోట సాళ్ళల్లో యూరియా చల్లుతున్నాడు.

"చద్ది తెచ్చినా.. రా" అంటూ సపారి

క్రిందికెళ్ళింది. రాఘవరెడ్డికి వినపడలేదు.

"నిన్నే చద్ది తెచ్చినా రా! నేను పోవల్ల" అంది కాస్త బిగ్గరగా.

రాఘవరెడ్డి తలెత్తి చూచి బావిలో కాళ్ళు చేతులూ కడుక్కొని వచ్చి కూర్చున్నాడు.

సీత పెరుగు కలిపిన చద్దన్నం గ్లాసులో పోసి యిచ్చింది. ఊరగాయ ఆకుతో కూడా ప్రక్కన పెట్టింది.

"నువ్వు తాగినావా? "

"నాది అయ్యింది"

"అమ్మా, నాయినా వచ్చినారా? "

"ఇంకా రాలే"

రాఘవరెడ్డి చేతులూ నోరూ కడుక్కొని చెరుకు తోటలోకి వెళ్ళిపోయాడు. సీత గిన్నెలు కడుక్కొని ఇంటికి పోతుందనుకున్నాడు. తన పనిలో లీనమైపోయాడు.

పదహైదు నిమిషాలు గడిచిందో లేదో "ఓయమ్మో, ఓయమ్మో తేనీగలు సంపేస్తా ఉండాయి. ఇదో- యాడుండావు? తేనీగలు- తరుముకుంటా వుండాయి. ఓ యమ్మో.." అంటూ కేకలు వినబడ్డాయి. మామూలు కేకలు కావు, చావు భయంతో పెట్టే కేకలు.

చెరకు తోటనుండి రాఘవరెడ్డి ఒక్క పరుగున బయటపడి చూచాడు. సీత బావి ప్రక్కన లేదు- సపారు దగ్గర లేదు. దూరంగా అల్ల నేరేడు చెట్టు దగ్గరినుండి పరుగెత్తుకొని వస్తూ ఉంది. ఆమె తలమీదుగా తేనెటీగలు గుంపులు గుంపులుగా ముసురుకొని వెంబడిస్తున్నాయి. సీత పైట కొంగుతో తేనెటీగల్ని చెదరగొట్టుకుంటూ వస్తూ ఉంది. తేనెటీగలు తరుముకుంటూ వస్తూనే ఉన్నాయి.

రాఘవరెడ్డి సపారులో దూరి ఒక బొంత తీసుకొని సీతకెదు



రు పరుగెత్తాడు. ఇద్దర్నీ కలుపుకొని బొంత కప్పుకొని ఇద్దరూ ఒకర్నొకలు పొదువుకొని కూర్చుండిపోయారు. అప్పటికే ఒక తేనెటీగ రాఘవరెడ్డి మెడమీద కుట్టేసింది. తేనెటీగలు ఒకటి రెండు కుడితే ప్రమాదం లేదుకాని చాలా ఈగలు కుడితే అపాయమే.

సీత ఒళ్ళు గజగజ ఒణుకుతూ ఉంది. ఒళ్ళంతా చెమటలు పడుతున్నాయి. గస పోసుకుంటూ ఉంది.

"తేనెటీగలు ఎక్కడ తరుముకున్నాయి నిన్ను. వాటి జోలికెందుకు పోతివి?"

"అల్ల నేరేడు పండ్లు రాల్చుకుందామని రాళ్ళేస్తి. ఆపైన తేనె రేడ



ఉండేది నేను గమనించలే. ఒకరాయి తేనె రేడకు తగిలింది" అంది సీత ఆయాసంతో. మాటలు అతుకులతుకులుగా వస్తున్నాయి.

"గిన్నెలు కడుక్కొని ఇంటికిపోకుండా ఇట్టా కోతి పనులెవరు చేయమన్రు. నేరేడు పండ్లు కావాలంటే నాకు చెప్పరాదా?"

"ఊ" అంటూ మూలిగింది సీత.

అలాగే దాదాపు పదైదు నిమిషాలు కూర్చుండిపోయారు. బొంతను కొద్దిగా తొలగించి చూచాడు. ఇంకా రెండుమూడు ఈగలు పైన ఎగురుతున్నాయి. మరో పదినిమిషాలు గడిచాయి. తానూ సీతా ఆ విధంగా ఒకే బొంతకింద కూర్చోవడం కాస్త ఇబ్బందిగా ఉంది, రాఘవరెడ్డికి. ఇద్దరూ అతుక్కున్నట్లు కూర్చుంటేనే గానీ బొంత చాలదు. పరాయి పడుచు పిల్లతో అలా అతుక్కొని కూర్చోవడం రాఘవరెడ్డి మనస్సులోనూ, శరీరంలోనూ ఏదో కలవరాన్ని రేపుతూ ఉంది. తప్పేమో అని పిస్తూ ఉంది. కానీ తప్పని పరిస్థితి.

మళ్ళీ బొంత తొలగించి చూచాడు. తేనెటీగలు కనబడలేదు. సీతా ఇంకా కుదుటపడలేదు. ఒణుకు తగ్గలేదు. కప్పుకున్న బొంతను తీయకుండా ఇద్దరూ లేచి సపారు దగ్గరికి వచ్చేశారు. సీత నులక మంచంమీద వాలిపోయింది. ఆయాసప

డుతూ ఉంది. కళ్ళు తెరవడంలేదు. రాఘవరెడ్డి సీతవైపు పరిశీలనగా చూస్తూ "శానా కుట్టినాయా? " అన్నాడు.

"ఊ" అంది సీత.

"ఎక్కడెక్కడ"

"ఒళ్ళంతా"

"ఇప్పుడెట్టుంది? "

"కండ్లు తిరుగుతుండై"

"ఇంటికి పోదాం పద"

రాఘవరెడ్డి సీతను సగం మోస్తూ సగం నడిపించుకుంటూ ఇల్లు చేరుకున్నాడు. సీత నొప్పితో మూలుగుతూ ఉంది. ఈగలు కుట్టినచోట్ల చర్మం కమిలినట్లు నల్లని గుర్తులు ఏర్పడుతున్నాయి. పెద్దిరెడ్డీ జానకమ్మ ఆందోళన పడసాగారు. పసుపు కొమ్ము చాది కుట్టినచోట్ల ఒక్కొక్క చుక్క పూసింది జానకమ్మ. మంట తగ్గింది కానీ నొప్పి తగ్గలేదు. కళ్లుతిరగడం, చెమటలు పట్టడం, గుండె దడ తగ్గలేదు. పెద్దిరెడ్డికి కాళ్లూ చేతులూ ఆడడం లేదు.

రాఘవరెడ్డి గబుక్కున లేచి "అక్కా నెరబైలుకు పోదాం.. రెడీగా ఉండండి" అనేసి ఐదు నిమిషాల్లో ఇంటిముందర బండి నిలబెట్టాడు, బండిలో గడ్డి పరిచి, దాని పైన జంఖాణం పరిచి. జానకమ్మా, సీతా, పెద్దిరెడ్డీ కూర్చున్నారు. భాస్కరరెడ్డి భార్య శారద కూడా వచ్చి బండెక్కింది.

ఇంటి దగ్గర బయలుదేరేటప్పుడే సీత ఒళ్లు కాస్త వేడిగా ఉంది. నెరబైలులో డాక్టరు దగ్గరికి వెళ్లేటప్పటికీ జ్వరం ఎక్కువైంది. తేనెటీగలు ఎక్కడెక్కడ కుట్టాయో ఎక్కడెక్కడ నొప్పిగా ఉందో చెప్పే స్థితిలో లేదు. జానకమ్మ తాను పసుపు చాది పూసిన తావులు చూపింది డాక్టర్‌కి. డాక్టర్ సన్నని శ్రావణంతో అక్కడున్న తేనెటీగల కొండ్లని పెరికాడు. మొత్తం పన్నెండు కొండ్లు విరిగున్నాయి. నొప్పి తగ్గడానికి ఒక ఇంజెక్షనూ, జ్వరం తగ్గడానికి ఒక ఇంజక్షనూ, నాలుగు రోజులకు మాత్రలూ, పూతమందూ ఇచ్చాడు.

"తొందరగా తెచ్చారు కాబట్టి సరిపోయింది. ఆలస్యం అయ్యింటే ఆ కొండ్లు విరిగినచోట శాశ్వతంగా నల్లని మచ్చలు ఏర్పడేవి. ముఖమూ ఒళ్లూ వికారమై పోయేది. ఇంటికి వెళ్లిన తరువాత ఇంకా ఎక్కడెక్కడ కొండ్లు విరిగాయో తెలుసుకొని మీరే ముల్లుతో పెరికేయండి. పూత మందు మూడుపూటలా పూయండి. నాలుగు రోజులు ఎండలో తిరగరాదు" అన్నాడు డాక్టర్. సీత తెలివిలోకి వచ్చే దాకా, మాట్లాడేదాకా అక్కడే ఉన్నారు. శ్రావణంతో మరి పదిచోట్ల విరిగిన కొండ్లు పెరికారు.

ఇల్లు చేరేసరికి రాత్రి ఎనిమిదయింది.

నాలుగురోజులూ పూటపూటకూ సీత దగ్గరికొచ్చి "ఎట్లా ఉంది" అని అడిగి తెలుసుకుంటున్నాడు రాఘవరెడ్డి.

"అక్కా మాత్రలు వేశావా? మందు పూశావా? " అని జానకమ్మను అడుగుతున్నాడు.

నాలుగు రోజుల తరువాత రెండు మూడు దోసిళ్ల అల్ల నేరేడు పండ్లు తువ్వాలులో మూటకట్టుకొని వచ్చాడు. సీత ఒకతే గదిలో ఉంది. గదిలోకి వెళ్లి తువ్వాలు విప్పి నేరేడు పండ్లు సీత తల పైన కుమ్మరించాడు.

"తిను. ఎన్ని తింటావో తిను. వీటి కోసం నువ్వు ప్రాణాల మీదికి తెచ్చుకొని మమ్మల్ని ఉపద్ర పెట్టేస్తివి. తిను" అని విసురుగా వెనుతిరిగి వెళ్లిపోయాడు. సీత కళ్లింతలు చేసి చూస్తూండిపోయింది.

★ ★ ★

ఆ రోజు పొద్దున్నే ఎనిమిది గంటలకే ఎండ తీవ్రంగా కాస్తూ ఉంది. పదకొండయ్యేసరికి వాతావరణం భరించరానంత వేడైపోయింది. ఊళ్లో సగంమంది పెద్ద రచ్చబండ మీద రాగిమానూ, వేపమానూ నీడన చేరిపోయారు. చొక్కాలూ, బనీన్లూ

తీసేసి పైగుడ్డలతో విసురుకుంటున్నారు. పెద్ద వయసు ఆడవాళ్లు గంగమ్మ రచ్చబండ మీద, వేపమాను నీడన చేరిపోయారు.

"శ్రీలంకలో ఎవుడో సిపాయి రాజీవ్ గాంధీని చంపేడానికి తుపాకీ విసిరినాడంట. సమయానికి ఆయప్ప పక్కకు ఒంగి తప్పించుకున్నాడంట. పొద్దున మునిరత్నంరెడ్డి కొలిమి దగ్గర చెప్తావుంటే వింటి" అన్నాడు మునస్వామి.

"వాళ్ల అమ్మ ఆ గడ్డపోళ్లతో తకరారు పెట్టుకోని ఘోరమైన చావుచచ్చె. ఈ యప్ప శ్రీలంకోళ్లతో తకరారు పెట్టుకొని ఏదో ఒకనాటికి వాళ్లమ్మ మాదిరిగానే.."

ఉత్తారెడ్డి మాట పూర్తి కానీయకుండా అడ్డుకున్నారు అక్కడున్నవాళ్లు.

"చాల్లే నోర్ముయ్. మచ్చనాలిక ముండా కొడకా. నువ్వు ఏమన్నా అన్నావంటే సుక్క పెట్టినట్లు జరిగి తీరుతుంది" అన్నాడు ఆదెప్ప కోపంగా.

"మాట్లాడితే మంచి మాట్లాడు. అపశకునం మాట్లాడొద్దు. అసలే ఇందిరమ్మ పోయినప్పటినుండి దేశం అల్లకల్లోలంగా ఉంది..." అన్నాడు మునస్వామి.

"ఓయబ్బో, చాల్లెండి నీతకాలు. నేను సావమంటే ఆయప్ప సస్తాడా, నేను బతకమంటే బతకతాడా- ఆయప్ప చేస్తావుండే పనులు చూస్తావుంటే నాకెందుకో అట్ల అనిపించె. ఏం? ఈయప్ప సచ్చిపోతే దేశం మునిగిపోతుందా? వీళ్ల తాత నెహ్రూ- సచ్చిపోయినప్పుడు ప్రపంచకమంతా ఏమనుకుండె. ఇంగ ఈ దేశానికి దిక్కులేదు అనుకుండ్రి. వీళ్లమ్మ సచ్చిపోయినప్పుడూ అట్లనే అనుకుండ్రి. దేశం ఆ పాట్నె మునిగిపోయేనా? ఈయప్ప పోతే ఈయనట్లాంటోడు- ఇంకా మొనగాడు- ఎవుడో ఒకడు రానే వస్తాడు" అన్నాడు ఉత్తారెడ్డి.

అందరూ మౌనంగా ఉండిపోయారు.

పొద్దు అటువైపుకు మళ్లింది. సన్నగా గాలి వీచడం ప్రారంభమయింది. తూర్పు పక్కన మబ్బులు కనబడ్డాయి. చూస్తూ ఉండగానే మబ్బులు ఎక్కివచ్చి ఆకాశం అంతా కమ్ముకున్నాయి.

వానొచ్చేటట్లు ఉండాది. శెనిక్కాయలు ఎండబోసుంటిమి. మొన్నాటి నుండి ఒలిచే పని పెట్టుకోవల్ల, తడిసిపోతాయేమో" అంటూ బయలుదేరాడు పెద్దిరెడ్డి.

"మీ పిల్లగాడు ఇంట్లో లే?"

"ఉండాడు. ఈపాటికి కుప్పతోస్తా ఉంటాడు" అంటూ కదిలాడు.

ఎక్కడి వాళ్లక్కడ వెళ్లిపోయారు.

పెద్దిరెడ్డి వెళ్లేటప్పటికీ జానకమ్మ, సీతా, రాఘవరెడ్డి శెనిక్కాయలను కుప్పగా ఎగదోస్తున్నారు. పెద్దిరెడ్డి అరుగుమీద ఉన్న సంచుల్ని తెచ్చి కుప్పదగ్గర పడవేసి "సంచి పట్టు" అన్నాడు. జానకమ్మ సంచి పట్టుకుంది. పెద్దిరెడ్డి చిన్నగంపతో శెనిక్కాయలు తోడి సంచిలో పోస్తున్నాడు. మరో పక్క సీత సంచి పట్టుకోగా రాఘవరెడ్డి చిన్న గంపతో ఎత్తి సంచిలో పోస్తున్నాడు.

చినుకులు మొదలయ్యే లోపల శెనిక్కాయల మూటలు గదిలో చేరిపోయాయి.

వాన ప్రారంభమయింది. పెద్దపెద్ద చినుకులతో బాటు వడగండ్లు పడుతున్నాయి. చిన్నపిల్లలు వడగండ్లు ఏరి నోట్లో వేసుకుంటున్నారు. సీసాలలో భద్రపరుచుకుంటున్నారు. తేలు కుట్టినచోట

## కొత్తగాలి...

**ఉన్నోడింట**
**బంగారం ధగధగ**
**పేదోడి కడుపున**
**అంగారం భగభగ**

– సువారపు రామచంద్రరావు,
తిరువూరు

వడగండ్ల నీళ్లుపోస్తే నొప్పి తగ్గుతుందంట.

వాన రెండు గంటలసేపు కుండపోతగా కురిసింది. వీధులలో మిట్టపల్లాలు కనబడటం లేదు. వీధుల్లో ఏరు పారుతున్నంత ఉధృతంగా ఉంది వెల్లువ.

వాన కొద్దిగా తగ్గగానే పిల్లలు వీధుల్లోకి వచ్చేశారు. నీళ్లలో కాగితం పడవలు వదులుతున్నారు. సన్నగా పారుతున్న నీళ్లకు మట్టితో అడ్డకట్టలు కడుతున్నారు. అవి తెగిపోయి నీళ్లు వెళ్లిపోతూ ఉంటే కేరింతలు కొడుతున్నారు.

వర్షం పూర్తిగా నిలిచిపోయింది. ఇంకా పొద్దు చాలా ఉంది. మగవాళ్లందరూ గబగబా చేన్ల దగ్గరికీ మళ్ల దగ్గరికీ, చెరువు కట్టమీదికీ వెళ్లిపోయారు. ఎగువన కొండల్లోంచి రెండు వాగులు చెరువులోకి వచ్చిపడుతున్నాయి. అప్పటికే చెరువులో రెండు నెలలకు సరిపడే నీళ్లు నిలిచాయి. మళ్లల్లో నీళ్లు నిలిచిపోయి గనిమెలపైన పొర్లి ప్రవహిస్తున్నాయి. పెద్దిరెడ్డి చెరుకు తోటలో నీళ్లు నిలిచిపోయాయి. రాఘవరెడ్డి గనిమెలు తెగ్గొట్టి నీళ్లను కయ్యల్లోకి వదిలాడు. మబ్బులు తెరపిచ్చాయి. వాలు టెండ దీర్ఘంగా సాగుతూ ఉంది. అందరూ సన్నని చినుకుల్లో తడిసిన వాళ్లే. కాస్త చిరు చలిగా కూడా ఉంది.

రాఘవరెడ్డి ఆకుతోటా, చెరుకుతోటా చుట్టేసుకొచ్చి అరుగుమీద కూర్చున్నాడు. అక్కడే సీత కూడా ఉంది. ప్రొద్దు గ్రుంకిపోయింది.

"ఈ చలికి సద్దరొట్టెలో, జొన్నరొట్టెలో ఉడుకుడుగ్గా తింటే బాగుండును" అన్నాడు రాఘవరెడ్డి మెల్లిగా తనలో తాను అనుకుంటున్నట్లు.

సీత రాఘవరెడ్డి వైపు ఆశ్చర్యంగా చూచి లోపలికి వెళ్లిపోయింది.

రాఘవరెడ్డి గతుక్కుమన్నాడు. సీత ఈ మాట పెద్దవాళ్లతో చెప్పదుకదా! ఏమనుకుంటున్నాడు తాను. ఇది తన ఇల్లా. తాను ఈ ఇంటిలో ఒక జీతగాడు మాత్రమే. వాళ్లు పెట్టింది తినాలి కాని ఫలానా చేసి పెట్టండి అని అడిగేపాటి వాడు కాదు తాను. తనస్థాయి తాను మరిచిపోయాడు. ఈ విషయం తెలిస్తే జానకమ్మ ఏమనుకుంటుంది? ఏమైనా తన నోరు కట్టేసుకోవాలి.

సీత ఆలోచనలు ఇంకోలా ఉన్నాయి.

"లేక లేక ఒక చిన్న కోరిక కోరినాడు. ఆ కోరిక ఎంత బలంగా హృదయంలో నుండి తన్నుకొచ్చిందో. నోరు విడిచి అడిగినాడు. అమ్మకు చెబితే అమ్మ ఏమైనా అనుకోవచ్చు. తనకోసం తానే చేసుకుంటున్నట్లు ఇతడు కోరింది చేసి పెట్టాలి"

అదే ఆడతనంలోని అమ్మతనం. మాతృత్వం బయటపడేది తిండిదగ్గరే. లోపల జానకమ్మ గొంతు వినబడింది.

"ఎందుకే ఇప్పుడు జొన్నపిండి పిసకతా ఉండావు"

"ఊరికేనే- ఈ వానకు ఉడుకుడుగ్గా రొట్టెలు తినాలనిపిస్తా ఉంది"

పదహైదు నిమిషాల్లో వసారాలో ఉన్న పెద్దిరెడ్డికీ జానకమ్మకూ, రాఘవరెడ్డికీ సత్తు ప్లేట్లలో జొన్న రొట్టెలూ, పుల్లకూరా వచ్చేశాయి. సీత కూడా తన కంచెంలో తెచ్చుకొని వసారాలోనే అరుగుమీద కూర్చుంది. రాఘవరెడ్డి సీతవైపు చూచాడు. సీత కనుబొమలు ఎగరేసింది. 'నీ కోరిక తీరిందా' అన్నట్లు. రాఘవరెడ్డి అటు ఇటు చూచి చేయి సగం పైకెత్తి పోలీస్ సెల్యూటు చేశాడు సీతకు. సీత కిసుక్కున నవ్వి ముఖం తిప్పుకుంది.

★ ★ ★

రాత్రంతా తేపలు తేపలుగా వర్షం పడుతూనే ఉంది. తెల్లవారుజాముకు ఆకాశమంతా తేటపడిపోయింది. చుక్కలు మసకబారిపోతున్నాయి. క్రమంగా తూర్పు ఎర్రబారింది. కిరణాలు నింగివైపు సాగాయి. పొద్దు పొడిచింది.

రాత్రి వర్షం పడిన తరువాత మొలిచే సూర్యోదయం సుందరంగా ఉంటుంది. ఆ అనుభూతి అనుభవించ వలసినదే కాని వర్ణించేది కాదు. ఆ సౌందర్యం రసజ్ఞుని హృదయపు లోతుల్ని బట్టి ఉంటుంది. అనుభవించగలిగిన వాడికి అనుభవింపగలిగినంత. ఈ ప్రకృతి సౌందర్యం అడవుల సమీపంలోని పల్లెలలో మరింత అందంగా ఉంటుంది.

రైతులందరూ పొద్దున్నే లేచి వాళ్లవాళ్ల చేన్ల వైపు వెళ్లారు మళ్లీ. ఏ చేనిలో ఎంత తేమవుంది? ఎక్కడ మడకలు కట్టే అవకాశం ఉంది? ఎక్కడ లేదు? అని పరిశీలిస్తున్నారు. ఎక్కడ చూచినా తేమ ఎక్కువగా ఉంది. కొన్ని పల్లపు చేలలో నీళ్లు నిలిచాయి కూడా. ఆ రోజు ఎక్కడా మడక కట్టే అవకాశం లేదు. గుట్టవార చేన్లలో తప్ప.

జగన్నాథ రెడ్డీ, రాఘవరెడ్డీ కలిశారు.

"మడకలు కడతావా?"

"మా చేలో నీళ్లు నిలిచాయి. రెండు మూడు రోజులు మడకలుకట్టే వీలులేదు" అన్నాడు జగన్నాథరెడ్డి.

"మీ పక్క చేను ఈడిగ క్రిష్ణయ్యది కదా. అదీ అట్లనే ఉందనుకుంటా"

"అవును. అక్కడా నీళ్లు నిలిచాయి.

"ఓపని చేదామా? రేపు నువ్వూ, క్రిష్ణయ్యా మా చేలో మడకలు కట్టండి. మర్నాడు మా ఎద్దులతో బదులు తీర్చేస్తా. కూలిమడకల బాధుండదు"

జగన్నాథరెడ్డికి ఈ ఆలోచన బాగున్నట్లు తోచింది. అప్పటికి ఆ గ్రామాల్లో ట్రాక్టర్లు అలవాటుకు రాలేదు. కూలి మడకలతో దుక్కి సరిగా కాదు.

"సరే, క్రిష్ణయ్యను అడుగుదాం పద"

క్రిష్ణయ్య కూడా ఒప్పుకున్నాడు.

ఇంటికి రాగానే పెద్దిరెడ్డి మంచం మీద వాలి ఏదో కషాయం తాగుతూ ఉండడం కనబడింది.

"ఏమప్పా? ఏమయింది" అన్నాడు

## వర్షం కురిపించిన భార్య

సోక్రటీస్‌కు గ్జాన్‌తిపే అనే గయ్యాళి భార్య ఉండేది. ఒకరోజు ఆమె కోపంతో ఒళ్లుమరచి భర్తను చెడామడా తిట్టడం ప్రారంభించింది. ఆమె గుణం తెలిసిన సోక్రటీస్ అక్కడినుండి చడీచప్పుడూ లేకుండా తప్పుకోవడం మంచిదనుకున్నాడు. తన భర్త జారుకుంటున్నాడన్న కోపంతో మురికినీళ్ళతో ఉన్న ఒక బకెట్‌ను



బాల్కనీనుంచి కింద నిలబడిన భర్తపై గుమ్మరించేసిందామె.

పైనున్న భార్యవైపు సోక్రటీస్ శాంతంగా చూస్తూ 'ఇన్నిరోజులు ఉరుములు, మెరుపులు మాత్రమే ఉండేవి. ఇప్పుడు వానలు కూడా మొదలయ్యాయి' అని అన్నాడు చిరునవ్వుతో.

రాఘవరెడ్డి ఆదుర్దాగా.

"ఏం లేదు రాఘవా. నిన్న శెనిక్కాయలు ఎత్తినాము కదా. ఆ గాబూ, దుమ్మూ రొమ్ములో చేరినట్లుంది. ఒకటే దగ్గులూ, తుమ్ములూ. సొంటి కషాయం తాగతా ఉండా" అంటూ రాఘవరెడ్డిని దగ్గరికి పిలిచాడు పెద్దిరెడ్డి.

"రేపు రెండు కూలి మడకలు మాట్లాడు. ఉత్తారెడ్డిని కూలికి పిలువు. మన ఎద్దుల్తో రెండు మడకలు కట్టండి. నాలుగు మడకలతో దుక్కి అయిపోవాల"

"లేదప్పా. నేనొక పనిచేసినా" అని తానూ, జగన్నాథరెడ్డి, ఈడిగ కృష్ణయ్యా చేసుకున్న ఏర్పాట్లు చెప్పాడు.

"నువ్వా రెండు దినాలు ఇంట్లోనే ఉండప్పా. నేను, ఉత్తారెడ్డీ మన రెండు కాండ్లతో రెండు మడకలు కడతాం. జగన్నాథరెడ్డి, ఈడిగ కృష్ణయ్యా రెండు మడకలు కట్టుకొస్తారు. రేపు మన చేను దున్నేది అయిపోతుంది.. చూస్తా ఉండు" అన్నాడు రాఘవరెడ్డి.

పెద్దిరెడ్డికి సంతోషంగా ఉంది. రాఘవుడు తన ఆరోగ్యాన్ని గురించి శ్రద్ధ తీసుకుంటున్నందుకు కాదు. సొంత మనిషిలా చొరవ తీసుకొని మంచి ఏర్పాట్లు చేసుకొచ్చినందుకు.

ఎప్పుడో ఏప్రిల్ నెలలో పడిన వానకు రైతులందరూ చేలన్నీ ఒకసాలు దున్ని పెట్టుకున్నారు. ఇప్పుడు పడిన వానకు నాలుగు రోజుల్లో గ్రామంలోని అందరి చేలూ దున్నడం పూర్తయింది. ఈసారి వర్షం పడితే శెనిగ్గింజలు వేసేయవచ్చు

నాలుగోరోజు రాత్రి ఉత్తారెడ్డి పెద్దిరెడ్డి ఇంట్లో భోంచేస్తున్నాడు. ఉత్తారెడ్డికి భార్యా బిడ్డలు లేరు. ఒక చుట్టిల్లే నివాసం. వారంలో మూడురోజులు పనిచేస్తే నాలుగురోజులు పనిచేయడు. చేసే పనిని శ్రద్ధగా, నైపుణ్యంగా చేస్తాడు. నోరు ఊరికే ఉండదు. ఎప్పుడు వాగుతూనే ఉంటుంది.

"బావా, ఈ పిలగాని ముందర అనగూడదు కానీ, మాంచి పనోడు బావా. మాంచి తెలివిమంతుడు. జీతగాళ్లు ఇట్లుంటారా? నాలుగు చెబితే రెండు చేస్తారు. ఈ పిలగాడు ఒకింత చెబితే రెండింతలు చేస్తాడు. ఈ పిలగాణ్ణి వదలొద్దు. నిన్నిక్కడ కూర్చోబెట్టి నీ సేద్యమంతా ఉప్పున ఊదేస్తాడు. వచ్చే ఏడాది కూడా ఒక పది ఎక్కువైనా ఇచ్చి నీ దగ్గరే నిలుపుకో" అన్నాడు ఉత్తారెడ్డి.

'ఈ మనిషిని మచ్చనాలికోడు అంటారు. మచ్చ నాలికోడు ఏదైనా చెప్పితే తప్పకుండా జరుగుతుందంటారు. నిజంగా జరుగుతుందా?' అనుకుంది సీత.

★ ★ ★

పది గంటల వరకూ పెద్దిరెడ్డి కపిలె తోలుతూ ఉంటే రాఘవరెడ్డి చెరుకు తోటకు నీళ్ళు కడుతూ ఉన్నాడు. చెరుకు కోలె మోసులేసి ఒకటి రెండు గెణుపులు కూడా వేసింది. చెరుకాకులు నవనవలాడుతూ పూర్వకాలపు కత్తుల్లా నిటారుగా నిలబడి ఉన్నాయి.

"రాఘవా! సాయంత్రం మిట్టపల్లి అంగడి రత్నాచారి తమలపాకుల కోసరం వస్తానన్నాడు. నువ్వు ఆకులు కోస్తా ఉండు. అన్నం ఈడికే పంపిస్తా" అని పెద్దిరెడ్డి ఇంటికి పోయాడు. రాఘవరెడ్డి ఆకు తోటలో దూరి ఆకులు కోస్తున్నాడు.

మధ్యాహ్నానికి సీత ఒక పుటికెలో రెండు ముద్దల సంగటి, ఒక గిన్నెలో మాంసంకూర, విస్తరాకూ పెట్టుకొని బావి దగ్గరికొచ్చింది.

"యాడుండావు?" పిలిచింది సీత.

బదులు రాలేదు.

"ఓయ్- నిన్నే- సంగటి తెచ్చినా - యాడుండావు?"

"ఆకు తోటలో ఉండా- ఈడికే రా"

"మాంసం కూర ఆకుతోటలోకి తేకూడదు. ఈడికే రా"

రాఘవరెడ్డి కాలువలో కాళ్ళూ చేతులూ కడుక్కొని "నీళ్ళుండాయా?" అన్నాడు.

"దుత్తలో తెచ్చినా"

సపారులో కూర్చున్నారు. రాఘవరెడ్డి ఒక ముద్ద తినేసి రెండోముద్ద కొంచెం తుంచుకొని ఆకులో పెట్టుకున్నాడు. మాంసం కూర కలిపిన విస్తరిలో పెరుగూ, మజ్జిగా వేసుకోరు. అందువల్ల సీత పెరుగు తేలేదు.

"చాలు" రాఘవరెడ్డి లేవబోయాడు.

సీత రాఘవరెడ్డి భుజంమీద చెయ్యివేసి లేవనీయకుండా అదిమిపట్టింది.

"ఇంకా మిగిలుండాయి తునకలు. ఎవరు తింటారు, మీ యబ్బా? పేరేమం

టివి- ఆc! కృష్ణారెడ్డి- చెరుకు క్రిష్ణారెడ్డి తింటాడా ఈ తునకలు? తిను" అంది.

"ఇంటికెత్తకపో"

"ఆc! నాకదే పని- గమ్మున తిను"

"వద్దంటా ఉంటే..."

"అదేం కుదర్దు" అంటూ ఒక ముక్క తీసి అతని నోటిలో పెట్టబోయింది. రాఘవరెడ్డి ముఖం పక్కకు తిప్పుకున్నాడు. రాఘవుని పెదవుల నుండి చెంపా, చెవి వరకూ అంటుకుంది మసాలా కూర.

"ఛ ఛ మొండి పిశాచి" అంటూ చెంప, చెవి తుడుచుకోవడానికి నీళ్ళ కోసం దుత్త వైపు చేయి చాచాడు.

సీత ఎడమ చేతిలోనికి నీళ్ళు ఒంపుకొని రాఘవరెడ్డి చెంపనూ, చెవినీ రెండుసార్లు కడిగి పైటకొంగుతో తుడిచింది.

"బడాయి చెయ్యకుండా గమ్మున తిను" అంటూ ఒక ముక్క నోటిలో కుక్కింది.

"నువ్వు తిన్నావా?"

"ఊ"

"ఇంకొంచెం తిను"

"ఉహుc.."

"తోడులేకుండా తినేది దొంగతిండి. తోడుగా కొంచెం తిను"

"ఉహు..."

కొంచెం సంగటి తుంచి కూరలో అద్ది సీత తలను తన భుజం మీదికి లాక్కొని గడ్డం పట్టుకొని చేతిలోని ముద్దను నోట్లోకి తోసేశాడు రాఘవరెడ్డి. నోట్లోని ముద్దను మింగుతూ "ఛ.ఛ. మొరటు మొగోడు ఎక్కణ్ణో. ఇట్లైతే అన్నం తేను" అంది సీత.

"నిజంగా తేవా" అంటూ నవ్వాడు.

సీత కూడా నవ్వింది.

ఇద్దరూ నవ్వుకుంటూ, పంతాలుపోతూ, ఒకరికొకరు తినిపించుకుంటూ మిగిలినదంతా తినేశారు.

సీత గిన్నెలు కడుక్కొని వెళ్ళిపోయింది. సీత వెళ్ళిపోయిన తరువాతగానీ రాఘవరెడ్డి ఈ లోకంలోకి రాలేదు. ఒక్కసారి ఈ లోకంలోకి రాగానే రాఘవరెడ్డికి తానెవరో జ్ఞాపకం వచ్చింది.

ఎక్కడికి వెళ్ళిపోతున్నాడు తాను? ఏం చేస్తున్నాడు? ఏమైపోతున్నాడు? తానెవరు? జీతగాడు. జీతగాడు జీతగాడు లాగానే ఉండాలి. మరి తను ఎంతదూరం వెళ్తున్నాడు? యజమాని కూతుర్ని పట్టుకొని భుజంమీదికి ఆనించుకొనే దాకా వెళ్ళాడు. సీత ఎవరు? తన యజమాని కూతురు. ఇల్లూవాకిలీ, మడీచేనూ, పొత్తూ సంబంధమూ ఉన్న పెద్దరైతు కూతురు. తానో? ఇల్లూ వాకిలీ, ఊరు పేరూ లేని అనాథ. ఈ విషయం జ్ఞాపకం పెట్టుకొనే మెలగుతున్నాడా తాను? ఇంత చనువూ, ఇంత ధైర్యమూ ఎలా వచ్చాయి తనకు?

ఎలా ఏమిటి? ఈ చనువూ ధైర్యమూ సీత వల్లనే వచ్చాయి. సీత ప్రవర్తన ఈ మధ్య బాగా మారిపోయింది. పూర్వంలాగా అంటీ ముట్టనట్లు ఉండడం లేదు. రాసుకొని పూసుకొని తిరుగుతూ ఉంది.

### కొత్తగాలి...

**మానవ సహవాస దోషం**
**ప్రకృతికీ అంటుకుంది**
**కరవు కాటు, వరద వేటులతో**
**ప్రతియేటా ప్రకోపిస్తోంది**

*- అంబటి వెంకట శివారెడ్డి,*
*యర్రగుంట్ల*

అరె ఆ పిల్లకు తెలివి లేకపోవచ్చు. తన తెలివి ఏమయింది? అందని మాని పండుకు ఆశించవచ్చునా? అర్హత లేని కోరికలు కోరవచ్చునా?

కాని ఈ రోజు తన ప్రవర్తన కూడా మారిపోయింది. మనస్సు వశం తప్పింది. సీతను తాకాడు. భుజం మీదికి వాల్చుకున్నాడు. ఆ స్పర్శకు పులకించిపోయాడు.

ఓహో! ఇది ప్రమాదకరం. జాగ్రత్తగా ఉండాలి. సీతతో ఒంటరిగా ఉండరాదు. ఖామందు ఖామందే. జీతగాడు జీతగాడే. అతిగా ప్రవర్తించి హద్దులు మీరితే ఈ ఉన్న నీడ కూడా లేకుండాపోతుంది. మళ్ళీ పస్తులు, సంచారమూ, వరండాలలో పడ కలూ, మాసిన జుట్టూ, మాసిన గడ్డమూ, మాసిన బట్టలూ ఏకంగా మాసిన బ్రతుకు. ఛీ.. ఛీ.

మౌనంగా తమలపాకులు కోయడం సాగించాడు. రత్నాచారి వచ్చేటప్పటికి ఇరవై కట్టల ఆకులు సిద్ధమయ్యాయి.



6

ఫ్యాక్టరీలో ప్రేలుళ్ళు జరిగి రెండు నెలలు దాటింది. రైతుల డబ్బులు ఎప్పుడు వస్తాయో అతీగ తీ లేదు. నాయకులకు ఊరికే కూర్చోవడం కష్టంగా ఉంది.

ఫలానా రోజున పీలేరులో ఆఫీసును చుట్టుముట్టాలనీ, స్పెషలాఫీసర్నీ నిలదీయాలనీ, రైతులందరూ ఆరోజు రావాలనీ ప్రచారం చేశారు.

ఆ మేరకు నిర్ణయించుకొన్న రోజున ఉదయం పదిగంటలకు పీలేరు ఫ్యాక్టరీ వ్యవహారాలు చూసే స్పెషల్ ఆఫీసరు ఆఫీసు ముందు జనం పోగయ్యారు. మొదట వందలలో ఉండిన జనం వేల సంఖ్యకు చేరుకున్నారు. నిజమైన రైతుల సంఖ్య కంటే రైతులు కాని బేవార్సుగాళ్ళ సంఖ్యే ఎక్కువ. గోల కూడా వారిదే ఎక్కువ. గొడవలు జరిగేది వారి వల్లనే.

ఆఫీసులో స్పెషల్ తాశిల్దారూ, డిప్టీ తాశిల్దారూ, పూర్వం ఫ్యాక్టరీలో పనిచేస్తూ ఉండిన గుమాస్తాలూ ఉన్నారు. శిథిలాల క్రింది నుండి వెలికి తీసిన రికార్డులతో కుస్తీలు పడుతున్నారు గుమాస్తాలు.

గుమాస్తాలు వ్రాసి సమర్పించుకొన్న రికార్డులు పరిశీలిస్తున్నారు ఆఫీసర్లు. రైతు నాయకులు నేరుగా లోపలికి వెళ్ళి ఆఫీసర్ల కెదురుగా ఉన్న బెంచీలపై కూర్చున్నారు ఠీవిగా. రైతులు కూడా కొందరు లోపలికి వెళ్ళి నిలబడ్డారు. కొందరు గడప దగ్గరా, కిటికీల దగ్గరా నిలబడి చూస్తున్నారు.

"ఏంసార్. ఎంతవరకూ వచ్చింది పని" అడిగాడు ఒక రైతునాయకుడు.

"మా డబ్బులెప్పుడిస్తారు? "

"ఆ పొద్దు కలెక్టరు నమ్మకంగా చెప్పి పోయే. మల్ల ఈ పక్క తిరిగి సూళ్ళే."

రైతులూ, రైతునాయకులూ తలా ఒకర కంగా మాట్లాడడం మొదలు పెట్టారు.

"మమ్మల్నేం చెయ్యమంటారు? ఫ్యాక్టరీ యజమానులకు నోటీసులు పంపినాము. జవాబు లేదు. వాళ్ళొస్తేకదా మీ డబ్బుల సంగతి తేలేది!" అన్నాడు తాశిల్దారు.

"ఇదిగో- దొరికిన రికార్డులు పరిశీలిస్తున్నాం. ఇంకా చూడవలసిన రికార్డు చాలా ఉంది. అంతా గందరగోళంగా ఉంది. రికార్డు సరిగా మెయిన్‌టైన్ చేసుంటే కదా" అన్నాడు డిప్టీ తాశిల్దారు.

"ఈ లెక్కలన్నీ తెలిసిన ఫ్యాక్టరీ గుమాస్తాలిక్కడే ఉండారుకదా" అన్నాడొక రైతు.

"వీళ్ళా! వీళ్ళు అంత సులభంగా దొరికి నారనుకుంటిరా? కలెక్టరు ప్రత్యేకంగా పోలీసుల్ని పంపి పట్టుకొచ్చిందాయె. వీళ్ళు లెక్కలు కరెక్టుగా చెబితే మాకు ఈ కష్ట మెందుకుంటుంది? మీకు ఆలస్యమెందుక వుతుంది? " అన్నాడు డిప్టీ తాశిల్దారు.

తాశిల్దారు "ఊc" అన్నాడు ఊరుకోమ



కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్లై

# రాశి కంటే వాసికే ప్రాధాన్యం

చిత్తూరు సమీపంలోని తలుపులపల్లెలో 1936లో జననం. హైస్కూలు చదువు తర్వాత ఆంధ్రా యూనివర్సిటీనుండి భాషా ప్రవీణ పట్టాపొంది 38 ఏళ్లు జిల్లాలోని ఉన్నత పాఠశాలల్లో తెలుగు పండితుడిగా పనిచేశాను. 'విషాద మాధవి' అనే పద్య కావ్యానికి 'గడియారం' వారి స్మారక పురస్కారం లభించింది. 'ఒక రాఘవ రెడ్డి కథ' పద్యకావ్యానికి కొలకలూరి భాగీరథి పురస్కారం, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ పురస్కారం, ఇంకా అనేక స్థానిక సాహితీ పురస్కారాలూ లభించాయి. పౌరాణిక నవల 'చండాలుడు' పంచమ జాతి గురించిన పరిశోధనాత్మక నవల. ఇంకా అమెరికా తెలుగు అసోసియేషన్ వారిచే రెండు వ్యాసాలకూ, ఒక కథకూ బహుమతులందుకున్నాను. నేను ఇప్పటివరకూ రాసింది మూడు కథలు మాత్రమే. వీటిలో ఒకటి 'విపుల'లోనే ప్రచురితమైంది. ఈ 'మర్రిమాను సాక్షిగా' నవలను 'చతుర'కు ఎంపికచేసిన సంపాదకులకు కృతజ్ఞతలు.


**చిరునామా :**
ఇం. నెం. 2-253, డి-5-ఎ,
సొసైటి కాలని,
మదనపల్లె - 517325
చిత్తూరు జిల్లా


న్నట్లు. కానీ అప్పటికే జరగవలసిన అనర్థం జరిగిపోయింది.

"ఏమయ్యా. మా లెక్కలు చూచి పెట్టే దానికి మీకు అంత బాధగా ఉందా? "

"జీతాలు దొబ్బి తినలే? "

"శెనక్కాయలు తోలినోళ్ళ దగ్గరంతా పదీ, ఇరవై గుంజుకున్నారే? "

గుమస్తాలు గతుక్కుమన్నారు.

"మమ్మల్నేం చెయ్యమంటారు? ఫ్యాక్టరీ కల్ల తొంగి సూడద్దండి అని యజమాన్లు ఫోన్లు చేస్తా ఉండ్రి" అన్నారు వాళ్లు.

"వాళ్ళ బూట్లులు నాకుపోండి- వాళ్ళ... పోండి. ఇప్పుడు ఇక్కడ మిమ్మల్ని పట్టుకొని తంతే ఏ నాకొడుకొచ్చి అడ్డపడతాడు" అంటూ ఒకరిద్దరు రైతులు వాళ్ళ మీదికి లేచారు. తక్కిన రైతులు వాళ్ళను ఆపే ప్రయత్నంలో ఉన్నారు.

తాశిల్దారుకు కాళ్ళూ చేతులూ ఆడలేదు. ఏదో ఘోరం జరిగిపోయేట్లు ఉంది.

"ఆగండాగండి. ఏమిటీ దౌర్జన్యం. ఇది ఆఫీసనుకున్నారా.. సంత అనుకున్నారా? అందరూ బయటికి వెళ్ళండి. పోలీసులూ.. ఎక్కడున్నారయ్యా? వీళ్ళనందర్నీ బయటికి పంపేయండి" అని అరిచాడు తాశిల్దారు.

తాశిల్దారు కేకలు విని లోపల ఏదో జరగరానిది జరిగిపోతూ ఉందని పోలీసులు ఆదరా బాదరా ఆఫీసులోనికి దూరడానికి ప్రయత్నిస్తున్నారు. కాని జనం అడ్డంగా ఉన్నారు. దారి దొరకలేదు.

"పోలీసుల్ని పిలుస్తారా. పిలవండి. మాకు న్యాయం జరిగేవరకూ ఇక్కణ్ణుండి కదిలేది లేదు" ఇంకా ఏవేవో మాటలు గందరగోళంగా వినబడుతూ ఉన్నాయి లోపలినుండి. పోలీసులు లాఠీలతో జనాన్ని పక్కకు నెట్టుకుంటూ లోపలికి పోతున్నారు. ఆ తోపుడులో ఒకరిద్దరు రైతులు క్రింద పడిపోయారు.

"ఎందుకట్ల దొబ్బుతావు" అని ఒకరైతు ఒక పోలీసును నెట్టాడు. ఆ పోలీసు పట్టు తప్పి అదివరకే క్రిందపడున్న రైతుపై

పడ్డాడు. అతని లాఠీ ఆ రైతుకు గట్టిగా తగిలింది.

"కొడతండారు.. లాఠీలతో" క్రిందపడ్డ రైతు అరుస్తూ లేచాడు.

"దొబ్బేయండి పోలీసుల్ని"

"పెరుక్కోండి లాఠీల్ని"

తోపులాట, ఘర్షణ, కేకలు. పోలీసుల లాఠీచార్జీ! కేకలు, అరుపులు, పరుగులు. పరిస్థితి బీభత్సంగా మారిపోయింది.

"భయపడకండి రైతు సోదరులారా- భయపడకండి. లాఠీ దెబ్బలతో రైతు ఉద్యమాన్ని ఎవరూ ఆపలేరు"

"పోలీసు జులుం నశించాలి"

రివ్వు రివ్వుమని రాళ్ళు గాలిలో ఎగురుతున్నాయి. ఎగిరిన రాయి ఎవరిపైనో ఒకరిపైన పడాలికదా? రైతో, పోలీసో.

యస్.ఐ. తన రివాల్వరుతో గాలిలోకి రెండుసార్లు పేల్చాడు. రైతులు చెల్లాచెదరైపోయారు. రైతు నాయకులు మాత్రం కేకలు వేస్తూ రైతులను తిరిగి రమ్మని చేతులూపి పిలుస్తున్నారు.

పోలీసులు నలుగురు రైతు నాయకుల్ని జీపులో వేసుకొని స్టేషన్ వైపు పోయారు. పత్రికల వాళ్ళు ఫోటోలు తీసుకున్నారు.

రైతు నాయకుల కోరిక నెరవేరింది.

మరి రైతుల కోరిక...?

★ ★ ★

ఈ మధ్య బావి దగ్గర మధ్యాహ్నం వరకే పని. మధ్యాహ్నంపైన అగత్యంగా చేయవలసిన పనిలేదు. మొన్న వానలకు బావి దగ్గర సపారు పూర్తిగా పాడైపోయింది. పైన కప్పిన బోద పూర్తిగా కుళ్ళిపోయి దిగబడిపోయింది. ఈరోజో రేపో కూలిపోయే స్థితిలో ఉంది.

ఎర్రంరెడ్డి కొడుకు పుల్లారెడ్డికి పెండ్లి నిశ్చయమయింది. పెండ్లికొడుకు ఇంటిదగ్గరే పెండ్లి. పందిరేయడానికి వాసాలూ, గుంజలూ కావాలి.

రాఘవరెడ్డీ, పుల్లారెడ్డీ, ఎంగిటిగాడూ రెండు బండ్లు కట్టుకొని అడివికి బయలుదేరారు. ఒంపులు లేకుండా సక్కగా, పొడవుగా పెరిగిన రకరకాల కొయ్యలు సన్నపాటివి వాసాలకు కొట్టుకున్నారు. నిలువులకు లావుపాటి కొయ్యలు కొట్టుకున్నారు.

రాఘవరెడ్డి ఎంగిటిగాణ్ణి రెండు దినాలు తనపనిలో పెట్టుకొని పాతసపారు పడదోయించి మునుపటికంటె ఎత్తుగా, వెడల్పుగా, పొడవుగా కొయ్యలు నాటి, భద్రంగా కప్పు వేయించాడు. సపారు అందంగా, విశాలంగా తయారయింది. ఇప్పుడు కపిలెబాన ఇంటికి మోసే పని లేదు. నక్కలకు అందనంత ఎత్తులో తగిలించుకోవచ్చు. ఆ గ్రామాల్లో దొంగల భయంలేదు.

పని తొందరలేనప్పుడు రాఘవరెడ్డి పెద్దిరెడ్డి అనుమతితో పుల్లారెడ్డి పెండ్లిపనుల్లో సహాయం చేస్తున్నాడు. నెరబైలుకు పోయి వడ్లు ఆడించుకొచ్చారు. వస్తూ వస్తూ వడ్డిపల్లెలో సున్నంమూట బండిలో తెచ్చారు.

పెళ్ళిరోజు వచ్చేసింది.

పెళ్ళివాళ్ళు వచ్చేశారు.

వంటపనులు సాగుతున్నాయి. పల్లెలో వంట వాళ్ళను పెట్టే అవసరమే ఉండదు సాధారణంగా. గాడిపొయ్యిల దగ్గర ఓ స్టూలు మీద కూర్చొని మంగమ్మ వంట పని పర్యవేక్షిస్తూ ఉంది. వంట ఎట్ల చెయ్యాలో చెబుతూ ఉంటే కొందరు మగవాళ్ళు, కొందరు ఆడవాళ్లు వంటలు చేస్తున్నారు. కొందరు వడ్డిస్తున్నారు.

ఈ పెండ్లిలో రాఘవరెడ్డి చాలామంది దృష్టిలో పడ్డాడు. కొందరు ప్రత్యేక శ్రద్ధతో అతడి గురించి వివరాలు అడిగి తెలుసుకుంటున్నారు.

రాఘవరెడ్డి ఈ రెండు మూడు నెలల్లో బాగా మారిపోయాడు. కళ్లల్లో ఊపిరి పెట్టుకొని వచ్చినవాడు ఇప్పుడు కాస్త ఒళ్లు చేశాడు. కడుపు నిండా మంచి తిండి, చేతి నిండా పని, కంటినిండా నిద్ర, అన్నింటి

కంటే ముఖ్యంగా "రేపటికి ఎట్లా? " అనే దిగులు లేకపోవడం, వీటన్నిటి వల్ల రాఘవరెడ్డి బాగా తేరుకున్నాడు. రెండు మూడు రోజులకొకసారి షేవింగ్ చేసుకోవడం, ఉన్న రెండు షర్టులూ చెంబిస్త్రీ చేసి వేసుకోవడమూ, రోజూ సబ్బుతో స్నానం చేయడమూ ఒక కొత్త రూపాన్ని సంతరించిపెట్టాయి. ఇంటిలో గానీ, పల్లెలో గానీ ఎవరూ జీతగాడని చులకనగా చూడని ఆదరం అతనికి ఆత్మస్థైర్యాన్ని ఇచ్చింది.

"రాఘవా, రాఘవా అంటా వుండారే- ఎవరా పిలగాడు"

"మనోళ్ల పిలగాడే పెద్దిరెడ్డి ఇంట్లో సేద్యానికి నిలిచినాడు"

"ఏ ఊరు? "

"పీలేరు దగ్గర ఏదో ఊరు? "

"చెరుకోళ్లంట"

"పనిమంతుడుగా కనబడతా ఉండాడు"

"మంచి పనోడే. పెద్దిరెడ్డిని పక్కన పెట్టి సేద్యమంతా సమాళిస్తా ఉండాడు. రెండు కాండ్ల సేద్యం"

"అమ్మా నాయనా, అయినోళ్లు పొయినోళ్లూ..."

"ఎవరూ ఉన్నట్లు లే. కట్టుగుడ్డల్తో వచ్చి పెద్దిరెడ్డి ఇంట్లో సేద్యానికి నిలిచినాడు."

"సొంతూర్లో ఆస్తీపాస్తీ, బూమీబుత్రా.."

"ఏమీ లేనట్లే"

"బూమీబుత్రా లేకుంటే ఏమి? బుద్ధి బాగుండాల. శ్రద్ధగా పనీపాటా చేసుకుంటే లక్షణంగా బతుక్కుంటాడు. భూమి సంపాదించేది ఎంతసేపు"

"ఎవరైనా చెయ్యందిస్తే పైకొస్తాడు"

"చూద్దాం చూద్దాం"

ఇలా సాగింది అతని గురించిన చర్చ

★ ★ ★

ఆకు తోటలో ఎరువు చల్లి నీళ్లు కట్టేటప్పటికి కలుపు మొక్కలూ, గడ్డీ విపరీతంగా మొలుచుకొచ్చాయి. కూలివాళ్ల చేత కలుపు తవ్వి తీయించాడు రెండురోజులు. ఇంకా కొంచెం మిగిలిపోయింది. ఇక కూలి వాళ్ల అవసరం లేదు. ఒక మనిషి సాయంత్రం వరకూ పనిచేస్తే అయిపోతుంది. రాఘవరెడ్డి ఆ పనే చేస్తున్నాడు. పెరికిన కలుపు మొక్కలూ గడ్డీ కంచెకవతల ఉన్న మేక ముందర వేస్తున్నారు.

పది రోజులకు ముందు ఈడిగ కృష్ణయ్య దగ్గర రాఘవరెడ్డి ఒక మేక మరకను పాలికి తీసుకొనే ప్రయత్నంలో ఉండగా పెద్దిరెడ్డి చూచాడు.

"పాలికెందుకు మేపుతావు? సొంతంగా కొనుక్కో. డబ్బులు నేనిస్తా. జీతంలో పట్టుకుంటాలే" అన్నాడు. అలా కొన్న మేక

> **కొత్తగాలి...**
>
> **ధరలతో కటకట**
> **నీళ్ల కోసం కిటకిట**
> **పెట్రోలుతో భగభగ**
> **బతుకింక సలసల**
>
> – జి. విజయశ్రీ,
> శ్రీకాకుళం

అది. లెక్కకు అది రాఘవరెడ్డి మేక. కాని ఇంట్లోని వాళ్లందరూ దానిపట్ల శ్రద్ధ చూపుతారు.

మధ్యాహ్నం సీత అన్నం తెచ్చింది. బావి గట్టున కూర్చొని తింటున్నాడు రాఘవరెడ్డి. సీత అతని పక్కన బాగా ఆనుకొని కూర్చొని వడ్డిస్తూ ఉంది. రాఘవరెడ్డికి ఆమె స్పర్శ ఆనందంగానూ ఉంది. ఆందోళనగానూ ఉంది.

సీత రాఘవుడి భుజంమీద రెండు చేతులూ వేసి అతని చెవి దగ్గర నోరు పెట్టి అంది.

"ఈసారి సంతకు పోయినప్పుడు నాకు

ఒక పౌడర్ డబ్బీ తీసకరా"

"అప్పకు చెప్పు" అన్నాడు సుతారంగా ఆమె చేతులు తొలగించుకొని.

"అప్ప సంతకు పోడు. కూరగాయలు లేవు కదా. సంతకెళ్లేది బుట్టెడు చింత పండూ, తమలపాకులే. నువ్వే పోవల్ల అందుకే నీకు చెప్పేది".

"అప్ప మాట లేనిది నేను తీసకరాను. నాకు చెప్పమని అప్పకు చెప్పు"

సీత రాఘవరెడ్డి అవతలి భుజం పైన రెండు చేతులూ వేసి అతన్ని కుదిపి వేయ సాగింది. సీత రొమ్ము రాఘవరెడ్డి భుజా నికి గట్టిగా ఒత్తుకుంటా ఉంది. రాఘవ రెడ్డికి మతిపోతూ ఉంది. శరీరం వశం తప్పుతూ ఉంది.

"అప్పనే అడగతావో, అమ్మనే అడగ తావో నాకు తెల్దు. నాకు పౌడర్ డబ్బీ కావల్ల. అంతే"

ఆ మాటతో రాఘవరెడ్డి మనస్సుపైన చెర్నాకోలతో కొట్టినట్లయింది. 'అమ్మనే అడగతావో' అనే మాట చెవిన పడగానే 'అబ్బోడా, అబ్బోడా' అని ఎంతో ప్రేమగా పిలిచే జానకమ్మ కళ్ల ముందర మెది లింది. 'రారా.. పోరా' అనకుండా మర్యా దగా 'రాఘవా.. రాఘవా' అని పిలిచే పెద్దిరెడ్డి కళ్లముందు నిలిచాడు. తనకంటే ఎంతో పెద్ద వాళ్లయ్యుండీ తనను రాఘవ రెడ్డీ అని ఆదరంగా పిలిచే ఊరి పెద్దలు కళ్ల ముందర ప్రత్యక్షమయ్యారు..

శరీరంలో వేడి తక్కున దిగిపోయింది.

మెల్లగా సీత చేతుల్ని విడిపించుకొని "ఇదిగో సీతా, నేనెవరో నువ్వెవరో గ్యాపకం చేసుకో. నేను మీ ఇంటికి ఎందు కొస్తినో గ్యాపకం చేసుకో. నువ్వెక్కడ ఉండాల్నో అక్కడుండు. నేనెక్కడుండాల్నో అక్కడ ఉండనీ. నన్ను ఎక్కడా లేకుండా చెయ్యొద్దు. నవ్వుల పాలు చెయ్యొద్దు ఆలో చించుకో" అన్నాడు నచ్చచెబుతున్నట్లు.

సీత ఒక్కక్షణం రాఘవుడి వైపు చూచి రెండు చేతులతో అతణ్ణి నెట్టివేసి చివు క్కున లేచి నిలబడింది.

"నేను ఎక్కడుండాల్నో అది నేను ఎప్పుడో ఆలోచించుకున్నా. ఇక నువ్వే..." అని గిరుక్కున తిరిగి వెళ్లిపోయింది.

రాఘవరెడ్డి అవాక్కైపోయాడు.



**7** ఆ రాత్రి యర్రంరెడ్డి వాళ్లు రాఘవరెడ్డిని భోజనానికి పిలి చారు. కాబట్టి ఇంట్లో పెద్దిరెడ్డీ, జానకమ్మా, సీత ముగ్గురే భోం చేస్తు న్నారు.

"ఆ నడమ ఉదయ మాణిక్యం నుండి వచ్చుండినారు చూడు. కొండ్రెడ్డి, ఆయన భార్యా, కొడుకూ.. గ్యాపకముందా? " అన్నాడు పెద్దిరెడ్డి జానకమ్మతో.

"ఆ! ఆ పిల్లగానికి మిట్టపల్లెలోనో, యాణ్ణో బిడ్డను చూడనొస్తిమని చెప్పిరి వాళ్లేనా? "

"ఆ! వాళ్లొచ్చింది మిట్టపల్లికి కాదంట. మన అమ్మిని చూచే దానికేనంట."

జానకమ్మ, సీత ఆశ్చర్యంతో తినడం మానేసి పెద్దిరెడ్డి వైపు చూచారు.

"నిజంగానా? " అంది జానకమ్మ.

"ఔనంట. మొన్న నెరబైలులో కనబడి నాడు. మేము బిడ్డను చూచినాము. మీరు మా పిలగాణ్ణి చూచినారు కదా. మా ఇంట్లో ఇంకా చూడవలసినోళ్లతో పైవారం మీ ఇంటికి వస్తా ఉండాము అన్నాడు" చె

ప్పాడు పెద్దిరెడ్డి.

"ఎట్టెట్టా! శానా దూరం జరిగిందే కత. ఆ పొద్దు ఎవురో దోవన పొయ్యేటోళ్ళ మాదిరి వచ్చి పొ(యి. ఇంత ఆలోచన పెట్టుకోనుండారా? " అంటూ ముక్కుమీద వేలేసుకుంది జానకమ్మ. సీత మొగం ముడుచుకుంది.

"పిల్లగాడు తొందరజేస్తా వుండాడంట. బిరీన చేసెయ్యాలంట."

"పిలగాడేమో రవంత రంగు తక్కువ. అయినా ఫరవాలేదు. ఏం చేస్తా ఉండా డంట? భూమీ, బు(ట్రా ఎంత మా(త్రం? " జానకమ్మ సాలోచనగా సాగదీసింది.

"పిల్లగాడు రాయచోటిలో ఆర్టీసీ డ్రైవ రుగా ఉండాడంట. నెలకు అయిదు నూర్లు జీతం. ఉదయమాణిక్యంలో మూడంక ణాల పూరిల్లు ఉండిందంట. మొన్న దాని ముందర ఒక పెంకుటిల్లు నిలేసినారంట. నాలుగెకరాల చేనుందంట. మడిసేద్యం తు(ట్రగా లేదంట"

"పిలగాని తోడబుట్టినవాళ్ళు? "

"ఒక అక్క, ఒక చెల్లెలు. వీడొకడే మగ బిడ్డ. పెద్ద పిల్లకు పెండ్లయిపోయిందంట. చిన్నపిల్ల పెండ్లికెదిగిందంట."

"పరవాలే. మడి సేద్యం లేకపోతే మా(త్రం ఏమి? గవర్మెంటుద్యోగం మంచి సంబంధమే. ఎప్పుడొస్తారంట? "

"ఎప్పుడు రమ్మంటే అప్పుడొస్తారు"

సీత తింటూ ఉన్న కంచంలో విసురుగా చేతులు కడిగి కంచం నెట్టేసింది.

"ఏందే. ఏందే అది? తింటా తింటా ఉండే కంచం తోసేస్తాండావు..ఏమయిందే నీకు? " అంది జానకమ్మ ఆదుర్దాగా.

సీత మాట్లాడకుండా లేచి కంచం తీసు కెళ్ళి కుడితి తొట్టిలో కుమ్మరించి లోపలి కొచ్చింది. నడకలో విసురు కొట్టొచ్చినట్లు కనబడుతూ ఉంది.

"ఏందే.. ఏందే ఆ ఇసురు? " అంది జానకమ్మ.

"మీ నెత్తికి అంత బరువుగా ఉంటే నన్ను తీసకపోయి ఆ బాయిలో దొబ్బే యండి. పీడ విరగడైపోతుంది" అంటూ ఆమె మంచంపై బోర్లా పడిపోయింది.

"ఇప్పుడేమంటిమి నిన్ను. రేపే ఇచ్చేస్తా ఉండామా నిన్ను వాళ్ళకు? " అన్నాడు పెద్దిరెడ్డి తన సహజ శాంత స్వరంతో.

"మేయ్. సగంలో లేచిపోయినావు. రా.. రవంత మజ్జిగన్నం తిని పోదువు, రా" అంది జానకమ్మ.

గదిలో నుండీ మనిషీ రాలేదు. మాటా రాలేదు.

"ఏందో, అంతా తిక్కగా ఉంది" అంటూ భోజనం ముగించాడు పెద్దిరెడ్డి.

జానకమ్మ సీత మాటల్లో, చేష్టల్లో అర్థాలు వెదుకుతూ ఉండిపోయింది.

అరుగుల మీద చాపలు వేస్తుండగా సీత బయటికొచ్చి మామూలు ప్రకారం రాఘవరెడ్డి కోసం నీళ్ళ చెంబు మరో అరుగు మీద పెట్టి చాపమీద గోడవార అటువైపు తిరిగి పడుకుంది.

రాఘవరెడ్డి యర్రంరెడ్డి వోళ్ళ ఇంటి నుండి వచ్చేసరికి అందరూ నిద్రపో యారు. అరుగుమీద పడుకున్న పెద్దిరె డ్డినీ, జానకమ్మనూ, సీతనూ ఒక్కక్షణం నిలబడి చూచి నీళ్ళచెంబు పట్టుకొని పశు వుల కొట్టంలోనికి వెళ్ళి మంచం మీద పడుకున్నాడు.

మధ్యాహ్నం జరిగిందంతా మళ్ళీ కళ్ళ ముందు మెదులుతూ ఉంది.

"అబ్బోడా ఇది నీకు న్యాయమేనంట్రా" అంటూ ఉంది జానకమ్మ.

"సాటి కాపోడివనీ, బతికి చెడినవాడివనీ ఇంట్లో చేర్చుకుంటే ఇదేనా నువ్వు మాకు చేసే మేలు" అంటున్నాడు పెద్దిరెడ్డి.

"ఈడికొచ్చిన తొలిరోజున నువ్వెట్లుం టివో, నీ బతుకెట్లుండిందో ఒకసారి తిరిగి సూసుకో. అన్నంపెట్టిన చేతినే కరు స్తావా? (ద్రోహీ!" అంటున్నారు ఈడిగ

కృష్ణయ్యా, ఆంజనేయాచారీ, ఉత్తారెడ్డీ ఎదురుగా నిలబడి.

జగన్నాథరెడ్డీ, పుల్లారెడ్డీ పగలబడి నవ్వుతున్నారు.

రాఘవరెడ్డి ఉలిక్కిపడి లేచాడు. చెంబులోని నీళ్ళు తాగి తల విదిలించుకొని మళ్ళీ పడుకున్నాడు. విదిలించుకుంటే తల్లోని ఆలోచనలు రాలిపోతాయా?

★ ★ ★

మీద మీద నాలుగైదుసార్లు వానలు పడ్డాయి. చెరువు ముక్కాలు భాగంపైగా నిండింది. కొండలూ, అడవీ దగ్గర్లో ఉండడంవల్ల ఆ ప్రాంతంలో వానలు బాగానే కురుస్తాయి. చెరువు పూర్తిగా నిండుతుందనే ఆశ వుంది. చెరువు క్రింద ఆయకట్టు మొత్తం వరిమళ్ళు సాగించవచ్చు. చెరువు నిండకపోయినా ఇప్పుడున్న నీటితోనే ఒక కారు పండిపోతుంది. చెరువునిండి మొరవ పారిందంటే ఇరుకారు పంటకు భయం లేదు.

వరి నారు ఎగబడి వచ్చేసింది. మళ్ళు దున్ని పచ్చిఆకు తొక్కి ముగ్గ బెట్టుకోవాల. పశువుల ఎరువు కూడ వేసి సిద్ధం చేసుకోవాల. ఇక ప్రతిరోజూ చేతినిండా పనే. రోజూ ఇద్దరో ముగ్గురో కూలివాళ్ళను కూడా మట్లాడి పెట్టుకోవాల.

పెద్దిరెడ్డికి వానలో తడిసి జలుబు చేసింది. జలుబు ముదిరి జ్వరంలోకి మళ్ళింది. నెరబైలుకు ఒకరోజు వెళ్ళి సూది వేయించుకొని మాత్రలు తెచ్చుకున్నాడు. రోజూ మాత్రలు తింటున్నాడు. ఇది చాలదన్నట్లు కచ్చాకు బుచ్చాకు కషాయం పెట్టిస్తూ ఉంది జానకమ్మ. ఎవరూ అతనిని ఇల్లు కదలనివ్వడంలేదు.

"మంచి పని మునంలో పండుకుంటినే. పిలగాని మీద పడింది పనంతా. ఎట్లా సమాళిస్తాడో, ఏమిచేస్తాడో" అంటూ ఆందోళన పడుతున్నాడు పెద్దిరెడ్డి.

"నువ్వా ఆలోశనేం పెట్టుకోవద్దు. నేను చెప్పి చేయించుకుంటాన్లే. ముందు నీ ఒళ్ళు బాగ్గానీ" అంది జానకమ్మ.

"అక్కా, రేపు అడివికిపోయి ఆకు కొట్టుకోని రావాల. తెల్లారకముందే బండి కట్టాల. ఆయాళకంతా అన్నం కట్టిచ్చెయ్" అన్నాడు రాఘవరెడ్డి.

"ఎవరెవరు పోతాఉండారు? "

"జగన్నాథుడూ, ఇరగంరెడ్డీ బండ్లు కట్టుకొని వస్తా ఉండారు, కూలోళ్ళను పిలుచుకొని. నాకు తోడుగా ఎంగిటిగాణ్ణి పిలచకపోతావుండా"

తొలికోడి కూయంగానే బండ్లు కట్టారు. జానకమ్మా, సీతా ఇద్దరు మనుషులకు సరిపడ అన్నమూ, శెనిగ్గింజల ఊరిబిండీ, గట్టిగా చింతాకు పప్పు చేసి విస్తరాకులలో పెట్టి మూటకట్టి ఇచ్చారు.

భళ్ళున తెల్లవారేసరికి మూడు బండ్లూ అడవిలోనికి వెళ్ళిపోయాయి. ఒక సన్నని వాగు ప్రక్కన బండ్లు నిలిపి ఎడ్ల పగ్గాలను తీండ్ర తీగలకు కట్టేసి ఆకు కొట్టడం ప్రారంభించారు.

అడవిలో ఎడ్లకు తినేంతా గడ్డి. కూలివాళ్ళు ముగ్గురూ కాస్త దూరంగా వెళ్ళారు. "రాఘవన్నా, గంటసాల పాటల పుస్తకం తెచ్చుకుంటివే. ఏదీ ఒక పాట పాడు" అన్నాడు ఇరగంరెడ్డి.

వాతావరణం ఆహ్లాదంగా ఉంది. రాఘవరెడ్డికీ పాడాలనే ఉత్సాహం కలిగింది.

## కొత్తగాలి...

**అడపిల్ల**
**గుండెల మీద**
**కుంపటి కానే కాదు..**
**తండ్రి గుండె చప్పుడు**

– ఎన్.కె. నాగేశ్వరరావు,
పెనుగొండ

'జగమే మారినదీ... మధురముగా ఈవేళా' అనే పాట అందుకున్నాడు.

నిశ్శబ్దమైన అడవి వాతావరణంలో ఆకు కొమ్మలు నరికే లయబద్ధమైన చప్పుళ్లతో పాట చాలా బాగా సాగిపోయింది. పాట అయిపోగానే ఇరగంరెడ్డి-

"రాఘవన్న బ్రతుకే మారినదీ- మధుర ముగా ఈవేళ" అని రాఘవరెడ్డిని అనుక రిస్తూ పాట అందుకున్నాడు.

"ఏందిరా రాఘవరెడ్డి బతుకే మారిం దంటూండావు. ఆ చెట్టుకింద మూటేమైనా దొరికిందా? " అన్నాడు జగన్నాథరెడ్డి

"మూటేంది మూట, ఇంకా పెద్దదే దొరకతావుంది" అన్నాడు ఇరగంరెడ్డి.

ఇరగంరెడ్డి పాటలోని భావం రాఘవ రెడ్డికి చూచాయగా అర్థమైపోయింది. కొంచెం భయం కూడా కలిగింది.

"చాల్లే గమ్మునుండు" అని కసురుకు న్నాడు ఇరగంరెడ్డిని.

"ఏందిరా కథ ఇరగా? " జగన్నాథరెడ్డి పట్టు పట్టాడు.

"ఏందీ లేదులే. వాడొక ఓటి నోరోడు" అన్నాడు రాఘవుడు.

"ఏమీ లేదంటే ఏదో ఉన్నట్లే! నువ్వే చెప్పు. ఏంది ఇరగడు చెప్తా ఉండేది"

"ఏమీ లేదంటా ఉండ్లా. ఏముంది చెప్పే దానికి" అన్నాడు రాఘవుడు.

"నేం జెప్తా ఉండన్నా. ఉండే మాట చెప్పేదానికి భయమెందుకు? పెద్దిరెడ్డి ఇంటికి ఉదయ మాణిక్యం నుండి ఎవరో పిల్లను అడగటానికి వచ్చినారంట, సీత ఒప్పుకోలేదంట. నేను ఈ ఇల్లూ, ఊరూ ఇడిసిపెట్టి పోను అనిందంట"

"రాఘవుని కథ చెప్తానని సీత కథ చెప్తా వుండావేందిరా? "

"ఆ సీత కథే ఈ రాఘవన్న కథ. సీత రాఘవన్నను ఇష్టపడతా వుండాదని ఆడాడా అనుకుంటా వుండారు మనూర్లో"

రాఘవుని గుండె గుభిల్లుమంది. ఒక ప్రక్క భయంగా ఉంది. మరోప్రక్క కుతూహలంగా కూడా ఉంది. 'ఈ విషయంపైన ఊరివాళ్ళ అభిప్రాయం ఏమిటి? సమర్థిస్తున్నారా, వ్యతిరేకిస్తున్నారా? ఒకవేళ వ్యతిరేకించినట్లయితే తనను ఊరి నుండి సాగనంపరు కదా? '

"అంతా ఒట్టిది. ఊర్లో ఎవరూ అనుకో లేదు" అన్నాడు పైకి బింకంగా.

జగన్నాథరెడ్డి కాసేపు మౌనంగా ఉండి తర్వాత ఇలా అన్నాడు-

"ఐదారు రోజులకు ముందు జానకత్త మా అమ్మ దగ్గరికొచ్చి 'చూడొదినా ఉద యమాణిక్యం పిల్లగాడు ఆర్టీసీ డ్రైవరంట. నెలకు అయిదు నూర్లో, ఆరు నూర్లో వస్తుందంట. సీతను అడగతా ఉండారు. ఆ మాటెత్తితే అమ్మి అగ్గైపోతావుంది. మీ నెత్తికి బరువుగా ఉంటే నన్ను ఆ బాయిలో దొబ్బేయండి. ఈ ఇల్లూ ఈ వూరూ ఇడిసి యాడికీ పోను అంటా వుంది. మంచి సంబంధం మల్లామల్లా వస్తుందా? ఎట్ల చేసేది వదినా? ' అని అంగలార్చిందంట.

అందుకు మాఅమ్మ 'ఆ పిల్ల ఈ ఊరూ, ఈ ఇల్లూ ఇడిసి పెట్టనంటే ఇల్లటం ఉండే వాణ్ణి చేసుకోవాలనుకుంటా ఉందేమో' అనిందంట. జానకత్త 'డ్రైవరు పనిచేసే టోణ్ణి ఇల్లటం ఉండమంటే ఉంటాడా? ఇక్కడే ఉండి సేద్యం చేసుకోమంటే చేసు కుంటాడా? ఈ పిల్ల మనసులో ఏముందో ఏమో తెలియడం లేదొదినా' అంటూ వెళ్ళి పోయిందంట. మా అమ్మ ఇదంతా నాకు చెప్పి, 'ఆపిల్ల రాఘవరెడ్డిని చేసుకోని ఇల్లటం పెట్టుకోవాలనుందేమోరా అంది" అన్నాడు జగన్నాథరెడ్డి.

"ఛ.ఛ. ఏం మాటలులే. నేనేడ? ఆ పిల్లేడ? ఇల్లూ వాకిలీ, ఊరూ పేరూ లేని వాణ్ణి నేను. కాళ్లూచేతులూ తప్పితే నాది అనేది ఏముంది నా దగ్గర? నన్నెందుకు ఇష్టపడుతుంది" అన్నాడు రాఘవరెడ్డి జాగ్రత్త పడుతూ.

"ఆడపిల్ల ఇష్టపడ్డానికి అవన్నీ అక్కర్లే. ఈ మనిషైతే నన్ను ప్రేమగా చూచుకుంటాడు, భద్రంగా సాక్కుంటాడు అనే ధైర్యం కుదిరితే సాలు. ఆ రెండు లక్షణాలూ నీ దగ్గర ఉండాయి. ఇన్ని నెలలుగా నీ గుణమూ, నడవడికా చూచింది. అంతమాత్రం చాలదా" అన్నాడు జగన్నాథరెడ్డి.

"అయితే మాత్రం? ఆ పిల్లకు బుద్ధి లేక పోతే పెద్దోళ్ళకు బుద్ధి లేదా. పోయిపోయి జీతగానికి- ఎంత సరికులస్థుడైతే మాత్రం- బిడ్డనిచ్చేస్తారా. కడాన అందరూ నన్నంటారు. వీడే ఏదో మాయమాటలు చెప్పి ఆ పిల్లను వల్లో వేసుకున్నాడని"

"ఎవరూ అనుకోరు. సాటి కాపోనివి. భాస్కరన్న అమ్మకు దూరపు సుట్టానివంట. మంచి పనిమంతుడివి. నలుగురి చేత మంచోడు అనిపించుకున్నోడివి. నీకు బిడ్డనిచ్చే దానికేమి? మా ఇంట్లోనే గనక ఒక ఆడబిడ్డుంటే లక్షణంగా నీకిచ్చి చేసుందును" అన్నాడు జగన్నాథరెడ్డి.

రాఘవరెడ్డి ఆకు మోపులు కట్టుతూ ఉండినవాడు లేచి నిలబడి జగన్నాథరెడ్డి వైపు ఒకక్షణం చూచి అతని భుజాలపైన చేతులేసి చిరునవ్వు నవ్వి "నీకిట్లాంటి బుద్ధి పుడుతుందనే దేవుడు మీ ఇంటిలో ఆడబిడ్డను పుట్టించలేదు" అన్నాడు.

"అన్నా, అన్నా. ఇస్-ఇస్. అదిగో అక్కడ ఎవురో పోతావుండారు సూడు" అన్నాడు గుసగుసగా ఇరగంరెడ్డి.

ముగ్గురూ నిలబడి చూచారు. చట్టమైన చెట్ల చాటున సరిగా కనబడలేదు గానీ మొత్తం పదిమందికి పైనే కొత్తవాళ్ళు నడుస్తూ వెళ్తున్నారు నిశ్శబ్దంగా. మరుక్షణంలో చెట్లమరుగున మాయమయ్యారు.

"ఇర్లోళ్ళు దొంగసారాయి కాంచతా ఉంటారు ఈ అడివిలో. వాళ్ళేనేమో!" అన్నాడు జగన్నాథరెడ్డి.

"ఇర్లోళ్ళకు చొక్కాలూ, ప్యాంట్లూ ఉండవు. వీళ్ళు ఒకే రకం డ్రస్సు వేసుకోనుండారు. తలలకు ఎర్రగుడ్డలు కట్టుకోనుండారు. భుజాల మీద తుపాకులుండాయి" అన్నాడు ఇరగంరెడ్డి.

"అవునవును. వీళ్ళు ఇర్లోళ్లు కాదు. అడివిలోకి వేటకొచ్చినోళ్ళో, ఫారెస్టోళ్ళో అయి ఉంటారు" అన్నాడు జగన్నాథరెడ్డి.

"ఎవరైతే మనకెందుకులే. పొద్దుపోతా ఉంది. మోపులు బిగించండి" తొందరపెట్టాడు రాఘవరెడ్డి. ప్రొద్దు నాలుగ్గంటల వుతూ ఉండగా అన్నం మూటల్లో మిగిలిన అన్నం తిని బండ్లు కట్టారు. తిరుగు ముఖం పట్టారు. ఊరి ముందరికి వచ్చేటప్పటికి ఎత్తుడు బండలూ, చేదబావీ, దద్దళమూ కనబడ్డాయి. బండ్లు నిలిపారు. ఇరగంరెడ్డి నీళ్ళు చేదిపోస్తూ ఉండగా, అందరూ కాళ్లూ, ముఖమూ కడుక్కొని నీళ్ళు తాగారు. కూలివాళ్ళు ఇండ్లకు వెళ్ళిపోయారు. ఆకు బండ్లు వారి వారి బావుల దగ్గరికి వెళ్ళిపోయాయి.



**8**

**పొ**ద్దు మొలిచి రెండుగంటలైంది.

ఆంజనేయాచారి స్నానం చేసి నొసట వీబూది పట్టెలు తీర్చుకొని, పంచె మోకాళ్ల దాకా గోచీ పెట్టి కట్టుకొని, జందెంతో వీపు గోక్కుంటూ వచ్చి కొలిమి అంటించాడు. అప్పటికే కొందరు రైతులు మడకకార్లూ, కొడవండ్లూ ఇతర సేద్యపు పనిముట్లూ తెచ్చి కూర్చుని ఉన్నారు. పనీపాటా లేని

ముసలివాళ్ళు కొలిమికి కాస్త దూరంగా చెట్లకింద బండల మీదా, చెట్లవేర్ల మీదా కొలువుతీరి ఉన్నారు. వాళ్ళలో ఉత్తారెడ్డి తప్పక ఉంటాడు. పల్లెలలో కొలిమి చర్చా వేదిక కూడా.

ఉత్తారెడ్డి మిట్టపల్లెలోని అంగనవాడీ టీచరమ్మను గురించిన అనేక వివరాలను చిలువలు పలువలుగా చెబుతుంటే అందరూ ఆసక్తిగా వింటున్నారు.

"ఉండు, ఉండు. ఏదో శబ్దం ఇనపడతా ఉండాది" చెట్టుకింద బండమీద కూర్చొని బీడీ పొగ గుప్పు గుప్పున వదుల్తున్న మునసామి గట్టిగా అన్నాడు. అందరూ నిశ్శబ్దంగా అటువైపు చూచారు.

## కొత్తగాలి...

**మెడలో ఎన్ని**
**పూల దండలు పడినా**
**హృదయాన్ని చేరే**
**పువ్వు ఒకటేగా!**

– కె. ఎన్నార్ నమ్మి,
మార్టేరు

నూనెగానుగ 'గీ' శబ్దానికి అపశ్రుతిగా ఏదో మోటారు శబ్దం వినబడుతూ ఉంది. క్రమంగా దగ్గరౌతూ ఉంది.

"కారో, జీపో వస్తా ఉంది. మాలపల్లి దగ్గర నిలిచినట్లుంది"

"మల్లా ఎలబారింది. మనూరికల్లనే వస్తా ఉండేట్లుంది"

"కారులోగానీ, జీపులోగానీ మనూరికి వచ్చేవాళ్ళెవరబ్బా? ఇప్పుడేమీ ఎలక్షన్లు కూడా లేవే!"

"జీపు రానే వచ్చింది. ముందరిసీట్లో ఇద్దరూ, లోపల నలుగురూ పోలీసులు న్నారు. జీపు కొలిమి దగ్గర మట్టిరోడ్డుపైన ఓ క్షణం ఆగింది. ముందరిసీటులో ఉన్న యస్సై లాఠీ ఝళిపిస్తూ, "ఏయ్ అందరూ రచ్చబండ దగ్గరికి వచ్చేయండి, బిరీన" అంటూండగానే జీపు ఊళ్లోకి పోయింది.

కొన్ని క్షణాలవరకూ ఎవరి నోటా మాట రాలేదు. ఇంతమంది పోలీసులు ఇంత ఆర్భాటంగా తమ ఊళ్ళోకి ఎప్పుడూ వచ్చిందిలేదు. తమ ఊళ్ళో ఒక దొంగత నంగానీ, ఒక పోట్లాటగానీ జరిగిందిలేదు. ఊళ్ళో ఎవరూ దొంగసారాయి కాచేవాళ్ళు లేరు. మరి పోలీసులు ఎందుకొచ్చినట్లు?

ఎక్కడివక్కడ వదిలేసి అందరూ లేచారు. క్రింద వేసుకొని కూర్చొని వుండిన తువ్వాళ్ళు విదిలించి తలలకు చుట్టుకొని రచ్చబండ దగ్గరకి నడిచారు.

జీపు దుమ్ము రేపుకుంటూ రయ్యిమని రచ్చబండ పక్కకు వెళ్ళి ఆగింది. జీపు వేగానికి దూడలు బెదిరి ఇండ్లవైపు పారి పోయాయి. కుక్కలు దూరంగా వెళ్ళి అక్కడే నిలబడి జీపువైపు చూస్తూ మొరు గుతున్నాయి. ఆడుకుంటున్న పిల్లలు ఒక్క పరుగున వాళ్ళవాళ్ళ ఇండ్ల గడపల వద్దకు వెళ్లిపోయారు. పది పండ్రెండేండ్ల వయసు పిల్లలు మాత్రం కుతూహలం కొద్దీ జీపు దగ్గరికి వచ్చి కాస్త దూరంగా నిలబడ్డారు.

యస్సై వాళ్ళను చూచి "రేయ్ అందరి ఇండ్లకూ వెళ్ళి పోలీసోళ్ళు వచ్చినారు. ఊళ్ళో మొగాళ్ళంతా రచ్చబండ కాడికి రావల్లంట అని చెప్పండి. ఇంటింటికాడ చెప్పండి" అన్నాడు లాఠీఊపుతూ. పిల్లలు నలువైపులా పరుగెత్తారు చెప్పడానికి.

పోలీసులు కూడా నాలుగువైపులా వీధు లలోనికి వెళ్ళి "మొగోళ్ళంతా రచ్చబండ దగ్గరికి వచ్చేయండి" అని కేకలు వేశారు.

ఈ హడావుడి అంతా పెద్దిరెడ్డి ఇంటికి కనబడుతూ ఉంది. అంత మంది పోలీ సుల్ని చూడగానే పెద్దిరెడ్డి గుండె గుబేలు మంది ఎవరి కొంపలో ఏం మూడిందో, ఏ కొంపమీద గూబ కూర్చుందో అని. అంత లోనే కర్తవ్యం గుర్తుకొచ్చింది. ఆ ఊళ్లో

తాను ఒక పెద్దరైతు. పోలీసుల్ని పలకరించాలి. వాళ్ళకు మర్యాదలు చేయాలి.

గబగబా ట్రంకు పెట్టెలోనుండి షర్టు తీసి తొడుక్కోని, పంచె పాదాల వరకు దిగవిడిచి ఒక పిల్లవాడిచేత ఒక చాప, రెండు జమఖానాలు ఎత్తించుకొని రచ్చబండ చేరుకున్నాడు. దూరంనుండే రెండు చేతులూ జోడించి "నమస్కారం సార్ .. నమస్కారం" అంటూ పోలీసులకందరికీ ఉమ్మడిగా నమస్కారం చేస్తూ రచ్చబండ మీద చాపా జమఖానా పరిపించి "కూర్చోండి సార్.. కూర్చోండి" అన్నాడు.

జీపులో ముందరి సీటులో కూర్చొని వచ్చిన ఇద్దరూ రచ్చబండ మీద చాపపైనా జమాఖానాపైనా కూర్చున్నారు. నలుగురు పోలీసులు క్రింద నిలబడ్డారు.

"పెద్దాయనా! నువ్వా ఇట్లొచ్చి కూర్చో నీపేరేమంటివి? " అన్నాడు యస్సై.

"నా పేరు పెద్దిరెడ్డి సార్. నేనిక్కడ నిలబడతాలెండి" అన్నాడు పెద్దిరెడ్డి.

"ఫరవాలేదు రావయ్యా. పెద్దాయనవు. నువ్వు నిలబడేది బాగలే. వచ్చి కూర్చో"

పెద్దిరెడ్డి రచ్చబండపైకెక్కి కూర్చున్నాడు. ఒక పిల్లవాణ్ణి పిలిచి "భాస్కరెడ్డింటికి పోయి పోలీసులొచ్చినారు అని చెప్పి పెద్ద చెంబులో కాఫీ పోయించుకురా. గ్లాసులు కూడా ఎత్తకరా" అని పంపాడు.

"ఏంది పెద్దాయనా.. ఎట్లా ఉండాయి సేద్యాలు? " మాటలు కలిపాడు యస్సై.

"ఏదో అట్లా ఉండాయి సార్. దేవుని ధర్మాన వానలు బాగానే పడినాయి. అందరూ శెనిగ్గింజ లేసేసిరి. ఇంగ గుంటకలు తోలల్ల, కలుపు తొవ్వల్ల. మళ్ళ కూడా నాటేస్తిమి".

ఈడిగ కృష్ణయ్య కొలిమి దగ్గర్నుండి నేరుగా ఇంటికెళ్ళాడు. భార్యను పిలిచి రహస్యంగా "మొన్న సంతలో దొరికిందని నీచేతికిస్తినే బంగారు గొలుసు, దాన్ని ఇట్లా ఎత్తకరా" అన్నాడు. ఆమె ఇచ్చింది. పొయ్యిలోని నిప్పులూ, బూడిద అంతా బయటికి తోసేసి పొయ్యి మధ్య చిన్న గొయ్యి తీసి గొలుసు అందులో జారవిడిచి పైన తడిమన్ను వేసి ఆపైన యథాప్రకారం నిప్పులూ, బూడిదా తోసేశాడు.

"పోలీసోళ్ళు అడిగితే నాకేమీ తెల్దు అని గట్టిగా చెప్పు. ఇద్దరమూ ఒకే మాట మీద ఉండల్ల.." అని జాగ్రత్తలు చెప్పి రచ్చబండ దగ్గరికి వచ్చేశాడు.

మునిరాముడు దొంతిలో దాచుకున్న దొంగ సారాసీసాలు యూరియా సంచిలో వేసి జలదారి గుంతలోవేసి లోపలికి తొక్కేసి వచ్చాడు.

జగన్నాథరెడ్డి నోట్లో తేమలేదు. మొన్న నెరబైలు సంతలో టీ అంగడి దగ్గర ఒక సాయిబుతో గొడవ పడ్డాడు. సాయిబుకు రెండు పండ్లు విరిగిపోయాయి. 'వాడేమైనా పోలీసు కంప్లెయింట్ ఇచ్చాడేమో వీళ్ళు నాకోసం రాలేదు కదా!' అనుకుంటూ రచ్చబండ దగ్గరికి వచ్చాడు.

అందరూ రచ్చబండ దగ్గర చేరుకోవడానికి అర్ధగంట పట్టింది.

భాస్కరరెడ్డి కాఫీలు పట్టించుకొచ్చాడు.

"నా పేరు భాస్కరరెడ్డి సార్. నా తమ్ముడు సుబ్రమణ్యంరెడ్డి, హైదరాబాద్‌లో కాలేజీ లెక్చరర్. తిరుపతిలో ఆరేండ్లు చదివినాడు సార్" అని చెప్పుకున్నాడు.

యస్సై అతన్ని బండపైకి రమ్మన్నాడు.

ఊళ్ళోవాళ్ళు దాదాపు ఇరవైమంది వచ్చి రచ్చబండ ముందర నేలపైన కూర్చున్నారు. ఆడవాళ్ళు రచ్చబండకు వెనుకవైపు కాస్త దూరంగా నిలబడ్డారు. హరిజనవాడ నుండి ఐదారుమంది వచ్చి దూరంగా గోడల కానుకొని నిలబడ్డారు.

"అన్నిండ్లోళ్లు వచ్చినట్లేనా? ఇంకా ఎవరైనా రావలసిన వాళ్ళుండారా? అందరూ రావల్ల.." అన్నాడు యస్సై.

"ఊళ్ళో ఉండేటోళ్ళంతా వచ్చినారు సార్" అన్నాడు ఉత్తారెడ్డి.

## ఇప్పుడు ఎందుకు?



మరణదండన కోసం సోక్రటీసు ఎదురు చూస్తున్నాడు. స్టైపికోరాస్ రాసిన గీతాన్ని పక్క గదిలోని ఖైదీ ఆలపించడం విన్నాడు. ఆ పాటను నేర్పించమని ఆ ఖైదీని వేడుకున్నాడు. 'ఇప్పుడు నీకెందుకిది?' అని ప్రశ్నించాడతడు.

'ఏముంది- చనిపోయే ముందు ఓ కొత్త విషయాన్ని నేర్చుకున్నానన్న తృప్తికోసం!' అన్నాడు సోక్రటీసు. ఇది విన్న శిష్యుడు గురువుగారిని, 'చనిపోయే ముందు కొత్త విషయమెందుకు నేర్చుకోవాలి?' అన్నాడు.

'చనిపోవడానికి యాభైఏళ్ల ముందు మీరు ఎందుకు నేర్చుకుంటారో.. చనిపోవడానికి ముందు నేనూ అందుకే నేర్చుకుంటున్నాను' అన్నాడు సోక్రటీసు.

యస్సై మాట్లాడడం ప్రారంభించాడు.

"సరే. నేను చెప్పేది బాగా వినండి. మనదేశానికి ఇప్పుడొక ఉపద్రవమొచ్చి పడింది. పనీపాటలు లేని పిల్లకాయలు కొందరు చేరి సంఘాలు ఏర్పాటు చేసుకున్నారు. రాడికల్స్, పీపుల్స్‌వార్ గ్రూప్, నక్సలైటు ఇట్లా శానా పేర్లుండాయి. వీళ్ళకు అడ్డూఅదుపూ లేదు, పెద్దా చిన్నా లేదు, న్యాయమూ చట్టమూ లేదు. షావుకార్లను చంపుతామని బెదిరించేది. డబ్బులు పెరుక్కొనేది. ఆ డబ్బుల్తో తుపాకులూ, పిస్తోళ్లూ కొనుక్కొనేది. పెద్ద మనుష్యులూ, భూస్వాములనూ, ఫ్యాక్టరీ యజమానుల్ని చంపేసేది. ఇదీ వీళ్లపని. వీళ్ళు పోలీసులకు దొరక్కుండా అడవులు చేరిపోయినారు. మారువేషాలతో టౌనుల్లో తిరుగుతా వుంటారు. సమాచారాలు తెలుసుకుంటారు. సమయం చూచి ఏదో ఘోరం చేసేస్తారు".

"అవునవును ఆరేండ్లముందు నెరబైలులో బొట్టయ్య శెట్టిని ఊరిముందర చింత చెట్టుకు ఉరితీసి చంపింది వీళ్ళేనంటకదా" అన్నారు ఉత్తారెడ్డి.

"ఆఁ! అవును. పాపం ఆ దెబ్బతో ఆయన కొడుకులు ఉండేదంతా అయినకాడికి అమ్ముకొని బెంగుళూరు చేరిపోయిరి. అంతేనా. పట్టాభిరెడ్డి- ఈ పాయికట్టులో అందరికీ తెలిసినోడు"

"అయ్యో. ఎందుకు తెలియదూ. పెద్ద కాంట్రాక్టరు. ఎర్రావారి పాళేనికి, మా ఊరికీ రోడ్డు వేయించింది ఆయనే కదా. రోడ్డు ఎట్లుండేది మీరే చూస్తిరి కదా" అన్నాడు యర్రంరెడ్డి.

యస్సై చెప్పుకుంటూ పోతున్నాడు.

"ఆయనకు ఎంత పేరు! ఎమ్మెల్యేలుగాని, యంపీలుగాని, మంత్రులుగానీ ఆయనకు తెలియనిదెవరు? ఎంతపనైనా గానీ హైదరాబాదులో చిటికెలో చేసుకొస్తా ఉండె. ఆ పెద్ద మనిషిది యాభై ఎకరాల మామిడితోట రెయ్యికి రెయ్యి నరికిపారేసిరి- లేత చెట్లు. కాపుకొచ్చి రెండేండ్లయింది అంతే. కాసే పూసే పచ్చని చెట్టును నరకొచ్చునా. వీళ్లకు పాపం పుణ్యాం ఏమైనా ఉందా?"

"కోపతాపాలుంటే మనుషుల మీద చూపించుకోవల్ల గానీ చెట్లను నరికేస్తారా. ఒక చెట్టు నరికితే నూరుమందిని నరికినంత పాపం" అన్నాడు పెద్దిరెడ్డి.

"అవునా! పాపం హాజీమస్తాన్ సాబ్- అరవై డెబ్బై ఏండ్ల పెద్దాయన. మక్కాకు పోయొచ్చిన భక్తుడు. సాయిబులకంతా ఆయనంటే ఎంతభక్తీ, గౌరవమూ! అట్లాంటి పెద్ద మనిషిని ఆయన ఇంట్లోనే, ఆయన కొడుకుల ముందరే రెండు చేతులూ మోచేతులకాడికి నరికేసిరి కొడవండ్లతో" అన్నాడు యస్సై.

"అవును. పాపం... తినేదానికీ, ముడ్డీ మూతీ కడుక్కొనే దానికీ చేతులు లేక పోయె. కొడుకులూ, కోడండ్లూ సరిగా సూడకపోయిరి. నరికిన చేతులకు వైద్యం సరిగా చేయించక గాయాలు మానకుండా చీమూ నెత్తురూ కారబట్టె. గోరిచి, గోరిచి మూణ్ణెల్లకు చచ్చిపోయే. గోరమైన సావు సచ్చిపోయె. పాపం" అన్నాడు ఆదెప్ప.

ఆయనా, ఈయనా సమవయస్కులు, స్నేహితులు. ఆరునెలలకో, సంవత్సరానికో ఒకసారి నెరబైలు సంతలోగానీ, భాకరాపే టలోగానీ కలుసుకొనేవాళ్ళు.

"ఇంకా వినండి ఒక్క ఘోరమా ఈ నక్స లైట్లు చేసేది.." కొనసాగించాడు యస్సై.

"ఆ సత్తిరాజు అనే పెద్దమనిషి ఎక్కడో గుంటూరు నుండి వచ్చి పీలేరు దగ్గర దిక్కులేని పిల్లలకు అనాథాశ్రమం పెట్టె. దిక్కులేని ముసలోళ్ళకు వృద్ధాశ్రమం కట్టి అనాథాశ్రమంలో పెరిగిన ఆడపిల్లలకు పెండ్లిండ్లు చేయించే. అట్టాంటి ధర్మా త్ముణ్ణి కూడా విడిచిపెట్టలేదు ఈ పాపిష్టి నక్సలైట్లు. ఆ బిల్డింగుల్లో ఉండే పిల్లో ళ్ళనూ, ముసిలోళ్ళనూ బయటికి తరిమేసి బిల్డింగుల్ని డైనమెట్లు పెట్టి కూల్చేసిరి. అంతంత పెద్ద బిల్డింగులు నామరూపాలు లేకుండా కుప్పకూలిపోయే. పాపం సత్తి రాజు అంతా వదులుకొని గుంటూరు చేరి పోయె. పిల్లోళ్ళు, ముసిలోళ్ళు అలో లక్ష్మ ణా అని పల్లాకులపాలైపోయిరి"

"పాపం- చ్చుచ్చు..." అన్నారు జనం.

"ఇప్పుడు మేమొచ్చిన అసలు విషయం చెప్తా వినండి. జాగ్రత్తగా వినాల"

జనాలు సావధానంగా వినసాగారు.

"మూడు నాలుగు నెలలప్పుడు పీలేరు దగ్గర శెనిక్కాయల ఫ్యాక్టరీని ఈ నక్సలైట్లు డైనమెట్లు పెట్టి పేల్చేసిరి. ఫ్యాక్టరీలో పని చేసి బతుకుతావుండిన సుమారు నూరు కుటుంబాలు వీధి పాలైపోయె. శెనిక్కా యలు తోలిన రైతులు డబ్బులు చేతికిరాక లబోదిబోమని ఏడుస్తా ఉండారు.. సరుకే కాలిపోయినంక ఫ్యాక్టరీ యజమానులకు డబ్బు లెక్కడినుండి వస్తాయి? రైతుల కెట్లా ఇస్తారు? అక్కడ పరిస్థితి అంతా గందరగోళంగా తయారయింది. రైతులు ఆఫీసర్లను కొట్టబోయినారు. ఆఫీసర్లు పోలీసుల్ని పిలిచి లాఠీచార్జీ చేయించి నారు. రైతులు తిరగబడినారు. పోలీసు లకూ రైతులకూ కూడా గాయాలయ్యాయి.

దీనికంతా కారణం ఎవరు? ఆ నక్సలైట్లే కదా. ఇదంతా వాళ్ళ నిర్వాకమే. వాళ్ళను ఏం చేసినా పాపం లేదు. మేము వాళ్ళకో సమే వెదకతా వుండాము. వాళ్ళు ఈ అడి విలో దాక్కున్నట్లు మాకు సమాచారం అందింది. అడవి ప్రక్కనుండే పల్లెలలో ఉండే జనాలే వాళ్లకు కావలసిన బియ్యం, పప్పు, ఉప్పూ, సరుకులూ సప్లైచేస్తా ఉండా రంట. కాబట్టి మీకూ వాళ్ళకూ సంబంధా లుంటాయి. వాళ్ళు దాక్కొనే తావులూ, తిరిగే తావులూ, వండుకొనే తావులూ, పడుకొనే తావులూ, అన్నీ మీకు తెలిసే ఉంటుంది. వాళ్లు నేరస్థులు. వాళ్ళను మీరు పట్టివ్వాల. కనీసం వాళ్ల అచూకీ చెప్పాల. నేరస్థులకు సాయం చెయ్యడం కూడా నేరమే. వాళ్లకు రహస్యంగా సరు కులు అందించేవాళ్ళు మీ పల్లెలో కూడా ఉండారు. వాళ్ళెవరో ఇప్పుడు తెలియాల"

"అలాంటోళ్ళు ఎవరూ కనబడలేదు సార్. ఈ అడవిలో మేము ఈ నడమ మళ్లకు ఆకు కొట్టుకొచ్చేదానికీ, పందిరి గుంజలకూ అప్పుడప్పుడూ బండ్లు కట్టు కొని అడవిలో చాలాదూరం వెళ్ళినాము సార్. పొద్దు గూకేదాకా కూడా ఉండి నాము. అట్టాంటోళ్ళు ఎవరూ కనబడలేదు సార్" అన్నాడు భాస్కరరెడ్డి.

రాఘవరెడ్డీ, జగన్నాథరెడ్డీ, ఇరగంరెడ్డీ మొగాలు మొగాలు చూచుకున్నారు. ఆ రోజు అడవిలో దూరంగా తుపాకులు పట్టుకొని నడుస్తూ కనిపించినవాళ్ళు నక్స

లైట్లన్నమాట. ఆ మాట బయట చెప్పకూడదని ముగ్గురూ సైగలు చేసుకున్నారు.

ఎంగిటిగాడు తమ్ముని వైపు చూచి కళ్ళు మూసుకున్నాడు. మాట్లాడవద్దు అన్నట్లు.

"ఇప్పుడిక్కడ ఊళ్ళో వాళ్ళందరూ ఉన్నారు కదా? " అడిగాడు యస్సై.

ఎవరూ బదులు మాట్లాడలేదు.

"ఏయ్ వన్నాట్ వన్. ఆ లిస్టు తే"

కానిస్టేబుల్ ఇచ్చిన ఓటరు లిస్టు తీసుకొని అక్కడున్న వాళ్లను ఇండ్ల వరుస ప్రకారం పిలిచి గుర్తు పెట్టుకుంటున్నాడు.

"మాదిరెడ్డి వెంకట్రెడ్డి? "

"ఆయన మా నాయన సార్. చనిపోయి పదేండ్లాయ" అన్నాడు భాస్కరెడ్డి.

"నెక్స్ట్ వడ్డి సుబ్బరాయుడు"

"వడ్డోళ్ళు ఊరొదిలి వెళ్ళిపోయి పదేండయ్యిపోయ సార్" అన్నాడు పెద్దిరెడ్డి.

"సరే సరి. బాగుంది ఓటర్ లిస్టు. గవళ్ళ ఆదెప్ప".

"నేనే సార్" అన్నాడు ఆదెప్ప.

"ఏంటీ నువ్వా! నీ వయస్సెంత? డెబ్బై ఉండదూ, ఇందులో ఎంతుందో తెలుసా. ముప్పై అయిదు, ఇట్లా రాసినారు ఓటరు లిస్టు- తరువాత - ముత్యాలు? "

"నా పెండ్లాం సార్" అన్నాడు ఎంగిటి.

"ఏంది? నీ పెండ్లామా? ఇక్కడ పురుషుడు అని రాసింది గదయ్యా. దొంగ ముండా కొడుకులు ఇల్లిల్లూ తిరిగి అడిగి రాసేదిలే. ఎక్కణ్ణో కూచోని ఎవర్నో అడిగి రాసేసేది" అంటూ అక్కడుండే వాళ్ళనందరినీ ఓటరు లిస్టుతో సరిచూచాడు యస్సై.

రాఘవరెడ్డి మిగిలిపోయాడు.

"వీడెవడు? " అన్నాడు యస్సై.

"మా ఇంట్లోనే ఉండాడు సార్. మా దగ్గరనే సేద్యం చేస్తావుండాడు. మా మనిషే. మూడు నెలలుగా మా దగ్గరే ఉండాడు" అన్నాడు పెద్దిరెడ్డి.

"ఏందీ- మూడు నెలలుగా ఇక్కడుండాడా? ఏయ్, ఇట్లారా! ఏమి నీ పేరు? "

"రాఘవరెడ్డి సార్" అన్నాడు రాఘవరెడ్డి యస్సైకి కాస్త దగ్గరగా వచ్చి. కాస్త భయంగా ఉంది. నేరస్థుడు అని అనుమానం వచ్చిన వాళ్లనే పోలీసులు కొడతారని పల్లెల జనాలు అనుకుంటారు. కాని టౌను దగ్గరినుండి వచ్చిన రాఘవరెడ్డికి పోలీసుల నైజం బాగా తెలుసు.

"ఏ ఊరు? "

"మద్దిలేరు సార్"

యస్సై ఉలిక్కిపడ్డాడు.

"ఏందేంది? పీలేరు దగ్గర మద్దిలేరా? పీలేరోడివా నువ్వు- రా నాయనా రా. నీలాంటోడి కోసమే వెతకతా ఉండాము. నక్సలైట్లు నిన్ను ఇక్కడుంచి, అడవిలోకి వెళ్ళిపోయినారన్న మాట. ఇప్పుడు చెప్పు. వాళ్లెక్కడుంటారు? నువ్వు వాళ్ళను ఎక్కడ కలుసుకుంటావు? సరుకులు ఎక్కడ అందిస్తావు? " అన్నాడు యస్సై రాఘవరెడ్డి భుజంమీద లాఠీ ఆనిస్తూ.

జగన్నాథరెడ్డీ, పుల్లారెడ్డీ, ఉత్తారెడ్డీ, ఇరగంరెడ్డీ ఇంకా కొందరు లేచి నిలబడ్డారు.

"సార్ అతన్ని ఏమీ అనొద్దు సార్"

"అతనికేమీ తెలియదు సార్"

"అతనట్లాంటాడు కాదుసార్" అన్నారు తలా ఒక మాటగా.

"మూణ్ణెల్లు సాముచేసి మూలనుండే ముసిల్దానితో కుస్తీకి పోయినట్లు, పోయి పోయి ఎట్లాంటోణ్ణి పట్టుకుంట్రి సార్. పూడుపాములాంటోడు. ఈ పిలగానికి అంత ధైర్యమేడ? " అన్నాడు ఉత్తారెడ్డి.

పోలీసులు వచ్చింది తమకోసం కాదని తెలిసిన తరువాత మంగలి ముని రాముడికీ, ఈడిగ కృష్ణయ్యకూ, జగన్నాథరెడ్డికీ ధైర్యమూ వచ్చేసింది. తలా ఒకమాట అంటూ తమ ఆందోళన కనపరచారు.

అంతవరకూ వాకిండ్ల చాటునా, రచ్చబండ వెనుకవైపునా నిలబడి చూస్తున్న ఆడవాళ్ళు ముందుకు వచ్చి "అయ్యో, అయ్యో" అంటున్నారు. మరికొందరు ఏవో

అంటున్నారు. స్పష్టంగా వినబడలేదు.

పల్లెజనాల్లో కలిగిన కదలికనూ, కలక లాన్నీ గమనిస్తున్నాడు యస్సై.

"సార్ సార్... ఈ పిల్లగాణ్ణి మూడు నాలుగు నెలలుగా చూస్తున్నాం. మా ఇల్లూ మా బావీ, మా చేనూ తప్ప ఇంకొక తావుకు పోడు. అతనేమో, అతని పనేమో. మీకు దండం పెడతా- అతణ్ణి ఏమీ అనొద్దు సార్" అన్నాడు పెద్దిరెడ్డి.

"అసలు ఈ అడివిలో నక్సలైట్లు అనే వాళ్లు కనబడిందేలేదు. ఇంక ఈ పిల్లోడు వాళ్ళను కలిసేది ఎక్కడ, మాట్లాడేది ఎక్కడ సార్" అన్నాడు భాస్కరరెడ్డి.

యస్సై చాలాసేపు మౌనంగా ఉండిపో యాడు. పరిస్థితి అర్థం చేసుకుంటున్నాడు.

ఈ పల్లెవాళ్లకు నక్సలైట్లతో సంబంధం ఉన్నట్లు తనకు కచ్చితమైన సమాచారం లేదు. పల్లె జనాలను భయపెట్టడం కోసం, హెచ్చరించడం కోసం తాను ఈ పల్లెకు వచ్చాడు. అడవి పక్కల పల్లెలన్ని టినీ తనిఖీ చేసి హెచ్చరికలివ్వాలని ఆదే శాలొచ్చాయి. ఈ పీలేరువాడితో వచ్చింది తంటా. వీడు నిజంగా అమాయకుడా, పల్లె జనాన్ని అలా నమ్మించాడా. తేల్చుకోలేక పోతున్నాడు. పైగా వీడు ఇక్కడికి వచ్చిచే రిన టైమూ, పీలేరు ఫ్యాక్టరీని పేల్చేసిన టైమూ దగ్గర దగ్గరగా ఉన్నాయి.

"ఏయ్- నీ పేరేమంటివి. మళ్ళీ చెప్పు"

"రాఘవరెడ్డి సార్" యువకుడు కాబట్టి నిబ్బరంగా నిలబడ్డాడు కానీ గుండె దడద డలాడుతోంది. కాళ్లు వణుకుతున్నాయి.

"సరే. వీళ్ళంతా ఇంత ఇదిగా చెప్తావుం డారు కాబట్టి నిన్ను వదిలేస్తాఉండా. జాగ్రత్త నక్సలైట్లతో నువ్వు షరీకైనట్లు మాకు ఏమాత్రం అనుమానమొచ్చినా బొక్కలో తోసేస్తా. కాపాడే వాడుండడు" అంటూ లాఠీని రాఘవరెడ్డి రొమ్ముమీద మోపి వెనక్కునెట్టాడు ఇక వెళ్ళమన్నట్లు.

రాఘవరెడ్డి 'బతికితిరా దేవుడా' అను కొని కాస్త దూరంగా వెళ్ళి నిలబడ్డాడు.

యస్సై లేచి నిలబడ్డాడు.

"కడసారి చెప్తా ఉండా. అందరూ బాగా వినండి. నక్సలైట్లు దేశద్రోహులు, ప్రజా ద్రోహులు. చంపడమూ, కొట్టడమూ, ధ్వంసం చేయడమూ వాళ్ళపని. వాళ్ళకు చట్టమన్నా, న్యాయమన్నా గౌరవం లేదు. వాళ్ళకు సహాయం చేసినా, వాళ్లను చేర దీసి ఆదరించినా, వాళ్ళకు ఏమైనా ఇచ్చినా, వాళ్ళనుండి ఏమైనా తీసుకున్నా అదీ నేరమే. కొత్తవాళ్ళను గ్రామంలోనికి రానివ్వకండి.. జాగ్రత్తగా ఉండండి."

పోలీసులు జీపు దగ్గరికి వచ్చారు.

పెద్దిరెడ్డి యస్సై దగ్గరికి వెళ్ళి "ఇంకో గంట మీరు నిలబడితే భోజనం చేయిస్తా మీకు" అన్నాడు వినయంగా.

> **కొత్తగాలి...**
>
> **కలలు..**
> **అలలూ.. ఒకటే**
> **ఒక్కోసారి ముంచుతాయి**
> **ఒక్కోసారి తేల్చుతాయి**
>
> – కనకనాగ్,
> పెనుగొండ

"ఫరవాలేదులే పెద్దాయనా. ఇప్పుడేం భోజనం? ఇంకా పన్నెండైనా కాలే. మళ్ళీ వచ్చినప్పుడు తింటాం. పనుంది, వెళ్తాం".

జనమంతా లేచి దండాలు పెట్టారు.

జీపు దుమ్మురేపుతూ వెళ్ళిపోయింది.

అందరూ "గండం గడిచింది" అని గట్టిగా ఊపిరి పీల్చుకుంటూ ఇండ్లకు వెళ్ళి పోయారు. రాఘవరెడ్డి పులి నాకి విడిచిన వాడిలా తల తడువుకున్నాడు.

"అప్పా బాయికాడికి పోతావుండా" అంటూ బయలుదేరాడు రాఘవరెడ్డి. పోలీసుల హడావుడిలో పల్లెలో ఏ

ఇంట్లోనూ వంటలు మొదలుపెట్టిన జాడ లేదు. పొద్దేమో నడినెత్తికి ఎక్కుతూ ఉంది. పొద్దున చద్దన్నాలు కూడా తిన లేదు కొందరు.

"అబ్బోడా కాసేపుంటే సంగటైపోతుంది. తినేసి పోదువు ఉండు" అంది జానకమ్మ.

"మల్లొస్తా అక్కా" అన్నాడు రాఘవరెడ్డి.

"మల్లా ఏమొస్తావు. అక్కణ్ణే ఉండు. ఎవురో ఒకరు తెస్తార్లే" అన్నాడు పెద్దిరెడ్డి.



పెద్దిరెడ్డి కూడ వెళ్ళే వాడే కానీ పోలీసుల హడావుడిలో బాగా గాబరా పడిపోయాడు. గుండె దడ ఇంకా సర్దుకోలేదు. కాసేపు నడుం వాలుస్తానని చెప్పి మంచం మీద పడుకొని ఉండిపో యాడు.

వంట పూర్తయింది. సీత గబగబా చిన్న పుటికెలో తనకూ రాఘవరెడ్డికీ సంగటీ, మామిడాకు పప్పూ, పెరుగూ పెట్టుకొని "అమ్మా నువ్వు నాయనకు అన్నంపెట్టి ఇంటికాడ్న నాయన్ను చూసుకో. బాయికా డికి పోతాఉండా" అనేసి వెళ్ళిపోయింది.

రాఘవరెడ్డి మర్రిమానుకింద ఎద్లను కట్టేసి వాటిముందర గడ్డివేసి కొత్తగా నాటిన మిరపతోటలో కలుపు తవ్వి ఎగేస్తూ ఉన్నాడు. సీత రావడం చూచి చేతులు కడుక్కొని రెండు అరటాకులు కోసుకొని సపారు లోపలికొచ్చాడు. సీత రెండాకుల్లోనూ సంగటి ముద్దలుపెట్టి పప్పు వేసింది.

"ఏం? చేతులట్లా ఒణుకుతావుండాయి" అన్నాడు రాఘవరెడ్డి.

"పొద్దున్న ఊళ్ళో... పోలీసులొచ్చి..." మాట పూర్తి చేయలేకపోయింది సీత.

"ఎల్లిపోయిరి కదా ఎందుకు భయం? "

"వాడు. ఆ యస్సై. నీ రొమ్ముమీద లాఠీ ఆనించింది చూచేటప్పటికి నా గుండెకాయ నిలచిపాయ. నిలబడేదానికి కాళ్లల్లో సత్త వలేక కూలబడి పోయినా. కొడ్తాడేమో అని బయపడిపోతి. పోలీ సోళ్ళు కొడ్తే అట్లా ఇట్లా కొట్టరంటనే. ఎక్క డంటే అక్కడ, తలమింద, నోటిమింద,

మెడమింద, కడుపుమింద, మోకాళ్ళమింద-చచ్చేది బతికేది సూడకుండా కొడతారంట-అది తలుచుకొని నాకు ఏడుపొచ్చింది. ఒళ్ళంతా ఒణుకు పుట్టింది" సీత ఏడుస్తూ రాఘవరెడ్డి భుజం మీద వాలిపోయింది. సీత కన్నీళ్ళు రాఘవుడి భుజం మీదనుండి ఇటు రొమ్ముమీదకీ, అటు వీపుమీదకీ ధారగా కారుతున్నాయి..

రాఘవరెడ్డికి కూడా సీత వర్ణించిన పోలీసుల వీరవిహార దృశ్యం కళ్ళముందు మెదిలి ఒళ్ళు జలదరించింది. కన్నీళ్ళు గొంతుకడ్డం పడ్డాయి. కొంతసేపు నోట మాట రాలేదు. ముందరున్న ఆకు దూరంగా లాగేసి ప్రక్కన గ్లాసులో చెయ్యి అద్దేసి సీతను ఎదుటికి త్రిప్పుకొన్నాడు. సీత ఇంకా రాఘవుని భుజం మీద నుండి తల ఎత్తలేదు. అతని వీపుపైన, రొమ్ముపైన వేసిన చేతులు అలానే ఉన్నాయి.

"ఛ, ఛ. ఎందుకట్లా ఏడుస్తావు, ఇప్పుడే మైపోయె. వాళ్ళు గమ్మున ఎల్లిపోయిరి కదా? " అన్నాడు సీత కళ్ళు తుడుస్తూ.

వాళ్ళు తనను కొట్టకుండా ఎందుకు వది లేశారో, 'గమ్మున' ఎందుకు వెళ్ళిపోయారో కళ్ళకు కట్టినట్లు కనబడుతూనే ఉంది. యువకులు లేచి నిలబడడం, పెద్దవాళ్ళు దండాలు పెట్టి వేడుకోవడం, ఆడవాళ్ళు అయ్యో, అయ్యో అనడం, ఇవన్నీ చూచి యస్సై తటపటాయించడం, అంతా తన కళ్ళముందు కదిలింది.

"ఈ ఊరోళ్ళ రుణం నేను ఎన్ని జన్మ లకు తీర్చుకొనేది? నేనీ ఊరొచ్చి ఎన్నాళ్ళ యింది? వీళ్ళతో కలిసి తిరిగి ఎన్నా ళ్ళైంది? నేను వీళ్ళకు ఏమి ఒరగబెట్టి నాను? అందరికీ నా మీద ఎంత దయ,



నా కోసం అందరూ ఒక్కమాట మీద నిల బడినారే. అంతమందీ అట్ల మాట్లాడకపో య్యుంటే పోలీసోళ్ళు నన్ను ఇడిసిపెట్టే వాళ్ళా? జీపులో ఏసకపోయి చేతులూ, కాళ్ళూ ఇరగ్గొట్టుండరూ? " అన్నాడు.

"నీ మంచితనమే నిన్ను కాపాడింది" అంది సీత.

రెండు క్షణాలాగి మెల్లగా- "నీ ఒంటి మీద దెబ్బ పడుంటే నేను అప్పుడే అక్కడే సచ్చిపోయుందును, రెండోదెబ్బ సూడ కుండా" అని సీత తన ముఖం రాఘవరెడ్డి రొమ్ముమీద గట్టిగా హత్తుకుంది. ఎడమచే తిలో రాఘవుడి తలను తన తలమీదికి లాక్కుంది. రాఘవుడి గడ్డం సీత తలపైన అటూ ఇటూ రాసుకుంటూ ఉంది.

"సీతా.. సీతా.. ఎందుకు నాపైన ఇంత ఇది..." అన్నాడు గుసగుస ధ్వనితో.

"ఎందుకంటే- ఎందుకంటే అందుకే..." అంటూ సీత రాఘవుడి రొమ్ముమీద పెద వులూ, ముక్కూవేసి రుద్దుతూ.

రాఘవుడు మెల్లగా సీత భుజాలను పట్టుకొని ఆమెను తన నుండి జానెడు ఎడంగా పట్టుకున్నాడు. సీత రాఘవుడి ముఖంపైన ఒక్క క్షణకాలం చూపు నిలిపి తేరిపార జూచి కళ్ళలోకి సూటిగా చూడ లేక మళ్ళీ రాఘవుణ్ణి గట్టిగా హత్తుకుంది.

"సీతా... ఇది మంచిది కాదు... మల్లా మల్లా చెప్తా ఉండా. నేను జీతగాణ్ణి. మీరు ఆసాములు. నువ్వుండాల్సిన తావు వేరే. నేనుండాల్సిన తావు వేరే. నేను అంతంతాశలు పెట్టుకోకూడదు."

"ఇదేమీ పెద్ద ఆశ కాదు"

"పెద్ద ఆశకాక ఇంకేంది? మీ నాయన నిన్ను నాకిచ్చి చేస్తాడా? ఊళ్ళోవాళ్ళేమం టారు? పెద్దిరెడ్డి ఎక్కడా గతిలేనట్లు ఒంటి కూతుర్ని ఒక జీతగానికి ఇచ్చి చేసి నాడని నవ్వరూ? "

సీత చట్టుక్కున ఒకడుగు వెనక్కు జరిగి రోషంగా అంది.

"ఎందుకు నవ్వుతారూ? నువ్వు సాటి కాపోనివి కాదా? సేద్యగానివి కాదా? వయస్సులో ఉండే మొగాడివి కావా? పెండ్లాం బిడ్డల్ని సాక్కొనే సత్తా ఉండేవా నివి కాదా? ఇంతకంటే ఎవుడికైనా ఏం కావాల ఒక ఆడబిడ్డనిచ్చి పెండ్లి చేసేదా నికి? ఏం? ఆస్తులు లేనోళ్ళెవరూ బతక లేదా? పెండ్లిండ్లు చేసుకోలేదా? ఆస్తులు సంపాదించుకోలేదా? జీతగాడెప్పుడూ జీత గాడుగానే ఉండిపోతాడా? "

"అదికాదు సీతా..."

"ఇంకేమీ మాట్లాడొద్దు. నా మనసులో ఉండేమాట చెప్పేసినా. ఇంగ నీ ఇష్టం. ముందు సంగటి తిను. సల్లారి పోయె."

తిరిగి చూచేసరికి సీత ఆకులోని సంగటిని ఒక కుక్క నోటకరచుకొనిపోయి బావిగట్టున పెట్టుకొని తింటూ ఉంది.

"అయ్యో నీ సంగటి కుక్కెత్తకపోయెనే" అన్నాడు రాఘవ.

సీత ఎదలో ఎక్కడో కలుక్కుమంది. అయినా వెంటనే తేరుకుంది.

"పోతే పోనీలే, ఉండేదే ఇద్దరమూ తిందాం" అంటూ రాఘవరెడ్డి ఆకులోని ముద్దను చెరొక ముక్క తుంచి తుంచి తినసాగారు. పుటికలో మిగిలిన సంగటిని పెరుగుతో కలుపుకొని జుర్రుకున్నారు. సన్న ఎర్రగడ్డలు నంజుకున్నారు.

## 9

ఆ రోజు వినాయకచవితి. మిట్టపల్లి నుండి కుమ్మర కూరేసు కొడుకు వెంకటేసు వచ్చాడు. పెద్ద రచ్చ బండ మీద ఉండే నల్లగుండ్లను బాగా కడిగి అడ్డంగా పెద్ద పెద్ద వీబూది పట్టెలు తీర్చాడు. వాటిపైన గంధపుబొట్లు పెట్టాడు. పైనుండి రెండువైపులకూ పూల మాలలు దిగవిడిచాడు. పాదాల దగ్గర పూలు పెట్టాడు. ఆ రోజుకు ఆ నల్లగుండ్లే వినాయకుడు. వెంకటేసు పూజ ముగిం

చాడు.

ఊళ్ళో వాళ్ళందరూ వచ్చేశారు. అంద రికీ విబూది ఇచ్చాడు వెంకటేసు. ఊరి పెద్దల అనుమతి తీసుకొని పూజ ప్రారం భించాడు. ఊళ్ళోవాళ్ళు చిన్న చిన్న బుట్ట లలో తెచ్చిన పూలూ పండ్లూ దేవుని ముందర పెట్టాడు. నిప్పులు తెప్పించి ధూపకలశంలో వేసి అందులో సాంబ్రాణి వేసి వినాయకుని ముందు మూడుసార్లు తిప్పి రచ్చబండ అంచున పెట్టాడు. అందరూ ధూపాన్ని కళ్ళకద్దుకున్నారు. టెంకాయలు కొట్టి వారివారి బుట్టలలోనే పెట్టి హారతిపళ్ళెంలో కర్పూరం వెలిగించి తిప్పుతూ గంట వాయించాడు వెంకటేసు. పద్యాలు చెప్పాడు. ఊళ్ళో వాళ్ళందరూ వినాయకునికి దండాలు పెట్టుకున్నారు. తలపైన రెండు చేతులతో మూడేసిసార్లు మొట్టికాయలు వేసుకున్నారు. గుంజీలు తీశారు. ఇది వినాయకునికి బాగా నచ్చిన, వినాయకుడు మెచ్చి అనుగ్రహించే నమ స్కార ప్రక్రియ. అందరూ తమ దగ్గరికి వచ్చిన హారతిని కళ్ళకద్దుకొని పళ్ళెంలో కానుకలు వేశారు. పెద్దిరెడ్డి మామూలు అర్ధరూపాయ. అదే అక్కడి పెద్ద కానుక.

రాత్రి పెద్దిరెడ్డి ఇంటి ముంగిట్లో ఊరివా ళ్ళందరూ చేరిపోయారు. ఈత చాపలూ, బొంతలూ పరుచుకొని కూర్చున్నారు.

అరుగుమీద దొరసామిపిళ్ళె అయ్యవారు లాంతరు దగ్గర కూర్చొని పురాణపఠనం చేస్తున్నారు. వినాయకచవితి కాబట్టి వినా యక వ్రతకథ చిలువలు పలువలుగా వర్ణించి చెబుతున్నారు. అయ్యవారిది కంచుకంఠం. దగ్గరగా కూర్చున్న గ్రామస్థు లకూ, కాస్త దూరంగా కూర్చున్న హరిజన వాడ జనాలకూ బాగా వినబడుతూ ఉంది. పురాణం జోరుగా సాగుతోంది.

"ఆ ప్రకారంగా వేటకు వెళ్ళిన ప్రసేన జిత్తు ఎన్ని రోజులైనా రాకపోవడం చూచి సత్రాజిత్తు చాలా దిగులుపడినవాడై.. ఈ కృష్ణుడే నా తమ్ముణ్ణి చంపివేసి ఆ శ్యమం తకమణిని అపహరించినాడు. ఈ విషయం విచారించి కృష్ణుణ్ణి దండించి నా మణిని నాకిప్పించవలసింది అని రాజస భలో నిందారోపణ చేసినాడు. అప్పుడు శ్రీకృష్ణుడు 'అయ్యా, నీ తమ్ముణ్ణి నేనెం దుకు చంపుతాను. నీ శ్యమంతకమణి నాకెందుకు? నీ తమ్ముణ్ణి నేను చూడనే లేదు. నాకు ఏమీ తెలియదు. నిష్కార ణంగా నాపైన నిందమోపుతున్నావు' అని ఎంత చెప్పినా సత్రాజిత్తు చెవిలో వేసుకో లేదు. అయ్యలారా మన తలరాత బాగా లేనప్పుడు ఈ విధంగానే అపవాదులు వచ్చి పడతాయి. నాకేమీ తెలియదు. నేను నిర్దోషిని మొర్రో అని నెత్తీ నోరూ కొట్టుకున్నా ఎవరూ వినరు.."

పురాణపఠనం సాగుతుండగా ఉన్న ట్లుండి ఊరికుక్కలు అడవి దోవవైపు పరు గులు తీస్తూ మొరగడం మొదలుపె ట్టాయి. వెంటనే పరుగెత్తడం ఆపేసి వెన క్కువెనక్కు అడుగులు వేసుకుంటూ మొర గడం సాగించాయి. కొద్ది నిమిషాలకే చాలామంది మనుషులు అడవి నుండి పెద్దిరెడ్డి బావి దోవన ఊళ్ళోకి వస్తున్నట్లు చెప్పుల శబ్దమూ బూట్ల శబ్దమూ చెప్పుల క్రిందా, బూట్ల క్రిందా పడి చెదరిపోతున్న గులకరాళ్ళ శబ్దమూ, మాటలూ వినబ డ్డాయి. కుక్కలు బెదురుతూ మరింత గట్టిగా మొరుగుతున్నాయి. ఆ వచ్చే వాళ్ళె వరో ఊరి అంచుకు వచ్చేశారు.

"విప్లవం వర్ధిల్లాలి"

"పెత్తందార్ల దౌర్జన్యాలు నశించాలి"

"రైతు కూలీల ఐక్యత వర్ధిల్లాలి"

"దున్నే వాడిదే భూమి"

"కార్మికులారా, కర్షకులారా ఏకంకండి!" అంటూ నినాదాలు చేస్తూ దాదాపు పద హైదు మంది యువకులు వీధులన్నీ తిరిగి రచ్చబండ దగ్గరికి వచ్చేశారు. కొందరి వీపులమీద తుపాకులు వ్రేలాడు

తున్నాయి. కొందరి చేతుల్లో కొడవండ్లు ఉన్నాయి. నడువుల దగ్గరగా బిచ్చువాలు న్నాయి. పోలీసోళ్ళలాగా, మిలటరీ వాళ్ళ లాగా ఒకేరకం ప్యాంట్లూ, షర్టులూ వేసు కున్నారు. టోపీలు పెట్టుకున్నారు. అందరి చేతుల్లోనూ ఎర్ర జెండాలున్నాయి.

పెద్దిరెడ్డి ఇంటిముందర పురాణ పఠనం అర్థాంతరంగా నిలిచిపోయింది.

యువకులు రచ్చబండపై నిలబడి 'సమ సమాజ నిర్మాణాం', 'ఎర్రజెండా' అంటూ విప్లవ గీతాలు పాడడం మొదలుపెట్టారు.

పాటలు బాగున్నాయి. మనుష్యుల్ని ఊపేస్తున్నాయి. పాటలలోని భావాలు గుండెల్ని పిండేస్తున్నాయి.

> **కొత్తగాలి...**
>
> **మితిమీరిన సిరులెందుకు?**
> **నీతి ప్రవచనాలెందుకు?**
> **సభ్యజనులు ఛీకొట్టెడు**
> **రంకు చేసి బొంకెందుకు?**
> **ఛీ.. ఛీ.. ఛీ.. చిదానంద!**
>
> – రేగులపాటి కిషన్‌రావు, కరీంనగర్

జనానికేమో వాళ్ళ చేతుల్లోని ఆయు ధాలు చూస్తుంటే దగ్గరికి వెళ్ళడానికి ధైర్యం చాలడంలేదు. మొత్తంమీద వాళ్ళు దోపిడీ దొంగలూ, దుండగులు కారని తేలి పోయింది. పోలీసులు చెప్పిన నక్సలైట్లు వీళ్ళేనా? మామిడి తోటలోని చెట్లను నరి కిందీ, బుర్రయ్య శెట్టిని ఉరితీసిందీ, మస్తాన్ సాయిబు చేతులు నరికిందీ, సత్తి రాజు బిల్డింగులు కూల్చేసిందీ వీళ్ళేనా? వీళ్ళ మొగాలు చూస్తే అలా అనిపించడం లేదు. లేత మొగాలు, బిరుసెక్కిన శరీ రాలు, పాటల్లో బహు నాగరికమైన భాష... ఏమిటో వింతగా ఉంది?

యువకులు జనాన్ని దగ్గరికి రమ్మని చేతులు ఊపారు. జనం రచ్చబండ ముందర నిలబడ్డారు. ఆడవాళ్ళు దూరంగా వసారాల్లో నిలబడ్డారు.

యువకుల్లో ఒకతను ముందుకు వచ్చి మాట్లాడడం ప్రారంభించాడు.

"కామ్రేడ్స్, సోదరులారా! భయపడ కండి. దగ్గరగా రండి. మావల్ల మీకు మేలే జరుగుతుంది కానీ కీడు జరగదు. ఈ ఆయుధాలు మన వర్గ శత్రువులపై ప్రయోగించడానికే గానీ మీపైన ప్రయోగిం చడానికి కాదు. మేము పేద రైతుల పక్షాన, కార్మికుల పక్షాన, రైతు కూలీల పక్షాన నిలబడి పోరాడే అన్నలం. అవినీతి పరులైన పెద్ద మనుషులకూ, దుర్మార్గులైన భూస్వామ్య వర్గాలకూ, దోపిడీదారులైన పెట్టుబడిదారీ యజమానులకూ బుద్ధి చెప్పడానికీ హతమార్చడానికీ పూనుకొన్న విప్లవవీరులం. కొంతసేపు ఓపిగ్గా కూర్చొని మా మాటలు వినండి".

జనం కాస్త దగ్గరగా వచ్చి కూర్చున్నారు. రచ్చబండపైకి ఎవరూ వెళ్ళలేదు. వాళ్ళూ ఎవరినీ పిలవలేదు.

ముందుకు వచ్చిన 'అన్న' ఉపన్యాసం ప్రారంభించాడు.

"కామ్రేడ్స్. ఈనాడు దేశంలో ఏమి జరు గుతూ ఉందో మీకందరికీ తెలుసు. నీతి నేల కరచుకొనిపోయింది. న్యాయం కొండె క్కింది. ధనబలం, మందిబలం ఉన్నవా నిదే రాజ్యం. భూమిలో కష్టపడి సేద్యం చేసేవానికి పూట గడవడంలేదు. ఫ్యాక్ట రీలో పనిచేసేవానికి కడుపు నిండేటట్లు జీతం ఇవ్వడంలేదు. బలవంతులంతా వాళ్ళకు అనుకూలంగా చట్టాలు చేసుకొని పేదలను దోచుకుతింటున్నారు. ఎదురు తిరిగినవాణ్ణి అణచివేయడానికి పోలీసు బలగాన్ని మేపుతున్నారు. ఈ పోలీసులు పేదలకు రక్షణగా నిలబడవలసిందిపోయి బలవంతులనే బలపరుస్తున్నారు. వీళ్ళను చట్టమూ, కోర్టులూ ఏమీ చేయలేవు.

చట్టాలు చేసేది ఎవరు? " ప్రశ్న తానే వేసి జవాబూ తానే చెప్పసాగాడు అన్న.

"అసెంబ్లీలో ఎమ్మెల్యేలూ, పార్లమెం టులో ఎంపీలు"

"వాళ్ళంతా ఎవరు? "

"ఒళ్ళు బలిసిన భూస్వాములు, పొట్టలు బలిసిన పెట్టుబడిదారీ యజమానులు"

"వాళ్ళు ఏ చట్టాలు చేసుకుంటారు? "

"వాళ్ళు చేసే అక్రమాలూ, దోపిడీలు అన్నీ రైటే అనేచట్టాలు చేసుకుంటారు."

"ఇది అన్యాయం అని ప్రశ్నించినవాడు నేరస్థుడు అని చట్టం చేసుకుంటారు"

"కోర్టులేం చేస్తాయి? "

"ఆ చట్టం ప్రకారం తీర్పులిస్తాయి. ఈ చట్టంవల్ల ఎవరికి లాభం, ఎవరికి నష్టం అని తర్కించే పని కోర్టులది కాదు"

"పోలీసులేం చేస్తారు? "

"ఆ చట్టాన్ని ఎదిరించినవాణ్ణి నేరస్థుడు అని పట్టి లోపల తోసి కేసులు పెడతారు. ఎందుకు ఎదిరించాడు అని ఆలోచించేపని వాళ్ళది కాదు."

"ఈ బడాచోర్లు రూపొందించిన చట్టాల వల్ల అన్ని విధాలా నష్టపోయేదెవరు? "

"పేదవాడు, నోరు లేనివాడు "

"మరి ఈ పరిస్థితి మారేదెట్లా? "

"చట్టంతో ఎదిరించగలమా? "

"చట్టం వాళ్ళు చేసింది"

"మరి ఈ అన్యాయాల్ని ఎదిరించడం ఎట్లా? పేదలకు, బలహీనులకు న్యాయం జరిగేదెట్లా? ఎవరు న్యాయం చేస్తారు? "

ఎవరూ మాట్లాడలేదు.

"పులిని మా ఆవులమంద మీదికి రావద్దు పో అంటే వెళ్ళిపోతుందా? "

"పామును మా ఇంటిలోనికి రావద్దు పో.. అంటే వెళ్ళిపోతుందా? "

"ఏం చేయాలి? "

ఉత్తారెడ్డి నోరు చాలాసేపటి నుండి మౌనంగా ఉండడంవల్ల సిమసిమా అంటా ఉంది. ఏదో ఒకటి మాట్లాడాలి.

"పులిని కనబడగానే కాల్చి పారేయల్ల. పాం కనబడగానే చంపేయల్ల" అన్నాడు.

"అదిగదీ సరైన జవాబు. మేము సరిగ్గా ఆ పనే చేస్తున్నాం. ఎక్కడ అన్యాయం జరిగితే అక్కడ ప్రత్యక్షమౌతాం. మొదట హెచ్చరిస్తాం. మాట వినకపోతే పట్టుకొని చితగ్గొట్టి బుద్ధి చెబుతాం. అప్పటికీ దారికి రాకపోతే ఖతం చేసేస్తాం అంతే"

"అట్లాంటి దుర్మార్గులను చంపుతారు. సరే. మరి చెట్లేంచేసినాయి? యాభై ఎక రాల్లో ఉండిన కాసే పూసే మామిడిచెట్లను నరికేస్తిరంటనే అది న్యాయమా అన్నా? " అన్నాడు ఈడిగ కృష్ణయ్య.

"అట్లా అడగండి చెప్తాము. మొన్న మీ పల్లెకు వచ్చిన పోలీసులు ఏవేవో కథలు చెప్పి మేమంతా పరమ దుర్మార్గులమనీ, సంఘద్రోహులమనీ బాగా బోధించిపోయి నారు కదా. మేము కిరాతకులమైనట్లూ, వాళ్ళు ధర్మరక్షకులైనట్లూ చెప్పిరికదా. ఎప్పుడెప్పుడు ఎక్కడెక్కడెక్కడ ఏమి జరి గేది మీకు తెలుస్తూనే ఉంటుంది. పట్టాభి రెడ్డికి యాభై ఎకరాల మామిడితోట ఎట్లా వచ్చిందో మీకు తెలుసా? "

ఎవరూ మాట్లాడలేదు.

"రొంపిచెర్ల దగ్గర ఒక పల్లె పక్కన పది ఇండ్లోళ్ళు యానాదులుండినారు. పట్టాభి రెడ్డి వాళ్ళనందరినీ పిలిచి 'ఒరేయ్ ఆ బోడిగుట్ట పక్కన పోరంబోకు నేల ఉండాది కదా. అక్కడ చెట్లూ చేమా కొట్టేసి, రాయీరప్పా ఏరేసి సాగుచేసు కోండి పట్టాలు ఇప్పిస్తాను' అన్నాడు. వాళ్ళు యాభై ఎకరాల పోరంబోకు తీర్చి అరువు చేసుకున్నారు. పట్టాలు చేయించి పట్టాభిరెడ్డి కాగితాలు తన దగ్గరే పెట్టు కుండే. యానాదుల బొటనవ్రేలి గుర్తులు వేయించి ఒక్కొక్కరి పేరున అయిదేసి వేల లెక్కన బ్యాంకు లోన్లు తెచ్చుకొని తానే దాచుకొనె. పాపం యానాదులు రెండేండ్లు ఆ చేన్లలో ఉలవలూ, జొన్నలూ

పైరు పెట్టుకుంద్రి. భూమి బాగా అరువు పడే. బ్యాంకు వాళ్లొచ్చి లోన్లు కట్టమని యానాదోళ్ళ నెత్తిన కూచుంద్రి. 'మాకు తెలియదు తంద్రో' అని మొత్తుకున్నా విన కపోయిరి. బ్యాంకువాళ్ళ పోరు పడలేక యానాదోళ్ళు ఊరొదిలేసి తలా ఒక దిక్కు వెళ్ళిపోయిరి. భూమిని పట్టాభిరెడ్డి ఆక్ర మించుకుండె. బ్యాంకులోను మాఫీ చేయిం చేసె. ఆ యాభైవేలతో ఆ యాభై ఎకరా లలో దర్జాగా మామిడిచెట్లు పెట్టేశె. యాభై ఎకరాలూ, యాభైవేలు గవర్నమెం టుకు అప్పజెబుతావా, నిన్ను ఖతం చెయ్య మంటావా అని చీటీ రాస్తిమి. పట్టాభిరెడ్డి పోలీసు రక్షణ సంపాదించుకుండె.

ఇప్పుడు చెప్పండి. నేల యానాదులది. నేలను అరువ చేసినవాళ్ళు యానాదులు. డబ్బు గవర్నమెంటుది. అప్పనంగా మామి డితోట వేసుకొని అనుభవించేవాడు పట్టా భిరెడ్డి. ఇది న్యాయమేనా? ఒక పల్లెగా బ్రతుకుతా వుండిన పది యానాది కుటుం బాలని పల్లాకులపాలు చేసిన పట్టాభిరెడ్డిని ఊరికే వదలవచ్చునా? ఏదో ఒకరోజు మా చేతికి చిక్కకుండా పోడు. మా చేతుల్లో ఖతం కాకుండా తప్పించుకోలేడు"

జనం నిశ్చేష్టులయ్యారు. ఎంతమాట! ఎంత పబ్లీకుగా అంటున్నారు! అమ్మో!!

"పాపం! బొట్టయ్యశెట్టిని నడిఈధిలో ఉరితీసినామని మీకందరికీ చాలా బాధగా ఉంది కదూ. ఆ బొట్టయ్యశెట్టి కథ మీకు కొంత తెలుసు. కొంత తెలియదు. మేము చెబుతాము వినండి.

నెరబైలు దగ్గర ఒక ఫ్యాక్టరీ ఉంది కదా. అది కట్టకముందు అక్కడ యాభై అరవై ఇండ్ల పల్లె ఉండింది మీకు తెలుసు. ఆ పల్లె ఏమైపోయిందీ, ఆ తావున ఆ ఫ్యాక్టరీ ఎట్ల వచ్చిందీ మీకు వివరంగా తెలియదు. చెబుతాము వినండి.

ఆ పల్లెవాళ్ళకూ, శెట్టికి ఒక దోవ విష యంగా తగాదా వచ్చింది. శెట్టి ఒక అర్ధ రాత్రి పూట తన మనుషుల్తో ఆ పల్లెకు అగ్గిపెట్టి కాల్పించేసె. ఇండ్లూ ధాన్యమూ, కొన్ని పశువులూ కాలిపోయే. వెంటనే శెట్టి పెద్ద ధర్మాత్ముని మాదిరి ఆ పల్లెకు వెళ్ళి ఇంటింటికి కొంచెం బియ్యమూ, వంట సరుకులూ, కొన్ని పాత్రలూ ధర్మంగా పంచిపెట్టె. ఇండ్లు కట్టుకునేదానికి అప్పు లిచ్చి బాండ్లు రాయించుకుండె. విత్తనాల శెనిక్కాయలు సాగుకు ఇచ్చి మొత్తానికి బాండ్లు రాయించుకుండె.

ఆ విత్తనాలు మరీ నాసిరకంవి. పంట పూర్తిగా చెడిపోయె. బాకీ కట్టమని శెట్టి రౌడీలను పట్టుకొనిపోయి దౌర్జన్యం చేయించి బూములు రాయించుకుండె. రెండే రెండేండ్లలో రైతులు పల్లె వదిలేసి టౌన్లు చేరిపోయిరి. వాళ్ళ ఇండ్లనూ, భూముల్ని ఫ్యాక్టరీ వాళ్ళకు ఎన్ని లక్షలక మ్మినాడో తెలియదు. ఒక ఊరు ఊరునే లేపేసినవాణ్ణి ఏంచేయాలి? "

జనం "చ్చొచ్చొ" అన్నారు.

"మహా పెద్దమనిషి హాజీమస్తాన్ చరిత్ర వినండి. ఈ రెండు మండలాలకూ మస్తాన్ సాబే గవర్నమెంటు సారాయి కంట్రాక్టరు. ఈయన గవర్నమెంటు సారా యిని అరవదేశానికి ఎగుమతిచేసి కల్తీ దొంగసారాయి ఇక్కడ అమ్మబట్టె. ఆరునె లకు ముందు చిన్నగొట్టిగల్లు దగ్గర ఒక వడ్డిపల్లెలో ఓ పెండ్లినాడు ఆ సారాయి తాగి పద్దైదుమంది వడ్డివాళ్ళు చచ్చిపో యిరి. ముప్పైమంది ఆస్పత్రిపాలైపో యిరి. అప్పుడు అతనికి చీటీ వ్రాస్తిమి. అతను కేరేజాట్ అనె. మూడునెలలకు ముందు బాకరాపేట దగ్గర దన్‌దార్‌ప ల్లెలో ఈ కల్తీ దొంగసారాయి తాగి మరో నలుగురు చచ్చిపోయిరి. ఆ సారాయి నా దగ్గరకొనింది కాదు అని మస్తాన్‌సాబ్ తప్పించుకుండె. ఇంతమంది ప్రాణాలు తీసినవాణ్ణి ఏంచేయాలి? వీళ్ళ నేరాలు చట్టాలకు అందవు. వాళ్ళకు పైలెవల్లో

పలుకుబడి. పోలీసులు ఏమీ చేయలేరు. వీళ్ళను వదిలేస్తే దేశం ఏమైపోతుంది"

"మా పల్లెలో కూడా రెండు సంవత్సరాలకు ముందు ఇట్లా సారాయి తాగి ఇద్దరు మాలోళ్ళు చచ్చిపోయిరి. ఈ సారాయికీ మస్తాన్‌సాబ్‌కూ సంబంధం ఉందని మాకు తెలియదు" అన్నాడు మునిగాడు.

"ఇక ఆ సత్తిరాజుది మరీ భయంకరమైన కథ. అతనిది ఒక పెద్దముఠా. పీలేరు దగ్గర అనాథాశ్రమమనీ, పిల్లలూ, ముసలోళ్ళనూ చేరదీశాడు. విదేశాలనుండి కుప్పలు కుప్పలు విరాళాలు సేకరించాడు. పెద్ద పెద్ద బిల్డింగులు కట్టాడు. అక్కడ వీడు చేసిన పనేమిటో తెలుసా? ముసలోళ్ళు చిన్న జబ్బుపడినా ఆస్పత్రిలో చేర్చడం, ఆపరేషన్ చెయ్యాలి అంటూ కిడ్నీలను తొలగించి అమ్ముకోవడం. డాక్టర్లూ వీడి ముఠావాళ్ళే. ఇలా కిడ్నీల వ్యాపారం బాగా జరిగింది.

దిక్కులేని ఆడపిల్లల్ని చేరదీసి కొన్ని నెలలు వాళ్ళకు ఆశ్రయం కల్పించేవాడు. తరువాత ఎక్కడో ఉపాధి కల్పించానని కొందరినీ, పెండ్లిచేసి పంపుతున్నానంటూ కొందరినీ బొంబాయి వ్యభిచార గృహాలకు అమ్మేసేవాడు. అసలు వాడి బిల్డింగే ఒక పెద్ద ఘరానా వ్యభిచార గృహం. వీడి వెనుక రాజకీయ నాయకులున్నారు. రౌడీ మూకలున్నాయి. ఏ చట్టమూ, ఏ కోర్టూ ఏమీ చెయ్యలేదు. వాణ్ణి ఏంచేయాలి?"

పల్లెజనానికి ఇవన్నీ కొత్త విషయాలు, దిగ్భ్రాంతిని కలిగించే విషయాలు.. నమ్మశక్యంగాని విషయాలు.

జనాలు ఆలోచించుకోవడానికా అన్నట్లు దళనాయకుడు కాసేపు ఊరుకున్నాడు.

కొన్ని క్షణాల తరువాత మరో యువకుడు ప్రారంభించాడు.

"విన్నారు కదా ఈ మహనీయుల పుణ్య చరిత్రలు. ఇప్పుడు చెప్పండి.. ప్రభుత్వం తనపని తాను సక్రమంగా చేస్తా ఉంటే ఈ దారుణాలు జరిగేవా? ప్రభుత్వాన్ని పనిచేయకుండా చేస్తున్నదెవరు? పెట్టుబడిదారీ, భూస్వామ్యవర్గాలు కాదా? సంఘానికి ద్రోహం చేస్తున్నదెవరు? ఈ పెత్తందార్లు కాదా?

రొంపిచెర్ల దగ్గర మోసపోయిన యానాదులకు న్యాయం చేసేదెవరు? బొర్రయ్యశెట్టికి భూములు ధారపోసిన రైతులకు న్యాయం చేసేదెవరు? కల్తీసారాయి తాగి చచ్చినవాళ్ళ కుటుంబాలకు న్యాయం చేసేదెవరు? కిడ్నీలు పోగొట్టుకొని అర్ధాంతరపు చావు చచ్చిన ముసలివాళ్ళకు న్యాయం చేసేదెవరు? వ్యభిచార కూపాల్లో మ్రగ్గుతూ ఉన్న దిక్కులేని ఆడపిల్లలకు న్యాయం చేసేదెవరు?"

## అహంకారానికి పరీక్ష

సోక్రటీసును ఆయన శిష్యుడు ఒకసారి ఇలా ప్రశ్నించాడు- 'అయ్యా! మీకు శిష్యరికం చేస్తామని వస్తున్నవారిని కొలనులోకి చూసి అందులో ఏమి కనిపించిందో చెప్పమని అడుగుతున్నారెందుకు?'



'ఇది అతి సులభమైన విషయం. కొలనులో చేప ఈత కొట్టడం చూశామన్న వాళ్ళందరినీ తీసుకునేందుకు నేను సిద్ధమే. కానీ నీటిలో తమ ప్రతిబింబాన్ని చూశామని చెప్పే వారివల్ల నాకు ఏమాత్రం ఉపయోగం లేదు. వారికి తమ అహంకారం పట్ల, అభిమానం పట్ల ఇంకా ప్రేమ ఉంది' అని సోక్రటీసు సమాధానం ఇచ్చాడు చమత్కారంగా.

ఈ కథలు వింటూ ఉండే జనానికి కడుపులో దేవినట్లుగా ఉంది.

"వీళ్ళకు పోలీసులూ, కోర్టులూ న్యాయం చేయవు. ఇదిగో ఇవి చేస్తాయి న్యాయం"

అన్నలందరూ ఒక్కసారిగా తమ వద్ద ఉన్న తుపాకులను, కొడవండ్లనూ, బిచ్చువాలను పైకెత్తి ఊపారు.

వాతావరణం గంభీరమైంది. అంతటా నిశ్శబ్దం ఆవరించింది. జనాలు గాలిపీల్చడం కూడ మరచిపోయి చూస్తున్నారు. అందరికీ ఒళ్ళు జలదరించింది.

"అన్యాయాన్ని అణచివేస్తాం. దౌర్జన్యపరుల గుండెల్లో నిద్రపోతాం. బడాచోర్ పెత్తందార్ల అంతు చూస్తాం"

జనంలో ఒక విధమైన కదలిక బయలుదేరింది. యువకుల రక్తం ఉడుకుతోంది. ఆడవాళ్ళ కడుపులు రగులుతున్నాయి. పెద్దవాళ్లు ఆలోచనలో పడ్డారు.

"మేము ఈ పనులు చేయాలంటే ముందు మాకు తలదాచుకొనేందుకు తావు కావాలి. పోలీసులు మమ్మల్ని వేటకుక్కల్లా వేటాడుతూ ఉంటారు. మేము ఊళ్ళల్లో ఉండలేము. అందుకే అడవుల్లో ఉంటున్నాం. అడవుల్లో ఉంటూనే మా కార్యక్రమాలను కొనసాగిస్తాం. భూస్వాముల దౌర్జన్యాలనుండీ రైతు కూలీలనూ, యజమానుల దోపిడీ నుండి కార్మికులను రక్షించడమే మా ధ్యేయం. కార్మిక, కర్షక సంక్షేమమే మా లక్ష్యం. దోపిడీదారులను ఖతం చేయడమే మా వృత్తి"

మొదట మాట్లాడిన దళనాయకుడు నెమ్మదిగా అందుకున్నాడు.

"అందుకు మాకు మీ సాయం కావాలి"

"ఏం చెయ్యమంటావన్నా" అన్నాడు ఉత్తారెడ్డి.

"మొదటిది మా ఆచూకీ పోలీసులకు చెప్పకూడదు. రెండవది మాకు కావలసిన నిత్యావసర వస్తువులను మీరు అందజేయాలి. ఊరికేకాదు. డబ్బిస్తాం. నూనెలు, కిరసనాయిలు, బియ్యం, గోధుమపిండి, పప్పులు మొదలైనవి మాకు మీ పల్లెల ద్వారానే అందాలి"

జనం ఆలోచనలో పడ్డారు. ఇలాంటి సాయం చేయవద్దనే మొన్న పోలీసులు హెచ్చరించింది.

పెద్దిరెడ్డి ఇలా అన్నాడు..

"మీరంతా బాగా చదువుకున్నవాళ్లు. న్యాయమూ, అన్యాయమూ తెలిసినవాళ్లు. కోర్టులూ పోలీసులు చేయనిపని చేస్తా ఉండారు. మీకు సాయం చేయవలసిందే. మొన్ననే పోలీసోళ్లు ఇదే రచ్చబండ మీద మమ్మల్ని ఎచ్చరించి పోయినారు. మీకు సహాయం చేస్తే బొక్కలో తోస్తాం అన్నారు. శిక్ష వేయిస్తాం అన్నారు"

భాస్కరరెడ్డి ముందుకొచ్చాడు.

"అన్నా మీరు బీదోళ్ళకోసం పడరాని పాట్లు పడతా ఉండారు. ఇండ్లు వదిలేసి అడవుల్లో తిరగతావుండారు. అట్లాంటి మీకు మేము ఏ విధంగానూ సాయం చెయ్యలేకుండా ఉండాం. ఆ మాట అనడానికి మాకే సిగ్గుగా ఉంది. ఇది చిన్నపల్లె. ఈ రోజే కాదు, ఏ నాటికీ మీరు మా పల్లె పైన ఆధారపడితే మీ పనులు సాగవు. ప్రస్తుతానికి కొన్ని రోజులకు సరిపడా కొన్ని సరుకులు ఇచ్చుకుంటాం. రైతులం.. మేము మీ దగ్గర డబ్బు తీసుకోము. శక్తి తక్కువ. ఇంతకు మించి ఏమీ చేయలేం" అన్నాడు ఆప్యాయత ఉట్టిపడేలాగా.

"మీరు ఈ అడవిలో ఉన్న సంగతి మా గొంతుమీద కత్తిపెట్టి అడిగినా ఎవరికీ చెప్పం" అన్నారు కొందరు.

నక్సలైట్లు ఏమీ మాట్లాడలేదు. ఒకరి మొగం ఒకరు చూచుకొని ఏవో సైగలు చేసుకున్నారు.

పది నిమిషాల్లో కొన్ని ఇండ్లనుండి సరుకులు వచ్చాయి. వాటిని నక్సలైట్లు పెద్ద సంచులలోనికి సర్దుకున్నారు. విప్లవ గీతాలు పాడుకుంటూ వెళ్లిపోయారు.

ఊళ్ళో వాళ్ళందరూ నిస్సత్తువగా రచ్చ బండ మీద కూర్చుండిపోయారు.

"మొన్నేమిరా అంటే పోలీసోళ్లు వొచ్చి బెదరగొట్టి పోయిరి. ఈ పొద్దేమిరా అంటే ఈ అన్నలనేటోళ్ళు వొచ్చి మంచి మాటల తోనే అదరగొట్టి పోతావుండారు" అన్నాడు ఈడిగ కృష్ణయ్య.

"వాళ్ళకు భయపడి సచ్చేదా, వీళ్ళకు భయపడి సచ్చేదా. ఈ ఇరుపోటుతో ఎట్లా సచ్చేది" అన్నాడు మునసామి.

"నేనొక మాట చెప్తా వినండి. ఎవరూ అడవిలోకి శానాదూరం పోవద్దు. అన్నలె వరైనా కనబడితే దూరంనుండి వచ్చే యండి. వాళ్ళు కనబడినారని ఎవరితోనూ అనొద్దు" అన్నాడు భాస్కరరెడ్డి.

"అంతే- అదే మంచిపని. మనకెందుకొచ్చిన పీడ" అన్నారందరూ.



**10** ఆ రోజు పొద్దున్నే రాఘవరెడ్డి సంతకు వెళ్ళిపోయాడు బండి కట్టుకొని.

అతడు అలా పోయిన అర్ధగంటకు ఉదయమాణిక్యం నుండి ఇద్దరు మగవాళ్లు, ఇద్దరు ఆడవాళ్ళు బండిలో వచ్చి దిగారు. వాళ్ళు వాళ్ళ అబ్బాయికి సీతనిమ్మని అడగడానికి వచ్చిన వాళ్లు. అంతకుముందే ఒకసారి పిల్లవానితో సహా వచ్చి అమ్మాయిని చూచి వెళ్లినవాళ్ళే.

పలకరింపులయ్యాక అందరూ హాల్లో కూర్చున్నారు. జాకనమ్మ హడావుడిగా వంట చేస్తూ ఉంది. సీతకు ఆ పనీ, ఈ పనీ పురమాయిస్తూ ఉంది. సీత మొగం గంటుపెట్టుకొని అమ్మ చెప్పిన పనులు చేస్తూ ఉంది. వచ్చిన వాళ్లకు మర్యాద చేయాలి కదా! కుటుంబ గౌరవం చూసుకోవాలి కదా! తాను ఒప్పుకుంటేనే కదా పెండ్లి జరిగేది. తాను ఎట్లాగూ ఒప్పుకోదు. ఇంక భయమెందుకూ?

పిల్లవాని తండ్రి కొండ్రెడ్డి ముందుగా మాట కలిపాడు.

"మేమొచ్చిపోయి మూణ్ణెల్లపైన అయిపోయె. అప్పుడే వచ్చి ఏ మాటా అడుగుదామనుకొంటిమి. మావాడే నిదానించమనె. అప్పటికి మాకుండింది ఒక పూరిల్లే. ఈ మూడు నెలల్లో పూరింటి ముందర రెండు రూములు పెట్టి ఒక పెంకుటిల్లుని వేసుకుంటిమి. ఆ పనిలో ఉండి తీరిక లేకపోయె. ఇప్పుడు మావాడు తొందర చేస్తా ఉండాడు. ఏ మాటా తెలుసుకొని రండి అంటా ఉండాడు"

"నేనూ అదే మాట్లాడతా వుండా. బిడ్డ పెండ్లికి ఇప్పుడేమిటి తొందర, ఇంకొక సంవత్సరం పోనీ అంటా వుండారు మావాళ్లు" అన్నాడు పెద్దిరెడ్డి నసుగుతూ.

"ఏం? బిడ్డకు ఇంకా పెండ్లీడు రాలేదనుకుంటా ఉండారా? కన్నోళ్ళకు వాళ్ళ బిడ్డలు ఎప్పుడూ పసిబిడ్డలే. చూచేవాళ్ళకు కదా తెలిసేది" అంది కొండ్రెడ్డి భార్య.

'నేను పసిబిడ్డనుకాక ముదిరిపోయినదానిగా కనబడతా ఉండానా నీకంటికి' సీత గొణుక్కుంది.

"ముందు కాలంలో ఆడబిడ్డలు ఈ ప్రాయానికి బిడ్డ తల్లులైపోతా ఉండ్రి"

'మూలకూచోని ఏడస్తావుండ్రి' అనుకుంది సీత.

"ఇప్పుడు నాగరికం ముదిరిపోయింది. ఆడబిడ్డలూ ముదిరిపోతా ఉండారు."

'అవును నేనూ ముదిరిపోయినాను, పని కిరాను. ఇంక ఇంటికి దయచెయ్యండి' సీత స్వగతం.

"మొగపిలకాయలూ ముదిరిపోతా ఉండారు."

'నీ కొడుకు ముదిరిపోకుండా సూసుకో'

"మావానికి అప్పుడే ఇర్వై అయిదుదాటి ఇర్వై ఆరులో పడింది"

'ఇర్వై ఆరులో కాకపోతే అర్వై ఆరులో పడనీ. మాకేమి?'

"ఇంక నిలిపేదిలేదు. మాఘమాసంలో చేసెయ్యాల" అంది కొండ్రెడ్డి భార్య.

'మాఘమాసం దాకా ఎందుకూ? రేపే చేసెయ్యండి. ఎవరు ఒద్దంటా ఉండారు?' అనుకుంది సీత.

"అయ్యావారి దగ్గర పేరుఫలాలు చూస్తిమి. ఫస్టుక్లాసుగా ఉందన్నాడు అయ్యావారు. ఈ పాప పేరు సీత. మావాని పేరు చెంగల్‌రెడ్డి. ఇద్దరికీ గుట్టమే వస్తుందట" అన్నాడు కొండ్రెడ్డి.

'నీ కొడుక్కు గాడిద రాదూ' అనుకుంది మనసులో సీత.

"అయ్యావారు ఆ మాటంటే మంచిదే కదా. కానీ చూద్దాం. ఇప్పుడేమి తొందర" అన్నాడు పెద్దిరెడ్డి.

"చూద్దామంటే కాదు. మీరు ఎవరెవ రుతో మాట్లాడుకోవాల్నో మాట్లాడుకోండి, మా ఇల్లూ వాకిలీ, చేనూ చెట్టూ చూడాల నుకుంటే వచ్చి చూసుకోండి."

"మడి కలుపులు తీస్తా ఉండాము. అయిపోనీ వస్తాము"

"ఒచ్చి చూసుకోని మాకు ఏ మాటా బిరీన చెప్పల్ల"

"భోజనానికి లెయ్యండి. కడుక్కోని రండి" అంది జానకమ్మ.

భోజనాలు అయిన తరువాత ఒక గంట సేపు ఆ మాటా, ఈ మాటా మాట్లాడు కొని వాళ్లు బండి కట్టుకొని వెళ్లిపోయారు.

వాళ్లు వెళ్లిన గంట తరువాత రాఘవ రెడ్డి సంత నుంచి తిరిగొచ్చాడు. ఒక మూట యూరియా, నాలుగు కేజీల వేప పిండి తెచ్చి అరుగుమీద దించాడు.

★ ★ ★

మరుసటిరోజు ప్రొద్దున్నే ఆకుతోటలో తమలపాకు తీగలను జంబుపాయలతో ఎగగట్టుతూ ఉన్నాడు రాఘవరెడ్డి. పెద్ది రెడ్డి జానకమ్మా చేనిలో పెసరకాయలూ, అలసంద కాయలూ కోసుకుంటున్నారు.

రాఘవరెడ్డికి సీత చద్దన్నం తెచ్చింది. ఇద్దరూ ఆకుతోటలోనే కూర్చున్నారు.

"ఒకపక్క కొంపలు మునిగిపోతావుంటే చీమకుట్టినట్లు కూడా లేదు" అంది సీత.

'ఏం జరిగింది' అన్నట్లు చూచాడు రాఘ వరెడ్డి తినడం ఆపి.

"నిన్న ఉదయమాణిక్యం వాళ్లు వచ్చి పడినారు ఇంటి మింద"

"ఏమంట?"

"ఆc! కడుపు మంట. ఏం మనిషివి నువ్వు? ఉదయమాణిక్యమోళ్లు ఎందుకొ చ్చేదీ నీకు తెల్దా. వాళ్ల పిల్లోడికి నన్నడగ నొచ్చినారు. ఏం చెప్తారు? ఎప్పుడు చేస్తారు?" అని గట్టిగా కూచున్నారు.

"అప్ప ఏంజెప్పె?"

"మీ పల్లెకొచ్చి, మీ ఇల్లూ వాకిలీ చూచి, ఆనక ఏ సంగతీ చెప్తామని చెప్పె. బిరీన వచ్చి చూచుకోని ఏదో ఒక మాట చెప్పండి అని వాళ్లు ఎల్లిపోయిరి."

రాఘవరెడ్డి ఏమీ మాట్లాడలేదు. చేతిలో అన్నం చేతిలోనే ఉండిపోయింది. కళ్లు ఎక్కడో చూస్తున్నాయి.

"ఇంటి ఆడబిడ్డ ఎనకాల మంచి ఆస్తి అని వాళ్ల ఆశ. గవర్నమెంటు ఉద్యోగం సుఖజీవనం అని మావాళ్ల సూపు. నువ్వేమో బెల్లంకొట్టిన గుండ్రాయి మాదిరి కదలవు. పలకవు"

రాఘవరెడ్డి చేతిలో ఉన్న అన్నం నోటిలో వేసుకొని మింగేసి కాస్త దూరంగా ఒంగి చెయ్యి కడుక్కొని ఆకుతోట నిచ్చె

నకు అనుకొని కూర్చున్నాడు.

"మొన్ననే చెప్పినా. నువ్వనుకున్నట్లు జరగదు. ఆ ఆశ ఒదులుకో" అన్నాడు రాఘవరెడ్డి కళ్లు మూసుకొని. ఆ మాటలు అతని నోటినుండి చాలా బరువుగా వచ్చాయి. మరణశయ్య మీద ఉన్నవాని కడపటి మాటలంత నీరసంగా ఉన్నాయి.

"నేనూ మొన్ననే చెప్పినాను కదా.. జరిగితే అట్లనే జరగల్ల. వేరే మాదిరి జరగ్గూడదు. నా ఆశ తుంచొద్దు అంటిని కదా" అంది సీత మొండిగా.

"చెప్తా ఉంటే నీకు అర్థం కాలేదే.. నేనెవరిని? మీ ఇంట్లో జీతగాణ్ని, అట్లాంటి జీతగాడు యజమాని కూతుర్నే ఆశిస్తే ఊళ్లోవాళ్లు నవ్వరూ? నా మొగాన ఉమ్మెయ్యరూ? " అన్నాడు రాఘవరెడ్డి మెల్లగా.

"చాల్లే, గమ్మునుండు. మా అమ్మగానీ, మా నాయనగానీ ఏనాడైనా నిన్ను మా జీతగాడు అన్నారా? మా రాఘవుడు, మా పిలగాడు అనే కదా చెప్పుకుంటా వుండారు. ఊళ్లో ఎవరైనా నిన్ను పెద్దిరెడ్డోళ్ల జీతగాడు అంటా ఉండారా? పెద్దిరెడ్డోళ్ల రాఘవరెడ్డి అనేకదా అంటా ఉండారు. పెద్దిరెడ్డి అనేది నీ ఇంటిపేరు మాదిరి కలిసిపోయింది కదా? "

రాఘవరెడ్డి రెండు చేతులతో తన తల పట్టుకొని అటూ ఇటూ విదిలించుకుంటూ- "సీతా.. నీకెట్ల చెప్పేది? ఎట్ల చెప్పితే నీకర్థమౌతుంది? మీ అమ్మా, నాయనా, ఊళ్లోవాళ్లూ నన్ను ఎంత ఇదిగా చూస్తే మట్టుకు నేను నేను కాకుండా పోతానా? మీతో సమానమైపోతానా? దిక్కూ దివాణమూ లేనివాణ్ణి. మీ నాయన ముందర నిలబడి 'అయ్యా నీ కూతుర్నిస్తావా? ' అని ఎట్లా అడగమంటావు. ఏ నోరు పెట్టుకొని అడగమంటావు" అన్నాడు.

"ఎట్లె అడగతావో, అడిగిస్తావో నాకు తెల్దు. నాది ఒకటే మాట. అంతే" అంది సీత దృఢనిశ్చయంతో.

"ఎవరికైనా ఈ సంగతి చెప్పి 'అయ్యా మీరు పోయి పెద్దిరెడ్డిని అడగండి' అంటి ననుకో. వాళ్లు మీ నాయనను అడగరు. నా నోట్లో ఇంత గడ్డి పెడతారు. 'ఏంరా... నాలుగు నెలలు అరువుగా తిండి పడేటప్పటికి ఒళ్లు కొవ్వు పట్టిందా? పెద్దంతరం, చిన్నంతరం మరిచి పోయినావా? ' అని తిట్టరూ. నీ ఆశ చంపుకో, నన్ను ఆశ పెట్టి చంపొద్దు. ఏ జన్మలో మనము ఏమిగా ఉంటిమో ఈ జన్మలో ఇక్కడ ఇట్లా కలుసుకుంటిమి. నీ మీద నాకూ, నా మీద నీకూ ఒక- ఒక ఇది ఏర్పడింది. ఈ ఇది ఇట్లే ఉండిపోనీ, ఇది ఇట్లే గ్యాపకం పెట్టుకుందాం. నువ్వెక్కడున్నా, నేనెక్కడున్నా అప్పుడప్పుడూ ఈరోజుల్నీ, మన స్నేహాన్నీ తలుచుకొని సంతోషపడదాం. ఈ జన్మకు ఇది చాలు. ఈ బతుకులు ఇట్లా తెల్లారి పోనీ. సంతోషంగా గడిచి పోనీ, ఆశలకు పోయి ఈ సంతోషం కూడా లేకుండా చేసుకుందామా. నాకు ఈ నీడ కూడా లేకుండా చేస్తావా? ఒద్దు ఒద్దు. ప్రేమ ఉంటే పెండ్లే చేసుకోనీ తీరాల్నా? మనసులో ఉంటే ప్రేమ ప్రేమ కాదా? " అన్నాడు రాఘవరెడ్డి.

అతని గొంతులో ఒణుకూ, గద్గదస్వరమూ అతడెంత వేదనను అనుభవిస్తున్నాడో తెలుపుతూ ఉన్నాయి. ఎంత నిగ్రహం, ఎంత నిర్వేదం ఆ హృదయాన్ని అణచివేస్తున్నాయో తెలుస్తూ ఉంది.

"ఈ రామాయణమంతా నువ్వు ఆనాడే సదివినావు. దాంతో నాకు పనిలేదు. నా తీర్మానం నేను చెప్పినా. బతికితే నీతోనే బతకతా. కాదంటే లేదంటే నేను.. నేను లేదనుకో. ఆడపిల్లను ఇంకా ఎట్లచెప్పేది? " చివరి మాటలు పలికేటప్పటికి సీత కళ్లలో నీళ్లు చిమ్మాయి. ఏడుపు తోసుకొచ్చింది. రెండు చేతులతో మొగం కప్పుకొని రాఘవరెడ్డి ఒడిలో వాలిపోయింది.

రాఘవుడు సీత వీపుమీద ఒక చేయీ,

తలమీద ఒక చేయీ పెట్టి నిమురుతూ అలాగే ఉండిపోయాడు. మెల్లగా సీత తలను లేవనెత్తి, కళ్లలోకి చూస్తూ "సీతా.. సీతా.. నాలో ఏముందని నీకు నాపైన ఇంత ప్రేమ. ఎందుకు నాపైన నీకింత పిచ్చి? " అన్నాడు.

సీత తల వంచుకొనే అంది.

"నాకు కావలసిందేందో అది వెదుక్కుంటా ఉండా. అది నీతోనే ఉందని తెలుసుకున్నా. అందుకే అంతగా.."

కాసేపాగి కాస్త వెనక్కి జరిగి రాఘవరెడ్డిని పైనుండి క్రింది వరకూ పరిశీలనగా చూచి కళ్లు వాల్చుకొని తనలో తాను అనుకుంటూ ఉందో బయటికి అంటూ ఉందో తెలియని స్వరంతో ఒక మైకంలో మాట్లాడుతున్నట్లు అనసాగింది.

"ఆనాడు నేను ఏ ఇండ్లోళ్లని అడిగినప్పుడు రెడ్లమే అంటివే. అప్పుడే అనుకున్నా రోషంగల రెడ్ల పిల్లోడివని. మా నాయన దగ్గర కపిలబాన అందుకుంటివే.. అప్పుడే అనుకున్నా నువ్వు మట్టూ మర్యాదా తెలిసిన తలిదండ్రుల దగ్గర పెరిగిన పిల్లోడివని. ఈడిగ కిష్టయ్య కోడలిని, నొప్పులెత్తుకున్న నిండు గర్భిణీని నువ్వొక్కడివే బండిలో ఏసుకొని నైరబైలుకు ఎలబారి, దోవలోనే కాన్పైపోతే అన్నీ నువ్వే సమాళించుకొని తల్లీ బిడ్డల్నీ భద్రంగా ఇల్లు చేర్చితివే- అప్పుడే అనుకున్నా మనసుండే మంచి మనిషివనీ, ఎట్టాంటి కష్టాన్నైనా తట్టుకొని నిలబడే ధైర్నస్థుడివని. నేను నేరేడు పండ్లకు ఆశపడి తేనీగల చేత కుట్టించుకొని నాలుగు రోజులు పండుకున్నప్పుడు నువ్వు నేరేడు పండ్లు తెచ్చి నానెత్తిన కుమ్మరిస్తివే - అప్పుడే అనుకున్నా నువ్వు పెండ్లాం మనసెరిగి మసులుకొనే మొగుడివని. అందుకే- అప్పటి నుండి.. నాకు.. నువ్వంటే.." ఇక మాట్లాడలేక మోకాళ్లపైన ముఖం వాల్చుకొని కూర్చుండిపోయింది.

కొంతసేపు మౌనంగా ఉండి "అయితే ఇప్పుడు నన్నేమి చేయమంటావు" అన్నాడు రాఘవుడు మెల్లగా.

సీత చటుక్కున తల పైకెత్తి చూచింది.

ఈ మాట అన్నది ఇతడేనా- రాయి కరుగుతూ ఉందా- అన్నట్లు చూచింది. అతని మాటలో, స్వరంలో కాస్త సానుకూలత కనబడుతూ ఉంది. ఎట్లా ముందుకు వెళ్లాలో తెలియక సందిగ్ధంలో ఉన్నాడన్న మాట. దారి తెలిస్తే ముందుకెళ్లడానికి సిద్ధమేనన్నమాట.

సీత కళ్లలో ఒక మెరుపు తొంగి చూచింది. కళ్లలో కొంటెతనం కూడ దోబూచులాడింది.

"ఎట్టాంటి మొగోడు దొరికినాడమ్మా నాకు. అది కూడ నేనే చెప్పాల్నా. నీ స్నేహితులుండారు కదా. జగన్నాథరెడ్డి, పుల్లారెడ్డి, ఇరగంరెడ్డీ. వాళ్లను పట్టుకో. ఏదో ఒక సందు చూచుకొని మా నాయన దగ్గర నిన్నూ, నీ పనితనాన్నీ, నీ బుద్ధిమంతనాన్ని పొగడమను. మా నాయన 'ఔను, ఔను' అంటూ వుండే సమయం చూచి, 'ఇట్టాంటి నమ్మకమైనోడు కడల్లకాలం మీ ఇంట్లో ఉంటే మీకే మంచిది కదా' అని చెప్పమను. ఇట్లా మాటలు కొంచెం జరిగనంక 'సీతనిచ్చి పెండ్లి చేస్తే రాఘవరెడ్డి మీ దగ్గరే ఇల్లటం ఉండిపోతాడు. కూతురు కళ్ల ఎదురుగా ఉంటుంది

---

**కొత్తగాలి...**

బ్యాంకులో డబ్బు
ఇంటి దగ్గర తల్లి
మూలుగుతున్నారు!
సంపద స్పందనే కానీ
మానవ స్పందన లేదు

– గుడిమెట్ల, అరసవిల్లి

---

కదా'అని చెప్పమను. ఇంటికాడ మిగతా సంగతులు నేను చూసుకుంటా. ఏమి? బుఱ్ఱకెక్కిందా" అని రాఘవుని బుగ్గమీద సుతారంగా ఒక పోటుపొడిచి వెళ్లిపోయింది, తిరిగి తిరిగి చూస్తూ సీత.

★ ★ ★

రెండ్రోజుల తరువాత ఒకనాడు ప్రొద్దున్నే జానకమ్మ ఒక అరుగుమీద రాగులు విసురుకుంటూ ఉంటే మరో అరుగుమీద పెద్దిరెడ్డి ఎద్దులకు మెడతాళ్లు పేనుకుంటూ కూర్చున్నాడు. రాఘవరెడ్డి బావి దగ్గర కపిలె తోలడానికి వెళ్లిపోయాడు. సీత వంట పనుల్లో ఉంది.

సేద్యం పనులు కొంచెం తెరపిన పడ్డాయి. ఆకుతోటకూ చెరుకుతోటకూ కపిలె తోలుకుంటే చాలు. వరిమడికి చెరువు నీళ్లు పారుతున్నాయి. ఇక చేనికి వర్షాలే ఆధారం. చేయాల్సిందేమీ లేదు.

"ఏం మామా.. ఏం చేస్తావుండారు? " అంటూ వచ్చాడు భాస్కరరెడ్డి.

పెద్దిరెడ్డి బీడీ అంటించుకొనే ప్రయత్నంలో ఉండడం వల్ల పలకలేదు.

జానకమ్మే "రారా భాస్కరా... రా... కూర్చో ఈ పొద్దు పనేమీలే. ఊరికే కూసుంటిమి" అంది.

భాస్కరరెడ్డి పెద్దిరెడ్డి పక్కన కూర్చొని ప్రక్కనే ఉన్న బీడీకట్ట నుండి ఒక బీడీతీసి పెద్దిరెడ్డి అందించిన అగ్గిపెట్టె తీసుకొని అంటించుకున్నాడు.

"ఎక్కడికిరా ఎలబారినావు? " అంది జానకమ్మ.

"మన బాయికాడికే అక్కా. నాలుగు తమలపాకులు గిలుకొచ్చుకుందామని ఎలబారితి. ఇక్కడ మీరిద్దరూ తీరుబాటుగా కూచోనుంటే పలకరించి పోదామని వస్తి. రాఘవుడు ఏడీ? "

"కపిలె తోలేదానికి పోయినాడు"

"నీళ్లు కట్టేదెవరు? "

"ఆ పిలగాడే చేసుకుంటాననె. పొడువు కాలువలు కదా. కపిలె నిలిపి పోయి మడవ తిప్పేసి మల్లా ఎడగాలవ పడకుండా కపిల తోలుకుంటా. మీరెవురూ ఒద్దులే.. అనేసి పోయినాడు."

"ఎట్లైనా రాఘవుడు మంచిపనోడే. శ్రద్ధగా సేద్యం చేసుకుంటా ఉండాడు. అడుగడుక్కా మనం చెప్పాల్సిన పని లేకుండా యెప్పుడెప్పుడు యా యా పని చెయ్యాల్నో ఆ పని చేస్తా ఉండాడు."

"ఆ పిలగాడొచ్చినంక మీ మామ పని కొంచెం సులవైపోయిందిరా. అన్నీ ఆ పిలగాడే సొంతమనిషి మాదిరి సూసుకుంటా ఉండాడు" అంది జానకమ్మ తృప్తిగా.

"మొన్న ఉదయమాణిక్యమోళ్లు వచ్చుండ్రంటనే.. ఏమి సంగతి? "

"నీకు తెలిసిన సంగతేకదా! మన సీతను అడిగేదానికి వొచ్చినారు. మూడు నాలుగు నెలలకు ముందు వాళ్లు వొచ్చింది నీకు తెలుసుకదా. ఆ పొద్దు నువ్వూ, మీ అమ్మా వచ్చుంటిరి కదా? పిలగాణ్ని మీరు చూచినారు కదా? "

"ఎవరు? ఆర్టీసీ డ్రైవరుగా పనిచేస్తా వుండే పిలగాడా? "

"ఆc... ఆ పిలగానికే. వాళ్ల నాయన పేరు కొండ్రెడ్డంట. ఎప్పుడైనా నెరబైలు సంతలో కనబడితే మీ మామతో ప్రియంగా మాట్లాడతాడంట. ఈ మూడు నెలల్లో ఇంటి ముందర ఇంకొక పెంకు టిల్లు కట్టుకున్నారంట. పిలగాడు తొందర చేస్తా ఉండాడంట. అయ్యావారి దగ్గర పేరుఫలాలు కూడా అడిగినారంట. బాగుందని చెప్పినాడంట. మాఘమాసంలో పెండ్లి చేసెయ్యాలంట. ఏమంటారు? ఎప్పుడు మాట కట్టుకుందామా అని ఒకటే తొందర పెట్టేసిపోయిన్రు" అంది జానకమ్మ. పెద్దిరెడ్డి విశేషంగా మాట్లాడడు.

"మంచి సంబంధమే. బిడ్డ సుఖపడుతుంది, ఇవ్వచ్చు" అన్నాడు భాస్కరరెడ్డి.

పెద్దిరెడ్డి కొద్దిగా తలాడించాడు. జానకమ్మ ముఖంలో సంతోషం వెల్లివిరిసింది.

"మేమూ అదే ఆలోచిస్తా ఉండాము. మనమందరమూ వాళ్ల ఊరికిపోయి వాళ్ల ఇల్లూవాకిలీ, మంచీ చెడ్డా చూసేసి రావల్ల. ఏమంటావు?" అన్నాడు పెద్దిరెడ్డి.

"భాస్కరా! ఫలానా దినం అనుకొని ముందుగా వాళ్లకు చెప్పి పంపుదాం. అందరం పొయ్యొద్దాం, ఏం?" అంది జానకమ్మ సంబరపడిపోతూ.

"దానికేం అట్లనే పోయొద్దాం. సీతకు బిరీన పెండ్లిచేసి పంపించేస్తే మీకు బరువు తగ్గినట్లుంటుంది. దిగులు తీరిపోతుంది" అన్నాడు భాస్కరరెడ్డి.

భాస్కరరెడ్డి మాటలు జానకమ్మకు నచ్చాయి కానీ- 'పంపించేస్తే బరువు తగ్గినట్లుంటుంది' అనే మాట వినేటప్పటికి మనస్సు కలుక్కుమంది.

భాస్కరరెడ్డి మాటలు లోపలి నుండి వింటున్న సీతకు ఒళ్లు మండుతూ ఉంది. ఈ పెద్దమనిషి అమ్మా నాయనలకే వంత పాడతావుండాడు. కోపంతో సీత చెక్కర వేయకుండా కాఫీ చేసి తెచ్చి భాస్కరరెడ్డి ప్రక్కన పెట్టింది.

భాస్కరరెడ్డి కాఫీ కాస్తా చప్పరించి, "ఏంమే చెక్కెరెయ్యకుండా ఇస్తావుండావు. నేనిక్కడ నీపెండ్లి మాట్లాడతావుండా.. తెలుసునా?" అన్నాడు భాస్కరరెడ్డి.

"అందుకే నీకీ కాఫీ ఇచ్చింది"

"చెక్కెర లేకుండానా?"

"నీ మాటలు తీయగా ఉండాయి చాలదూ, చెక్కెర కూడా కావాల్నా?" అంటూ కాఫీగ్లాసు వాపసు తీసుకెళ్లింది, చెక్కెరవేసి తేవడానికి.

భాస్కరరెడ్డి నవ్వుకున్నాడు.

సీతకు ఈ సంబంధం ఇష్టం లేదని ఆమె మాటల్లో స్పష్టంగా తెలిసిపోతూ ఉంది పెద్దిరెడ్డికీ జానకమ్మకూ. కాని

ఎందుకిష్టం లేదో అర్థం కావడం లేదు. ఏమైనా కానీ మంచి సంబంధం వదల బుద్ధి కావడం లేదు. నిదానంగా ఒప్పించ వచ్చు అన్న ధీమా- మన మాటను మించి పోతుందా అన్న నమ్మకం వారిది.

"అదేరా నేనూ, మీ మామా అనుకుంటా వుండేది. అంతా బాగా ఉంటే మాఘమా సంలో చేసేద్దామని" అంది జానకమ్మ.

"సీత ఎల్లిపోయిం తరువాత- మల్ల మీరేం చేస్తారు? " అన్నాడు భాస్కరరెడ్డి నిదానంగా.

ప్రశ్న అర్థంకానట్లు చూచారు ఇద్దరూ. సీత కాఫీలో చెక్కెరవేసి తెచ్చింది.

"అదే- సేద్యమూ, ఇల్లూ, గొడ్డూ గోదా

## కొత్తగాలి...

**ఇప్పటి వరకు**
**ఇల్లు, స్థలము, గర్భమూ**
**ఇకపై మనసు కూడా**
**అద్దెకు..!**

*- గంపా శ్రీదేవి,*
*సింహాచలం*

మీరెట్ల సూసుకుంటారూ అని"

"ఎట్ల సూసుకొనేదేమి? ఇప్పుడు సూసు కుంటా ఉండ్లా. అట్లనే" అంది జానకమ్మ.

"ఎల్లకాలమూ ఇట్లే జరుగుతుందా? ముందుండిన శక్తీ, ఓపికా, ఉషారూ ఇప్పు డుండాయా? ఇంక ముందు జరిగే కాలా నికి ఇంతమాత్రమైనా ఉంటుందా? సరిగ్గా శెనిగ్గింజలేసేటప్పుడు నాలుగు దినాలు పండుకుంటివి. మళ్లు నాటేటప్పుడు మూడు దినాలు పడకేస్తివి. రాఘవుడుండ బట్టి సరిపాయె. అదునుకు గింజలూ పడి పాయె. పైరూ నాటేస్తిరి. ఆ పిల్లగాడే లేకుంటే గింజలకు అదును తప్పిపో య్యుండు. వరినారు ముదిరిపొయ్యుండు. రాఘవుడు ఎల్లకాలమూ మీ ఇంట్లో ఉంటాడా? ముందుకాలానికి ఆలోచన చెయ్యండి"

దానికి వాళ్లు ఏమని సమాధానం చెప్ప గలరు? మౌనంగా ఉండిపోయారు.

"అట్లా అని బిడ్డకు పెండ్లి చెయ్యకుండా ఇంట్లోనే పెట్టుకుంటామా..ఏనాటికైనా ఒక నాటికి పెండ్లిచేసి పంపవలసిందేకదా? " అంది జానకమ్మ.

"పిల్ల పెండ్లి విషయం కాదు నేను మాట్లాడేది. మీ బతుకుల్ని గురించి. సరే, మీకు ఓపికున్నంతకాలమూ కౌలుకో, గుత్తకో ఇచ్చి చేసుకుంటారనుకో. లేవలేని కాలంలో అంతా అమ్మేసి కూతురింటికి ఎల్లిపోతారా? " అన్నాడు భాస్కరరెడ్డి.

"ఛ. బ్రతికినంతకాలమూ బ్రతికి కూతు రింట్లో చస్తామా? " అన్నాడు పెద్దిరెడ్డి.

"ఈ ఇంట్లోనే కట్టె కడతేరిపోవాల కదా? కూతుర్ని, అల్లుడినీ ఇక్కడొచ్చి ఉండమంటే ఉంటారా? "

"ఎట్లుంటారు? ఎవరి సంసారం వాళ్లది. ఆ పిల్లగాడికి ఉద్యోగం కూడా ఉంది. ఇక్క డుండి పొమ్మంటే ఎట్లా ఉంటాడు? " అంది జానకమ్మ.

"అట్ల ఉండేటోణ్ణి చూచి తెచ్చుకోవల్ల మరి? ఇంకెట్లా? " అన్నాడు భాస్కరరెడ్డి.

లోపలి నుండి సీత అంతా వింటూ వుంది. "అమ్మో! భాస్కరమామ బలే టోడు. తావు చూచి కొట్టినాడు దెబ్బ. తొలి తొలిగా మాట్లాడినప్పుడు తిట్టుకుం టూనే చేదుకాఫీ ఇస్తి. ఇప్పుడు తెలస్తా ఉండాది.. భాస్కరమామ నా పక్కనే మాట్లాడతా ఉండాడు. ఈసారి ఫస్టుక్లాసు కాఫీ పెట్టియ్యాల" అనుకుంది.

పెద్దిరెడ్డికీ, జానకమ్మకూ పాలుపోలేదు.

"అయితే ఏమీ చెయ్యమంటావు భాస్కరా? " అంది జానకమ్మ.

"ఉదయమాణిక్యమోళ్లకు వీలు పడదు

అని చెప్పేద్దామా?" అన్నాడు పెద్దిరెడ్డి.

"తొందరపడొద్దు. ఏమి చేయాల్నో ఇద్దరూ బాగా ఆలోచించండి" అనేసి భాస్కరరెడ్డి ఆకుతోటవైపు వెళ్లిపోయాడు.

పెద్దిరెడ్డీ, జానకమ్మా అరుగుమీదనే కూర్చుండిపోయారు. విస్రాయి తిరగడం లేదు. చేటలో రాగులు అలాగే ఉండిపోయాయి. ఇద్దరూ చర్చించుకుంటున్నారు, తర్కించుకుంటున్నారు. సరియైన సమాధానం దొరక్క గింజుకుంటున్నారు.

తోటలో తమలపాకులు కోసుకొని అర గంట తరువాత తిరిగి ఆ దారినే పోతున్న భాస్కరరెడ్డిని పిలిచాడు పెద్దిరెడ్డి.

"భాస్కరా నువ్వు చెప్పిందంతా బాగా ఆలోచిస్తా ఉండాము. ఈ సొత్తంతా సీతకూ దాని బిడ్డలకే దక్కాలంటే- సీత ఈ ఇంట్లోనే ఉండి ఈ ఆస్తిని అనుభవించాలంటే- మా కట్టెలు ఇక్కడే కడతేరిపోవాలంటే ఒకటే దోవ కనబడతా ఉండాది. ఎవర్నైనా మంచి పిలగాణ్ని చూచి ఇల్లటం తెచ్చుకోవాల. ఇది యాడా జరిగేదే. కొత్తేమీ కాదు. మొగబిడ్డలు లేనోళ్లు ఎంతమంది ఇల్లటం తెచ్చుకుంటూ ఉండలేదు? మనమూ తెచ్చుకోవచ్చు. అయితే వానికి మనమీద భయమూ, భక్తీ, అక్కరా ఉండల్ల. భూమిని నమ్ముకొనేవాడుగా ఉండల్ల. భూమిని అమ్ముకొనేవాడుగా ఉండకూడదు".

"అట్టాంటోడు దొరకద్దూ. దొరికినా మీరు చెల్లుకోగానే అంతా అమ్మేసి పెండ్లాన్ని పిలుచుకోనిపోయి వాళ్లోళ్లతో చేరిపోతే? అక్కడికి పోయినాక ఈ సొత్తూ సొమ్మూ వానిదై పోతుంది గానీ సీత అధికారం చెల్లుతుందా? ఎట్టాంటోడు కానీ తాను పుట్టి పెరిగిన తావున, తన వాళ్ల తావున ఉండాలనుకుంటాడు గానీ దూరంగా ఉండాలనుకుంటాడా? అయినా కొత్తోణ్ణి తెచ్చి ఇంట్లో పెట్టుకోవాలంటే వాడెట్టాంటోడో, వాని కడుపులో ఎట్టాంటి ఆలోచనలుండాయో మనకెట్లా తెలుస్తుంది?" అన్నాడు భాస్కరరెడ్డి.

"భాస్కరమామ అమ్మనూ, నాయన్నూ బాగా బెదరగొట్టి వలలోకి మల్లదోలతా వుండాడు" అనుకుంటూ సీత మంచి కాఫీ చేసి భాస్కరరెడ్డికిచ్చింది.

"ఈసారీ చక్కెర వెయ్యకుండా తెచ్చినావా?" అన్నాడు భాస్కరరెడ్డి నవ్వుతూ.

"పో మామా. అప్పుడేదో పొరబాటున మరచిపోయి చెక్కెర ఎయ్యకుండా తెస్తి. ఇప్పుడు కూడా అట్లనే తెస్తానా కొండంత మామకు" అంది.

"ఇప్పుడు బుద్ధొచ్చిందన్నమాట. ఇప్పుడు నేను కొండంతగా కనబడతా ఉండానా?"

"నువ్వు ఎప్పుడూ కొండంత మామవే. అయినా చెక్కెర లేని కాఫీ కూడా నీ కడుపులో తియ్యంగా మారిపోతుంది" అంటూ వెళ్లిపోబోయింది సీత.

"అవునవును ఆకుతోటకాడ అల్లా నేరేడు పండ్లు తినొస్తి. కడుపులో తియ్యంగుంది" అన్నాడు భాస్కరరెడ్డి.

సీత వెనుదిరిగి చూచింది.

భాస్కరరెడ్డి కళ్లెగరేశాడు. సీత సిగ్గుతో తలొంచుకొని నవ్వుతూ వెళ్లిపోయింది.

"అమ్మో మామకంతా తెలిసిపోయింది" అనుకొంది.

పెద్దిరెడ్డికీ జానకమ్మకూ ఈ సంభాషణలోని చమత్కారం అర్థం కాలేదు. ఇది నేరేడుపండ్ల కాలం కాదే. అయినా వాళ్ల ఆందోళనలు వాళ్లవి. ఈ విషయంపైన ధ్యాసలేదు.

"ఏమో దిక్కుతోచకుండా ఉంది భాస్కరా. మనకు బాగా తెలిసినవాడూ, మనల్ని బాగా చూసుకొనేవాడూ, మా తదనంతరం ఆస్తిని అమ్ముకొని పోకుండా ఇక్కడే ఉండేవాడూ కావాలంటే ఇంకా కొన్నాళ్లు వెతకాల" అన్నాడు పెద్దిరెడ్డి.

భాస్కరరెడ్డి మెల్లగా అన్నాడు.

"వెతికేది ఎందుకూ? దేవుడే తీసుకొచ్చి

నాడు. ఏదో చెడ్డకాలమొచ్చి ఇట్లా వొచ్చేసి నాడు కాని మంచి కుటుంబంలో పుట్టి నోడే. మన రాఘవునికేమయింది? సరికా పోడు. మా మేనమామ భార్యకు దూరపు సుట్టం. తల్లీదండ్రీ, తోడబుట్టినోళ్ళూ లేనోడు. మంచి పనిమంతుడు. నాలుగు నెలలుగా చూస్తవుండాము. ఒక్క చెడ్డ అలవాటూ లేదు. సొంత మనిషి మాదిరి పని చేసుకుంటా వుండాడు. తిరిగిపొయ్యే దానికి సొంతవూర్లో ఇల్లూ వాకిలీ లేదు. ఇక్కడే ఉండిపోతాడు. ఆస్తి, ఇల్లు మన బిడ్డ చేతిలోనే ఉంటది. ఆలోచించండి" అంటూ లేచి పోబోతూ వెనక్కితిరిగి "సీత కూడా ఆ పిలగాణ్ణి ఇష్టపడినట్లుంది. గమ నించండి" అని వెళ్ళిపోయాడు.

"ఇదేందిది! వీడు ఇట్లా చెప్పేసి పోతా వుండాడు" అంది జానకమ్మ ఆశ్చర్యం నుండి తేరుకుంటూ.

"అదే నేనూ ఆలోశిస్తా ఉండా" అన్నాడు పెద్దిరెడ్డి సాలోచనగా.

"నీకు గ్యాపకముందా ఒకనాడు మనం ఉదయమాణిక్యం పిలగాడి సంగతి మాట్లా డతా వుంటే 'నేనంత భారంగా ఉంటే ఆ బాయిలో దొబ్బేయండి పీడ వొదిలిపో తుంది' అనింది సీత. ఇంకొకనాడు నేను 'ఈ ఇల్లు, ఈ వూరు ఇడిసిపెట్టి యాడికీ పోను' అనింది. అప్పుడు నాకు అనుమాన మొచ్చె కాని మనబిడ్డ అట్లా తొందరప డేది కాదు. ఈ పిలగాడూ బుద్ధిమంతుడే, అట్ల ఏమీ ఉండదులే అనుకొని ఊరికే ఉండిపోతి. ఇంత దూరమొస్తుందనుకో లేదే. ఇప్పుడేం చేసేది దేవుడా?" అంది జానకమ్మ.

"ష్.. గమ్మునుండు. ఇప్పుడేమీ కొంపలు మునిగిపోలే. ఎందుకు రాగాలు తీస్తావు. ఒద్దనుకుంటే వానికి ఇవ్వాల్సిన దుడ్లు లెక్కకట్టి ఇచ్చేసి పొమ్మంటే పోతాడు. అదెంతసేపు."

"ఆ పిల్లగాడేమో పోతాడు సరే. ఈ పిల్లను పట్టేదెట్ల?"

"అదే నేనూ ఆలోశిస్తా ఉండా. ఇదొకటే కాదు. శానా సంగతులు ఆలోశించల్ల. భాస్కరుడు చెప్పిందంతా బాగా ఆలోశన చెయ్యి. భాస్కరుడు శానాదూరం, శానా సంగతులు ఆలోశన చేసినాడు. అవికూడ గమనించల్ల" అన్నాడు పెద్దిరెడ్డి.

ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు.

జానకమ్మ ఆలోచనలు ఈ విధంగా సాగుతున్నాయి.

"పిలగాడేమో బుద్ధిమంతుడే. సరికా పోడే. దూరపు సుట్టమే అయితేమట్టుకు తన ఇంట్లోనే జీతగాడుగా ఉండినవానికి బిడ్డనిస్తే ఊళ్ళోవాళ్ళకు చులకనైపోమూ. జానకమ్మ కూతురికి ఎక్కడా మొగుడు దొరకనట్లు జీతగానిచ్చి చేసింది అని నవ్వరూ? ఏమంత ఉపద్రవమొచ్చింది? ఈ సొత్తూ సొమ్మూ అంతా సీతకే కదా. మారాజులాంటి సంబంధం రాదూ?"

పెద్దిరెడ్డి ఆలోచనలు మరోవిధంగా ఉన్నాయి.

"సీతను వేరే తావున ఇచ్చిచేస్తే తమ తదనంతరం అల్లుడు భూమి బుట్రా అమ్మేసి పోతాడు. ఈ ఊర్లో కొన్నాళ్ళకు తమ పేరే గ్యాపకముండదు ఎవరికీ. రాఘవుణ్ణి ఇల్లటం పెట్టుకుంటే ఆస్తి అంతా సీత చేతిలోనే ఉంటుంది. ఊళ్ళో తన పీటకం నిలబడుతుంది."

"ఏమాలోశిస్తా వుండావు?" అంది జానకమ్మ.

"భాస్కరుడు చెప్పిందే ఆలోశిస్తా ఉండా. వాడు చెప్పింది కూడా సరే అని పిస్తా ఉంది."

"ఏంది? బిడ్డను జీతానికుండే.."

పెద్దిరెడ్డి తీవ్ర స్వరంతో అడ్డుపడ్డాడు.

"ఇదిగో మనం బిడ్డనిస్తామో, ఇవ్వమో అది వేరే సంగతి. రాఘవుణ్ణి సారిసారికీ జీతగాడు జీతగాడు అంటావుంటే నాకె ట్లనో ఉంది. కాపోడేంది, జీతగాడయ్యే

దేంది? కాపోడు ఎప్పుడూ కాపోడే- ఎప్పుడూ రెడ్డే. నువ్వుగానీ, నేనుగానీ ఎప్పుడన్నా రాఘవుణ్ణి జీతగాడు అన్నామా? రాఘవుడు మామూలు జీతగాడైతే ఇంటి వసారా రూము ఇచ్చేదానివా నువ్వు? ఊర్లో పెద్దోళ్ళు కూడా పెద్దిరెడ్డోళ్ళ రాఘవరెడ్డి అంటా ఉండారుగాని పెద్దిరెడ్డోళ్ళ జీతగాడు అంటావుండారా? వాని మొగంలో ఆ పౌరుషం ఉందే! ఆ తెంపు ఉండాదే! రోసం ఉండాదే! అవి వుంటే సాల్నే మొగోడికి లక్షణంగా బతికే దానికి. ఆస్తే ఉండాల్సిన పనిలేదు. పాపం కర్మచాలక చిన్నప్పుడే తల్లినీ తండ్రినీ పోగొట్టుకుని చదువు సాలించి ఇట్లా వచ్చేసినాడే కానీ వాడికేం తక్కువే. ఇంకెప్పుడు జీతగాడు అనొద్దు" అన్నాడు.

"ఇదంతా నాకు కూడా అర్థమవుతా వుంది- కాని..." సాగదీసింది జానకమ్మ.

"నువ్వు నలుగురూ చులకనగా చూస్తారని ఆలోశిస్తావుండావు. ఇంటి గౌరవం పోతుంది అనుకుంటా వుండావు. మన గౌరవం కాదు మనం సూడాల్సింది. బిడ్డ సుఖం సూడాలి. బిడ్డ భద్రంగా ఉండే మార్గం చూడాల" అన్నాడు పెద్దిరెడ్డి.

చివరి వాక్యం జానకమ్మ మీద బాగా పనిచేసింది.

అవును. మన గౌరవంకాదు చూడాల్సింది. బిడ్డ భద్రంగా సుఖంగా బతికే మార్గం చూడాల.

రాఘవరెడ్డి కపిల విడిపించి ఎద్దులను తోలుకొని ఇంటికి వచ్చేశాడు.

పెద్దిరెడ్డి భోజనానికి కూర్చున్నాడు.

"ఇదో- అన్నం తిందువురా" అని పిలిచింది సీత రాఘవరెడ్డిని.

ఈ రోజు ఆ పిలుపులో ఏవో అర్థాలు గోచరించాయి జానకమ్మకు.

ముగ్గురూ భోజనానికి కూర్చున్నారు. సీత వడ్డిస్తూ ఉంది.

జానకమ్మ మూడు నాలుగు నెలలుగా రాఘవరెడ్డిని చూస్తూనే ఉంది. కాని ఈ రోజు ప్రత్యేకంగా అతని ప్రతి కదలికా, ప్రతి మాటా, చర్యా గమనించసాగింది. రాఘవునిలో ఎక్కడగానీ తాను జీతగాడి ననే చిన్నతనం కనబడలేదు. కంటికీ మన స్సుకూ నిండుగా కనబడుతున్నాడు. ఊళ్ళో సరికాపు యువకులైన జగన్నాథరెడ్డీ, పుల్లా రెడ్డీ ఎంత ఆత్మవిశ్వాసంతో, ఆత్మగౌర వంతో ప్రవర్తిస్తూ ఉన్నారో రాఘవరెడ్డీ అలాగే ప్రవర్తిస్తూ ఉన్నాడు. ఉదయమా ణిక్యం పిల్లవానిలో కనబడని ఆత్మీయత రాఘవరెడ్డిలో కనబడుతూంది. ఉదయ మాణిక్యం పిల్లవానిలో కనిపించిన అతి శయం ఈ పిల్లవానిలో కనబడడంలేదు. ఆమె మనస్సులో ఉదయమాణిక్యం పిల్ల వాని పటం క్రమంగా కరిగిపోతూ దాని స్థానంలో రాఘవుని రూపం నిలబడుతూ ఉంది. ఈ పిల్లవాడు తమవాడు అని పిస్తూ ఉంది. అందుకేనేమో తనకు తానుగా అతనికి తనింటి ముందరి గదిని శుభ్రంచేసి కేటాయించింది. జీతగాళ్ళకు గదులిస్తారా?

పెద్దిరెడ్డి కూడ పరిశీలిస్తున్నాడు. జీత గాడు అనే పదవి రాఘవరెడ్డి కులాభిమా నాన్నీ, పురుషాధిక్యతనూ క్రుంగదీయ లేదు. తలెత్తుకొని నిలిచే ఉన్నాయి. ఆ రెండింటినీ సీత గౌరవిస్తూ ఉంది. సుఖ సంసారానికీ, జీవితానికీ ఇది ముఖ్యమైన లక్షణం. దాంపత్యమూ, సంసారమూ సమరాసిగా నడవాలంటే మగవాడు ఏ కారణం చేతగానీ, ఎట్టి పరిస్థితిలోగానీ క్రుంగిపోకూడదు. ఆడది మగవాణ్ణి లోకు వచేసి చూడకూడదు అనుకున్నాడు.

ఇద్దరూ ఎంతలో ఉండాలో అంతలోనే ఉన్నారు. కానీ ఎలా ఉండాలనుకుంటు న్నారో అలా కూడా ఉంటున్నారు.

"చెరుకుతోటకు ఈ టైములో రవంత యూరియా తగిలించాలప్పా" అన్నాడు రాఘవరెడ్డి.

పెద్దిరెడ్డి "ఊ" అన్నాడు.

"మడికి కూడా రవంత కాంప్లెక్సు తగి లిస్తే పైరు బాగా ఏపుగా ఎదుగుతుంది."

జీతగాళ్ళు ఇవన్నీ ఆలోచిస్తారా? ఇలాంటి సలహాలిస్తారా? తాను ఎరువు తెచ్చి పడేసి నాలుగుసార్లు చెబితే చల్లు తారు. చెప్పకపోతే చూస్తూ ఊరుకుం టారు. చల్లేటప్పుడు కూడా తాను వెంట లేకపోతే పలచపలచగా చల్లుతారు.

"బండి కట్టుకోని నెరబైలుకుపోయి అదెంత కావాల్నో, ఇదెంత కావాల్నో తీసు కొచ్చేయ్" అన్నాడు పెద్దిరెడ్డి, బనీను జేబు లోంచి డబ్బులు తీసిస్తూ.

"పావడాలూ చినిగిపోయినాయి. రెడీమే డువి రెండు తీసుకురా" అంది సీత.

రాఘవరెడ్డి పెద్దిరెడ్డి వైపు చూస్తూ నిల బడ్డాడు అనుమతి కోసం. పెద్దిరెడ్డి రెండు నిమిషాలు ఆలోచించి "ఊ" అన్నాడు.

రాఘవరెడ్డి బండి కట్టుకొని వెళ్ళిపో యాడు పుల్లారెడ్డితో బాటు.

సాయంత్రం భాస్కరరెడ్డిని పిలిపించుకు న్నాడు పెద్దిరెడ్డి. భాస్కరరెడ్డి తల్లి మంగమ్మ కూడా వచ్చింది. అందరూ అరు గుమీద కూర్చున్నారు.

సీత హాల్లో ఏదో పనిచేస్తున్నట్లు నటిస్తూ వాళ్ళ మాటలు వినడానికి సిద్ధంగా ఉంది. ఇది తన భవిష్యత్తును నిర్ణయించే సమయం.

"పొద్దున్నుంచీ నేను, మీ అక్కా నువ్వు చెప్పిందాన్ని గురించి బాగా ఆలోచిస్తా ఉండాము. నాకైతే నువ్వు చెప్పింది బాగుందని మనస్సుకు తోస్తా ఉంది. మీ అక్కేమో ఎనుక తొక్కులు తొక్కతాఉంది. ఏమీ తెగజెప్పలే" అన్నాడు పెద్దిరెడ్డి భాస్కరరెడ్డితో.

సమాధానంగా మంగమ్మ అందుకుంది.

"యేమే జానకీ! ఎందుకే నువ్వు ఇంకా సందేహిస్తా ఉండేది? వాడు మన

కాపోడు కాడా"

"అదేం చిన్నమ్మా.. మీ వదినెకు దగ్గిర సుట్టమంటివి కదా" అంది జానకమ్మ.

"అవును! తెలుసుకదా. ఇంక సేద్యం నాద్యం చేతగాని వాడా?

"కండ్లార సూసి వంక అట్ల ఎట్లంట?"

"ఈసారి మీ ఎలిసేద్యమూ, మడిసేద్యమూ రాఘవుడే కదా చేసింది" అన్నాడు భాస్కరరెడ్డి.

"అవును కదా! వాని దగ్గర దొంగబుద్ధులూ! కంతిరీ బుద్ధులూ ఉండాయా?" అంది మంగమ్మ

"ఛ. ఛ. అగ్గి లాంటోడు" అంది జానకమ్మ నొచ్చుకుంటూ.

"అవును కదా, మీతోగానీ, ఊరోళ్ళతో గానీ మిడిమేలంగా మాట్లాడతాడా, జగడాలకు పోతాడా?"

"ఈనాటికీ ఆ పిలగాడు మా ముందర నిలబడి గెట్టిగా మాట్లాడింది లేదు" అన్నాడు పెద్దిరెడ్డి.

"ఏం?" అంది మంగమ్మ ప్రత్యేకంగా జానకమ్మ నుద్దేశించి.

"అణకువైన పిలగాడు" అందామె.

"ఉదయ మాణిక్యం పిలగాని కంటే మట్టంగా ఉండాడా?"

"పిల్లగాణ్ణి గురించి సొట్ట చెప్పేదానికి లేదు. లక్షణంగా ఉండాడు"

"ఉదయమాణిక్యం పిలగాణి పక్కన నిలబెడితే రాఘవుడే తేటగా ఉంటాడు" అన్నాడు భాస్కరరెడ్డి.

"ఇంకేందే నీకు దొబ్బుడాయి? కండ్లకద్దుకోని బిడ్డనిచ్చి, కండ్ల ముందర బెట్టుకోని సుఖంగా కాలం ఎల్లదోసుకోకుండా ఆలోశన జేస్తావుండావంట.. ఆలోశన. వానికి బిడ్డనిచ్చినంక మనమంతా వాని మనుషులం కామా? బిడ్డ మంచీచెడ్డలు చూసుకొనేదానికి ఊర్లో మేమంతా లేమా? ముందూ ఎనకాల బలగం ఉండేటోడు,

## ఏప్రిల్ -2010
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.

1. డి.భావన - వెంకటేశ్వరపురం, నెల్లూరు
2. కె.శ్యామల - గొడుగుమూరు, చిత్తూరు
3. పిశుపాటి దాక్షాయణి - బండ్లగూడ, హైదరాబాద్
4. ఆర్.జి.రామచంద్రన్ - మల్కాజిగిరి, సికింద్రాబాద్
5. అప్పల నరసింహం - కొడిగేహళ్లి, బెంగళూరు

### సరైన జవాబులు

1. పద్మజ 2. అనూరాధ 3. దీపారాధన స్వామి 4. శ్రీరామ్మూర్తి 5. అనసూయమ్మ 6. మూకజ్జియ కనసుగళు 7. పారుపల్లి రామకృష్ణయ్య 8. చికెన్ బిర్యానీ 9. మునివాహనుడు 10. ఎడ్వర్డ్ గ్రైండిక్

సొంతంగా భూమి బుట్రా ఉండేటోడు మనింట్లో నిలబడమంటే నిలబడతాడా? " అంది మంగమ్మ గద్దింపు ధోరణిలో.

ఎవరూ మాట్లాడలేదు.

"జీతగాడు" అనే కారణం చెబితే పెద్ది రెడ్డి మొదలుకొని అందరూ అంతెత్తున లేస్తారని జానకమ్మ భయం.

మంగమ్మ మళ్ళీ అందుకుంది.

"మొన్న బలిజపల్లె నుండి మా దాయాది యాదిరెడ్డి సుబ్బారెడ్డి బావమరది మల్ రెడ్డి శెనిగ్గింజలు గానిగాడించుకొనే దానికి మదనపల్లెకొచ్చుండి నాకు కనబడె. పెద్దిరెడ్డింట్లో రాఘవరెడ్డి అనే పిల్లగాడుం డాడంటనే- పెద్దిరెడ్డి కూతుర్నిచ్చి ఇల్లటం పెట్టుకుంటాడంటనే.. నిజమేనా అని అడిగె. పెద్దిరెడ్డింట్లో పిలగాడుండేమాట నిజమేగాని పిల్లనిచ్చేమాట నాకు తెలీదు అంటి. పెద్దిరెడ్డికి ఆ ఆలోచన లేకుంటే నాకు చెప్పండి మా బిడ్డనిచ్చి పెండ్లి చేస్తాం. ఇల్లు కట్టిస్తాం. కొంచెం మడీ చేనూ ఇస్తాం అన్నాడు".

ఈ మాటతో జానకమ్మ కళ్ళింత చేసు కొని చూచింది. రాఘవరెడ్డికింత గిరాకీ ఉందా? అని ఆశ్చర్యపోతూ ఉంది.

"పుల్లారెడ్డి పెండ్లికొచ్చినోళ్ళు చాలా మంది రాఘవునిపై కన్నేసినారు. వివ రాలు అడిగినారు. ఎవురొస్తారో, ఎప్పుడొ స్తారో ఎవురో ఒకరు వచ్చి వాణ్ణి ఎగరేస కపోతారు" అన్నాడు భాస్కరరెడ్డి.

పెండ్లికొచ్చిన వాళ్ళలో రాఘవుని గురించి సరాసరి జానకమ్మతోనే ప్రస్తావిం చిన వాళ్ళున్నారు. జానకమ్మ అప్పుడు ఇదేదో యథాలాపంగా జరిగిందని భావిం చింది కాని దాని వెనక ఇంత కథ ఉందని తెలియదు.

భాస్కరరెడ్డి అందుకున్నాడు, "నిజం- మా అమ్మ చెప్పింది అబద్ధం కాదు. మా వూళ్ళోనే ఇద్దరు ముగ్గురు నన్నే అడిగి నారు. వేరే వాళ్ళెవురో వొచ్చి రాఘవరెడ్డిని ఎగరేసుకపోకుండా పెద్దిరెడ్డి కూతుర్నిచ్చి ఇల్లటం పెట్టుకుంటే పెద్దిరెడ్డి సుఖపడ

తాడు అన్నారు కొంతమంది"

సీత దీపాలు వెలిగించింది.

"ఇదో- ఇదే మంచి శకునం. నువ్వు మనస్సులో కొదవలేవీ పెట్టుకోకుండా 'ఊఁ' అను" అంది మంగమ్మ దీపంవైపు తిరిగి దండం పెట్టుకుంటూ.

అంటే రాఘవరెడ్డి కోసం చాలామంది కాచుకొని ఉండారన్నమాట. రాఘవరెడ్డిని పెద్దిరెడ్డి ఇల్లటం పెట్టుకుంటాడనేమాట బాగా ప్రచారం అయిపోయిందన్నమాట. ఇప్పుడు ఈ పెండ్లి జరగకపోతే విడ్డూరంగా చెప్పుకుంటారు కానీ జరిగితే సహజంగా జరిగిందనుకుంటారన్న మాట. ఏమిటో అంతా తలక్రిందులైపోయింది.

జానకమ్మ దీర్ఘంగా నిట్టూర్చింది.

ఆ నిట్టూర్పు గాలితో బాటు ఆమె సందేహాలన్నీ బయటికి వచ్చేశాయి.

మళ్ళీ గుండెలనిండా గాలి పీల్చుకుంది.

కొత్తగాలితోబాటు కొత్త నిర్ణయాలూ, కొత్త అభిప్రాయాలూ గుండెల లోపలికి ప్రవేశించాయి.

"మీకందరికీ ఇష్టమైనంక నేనెట్లా కాదంటాను చిన్నమ్మా. బిడ్డ మంచి చెడ్డలు మీవి కావా? మీ ఇష్టప్రకారమే కానీ. ఒరే భాస్కరా రేపు నువ్వూ మీ మామా వాళ్ళూరికి- అదేం ఊరు? ఆఁ మద్దిలేరు- మద్దిలేరుకు పొయ్యి ఆ పిలగాడి పుట్టుపూర్వోత్తరాలూ, ఆస్తీ అప్పులూ, మంచీ చెడ్డా కనుక్కోని రండి. ఇరుగు పొరుగునూ, ఊర్లో పెద్దోళ్ళనూ విచారించండి" అంది జానకమ్మ.

"..ఆ ప్రక్కనే బోడుంపల్లెలో రాఘవుని మేనత్త ఉందంట. ఒకనాడు రాఘవుడే చెప్పినాడు. ఆమెతోనూ మాట్లాడి రండి" అంది జానకమ్మ మళ్ళీ.

వేడిపాలలో చేమిరి వేసి ఉట్టిమీద పెడుతున్న సీత మనస్సు ఒక్కసారిగా గాల్లో తేలిపోయింది.

నెమలి పురివిప్పి నాట్యం చేయసాగింది. జింకపిల్ల గంతులేస్తూ పరుగెత్తుతూ ఉంది. మామిడి కొమ్మమీద కోయిల గొంతెత్తి పాడుతూ ఉంది. హంస రెక్కలు చాచి ఆకాశపుటంచులు తాకుతూ ఎగురుతూ ఉంది. సముద్రంలో అలలు ఉవ్వెత్తున ఎగిరిపడుతున్నాయి.

సీతకు కాళ్లు నేలమీద ఆనడం లేదు.



**11** తెల్లవారకముందే రాఘవరెడ్డి బావి దగ్గరికి వెళ్ళిపోయాడు.

జానకమ్మ లేవకముందే సీత పెరట్లో నీళ్ళ పొయ్యి అంటించింది. నీళ్ళు కాగేలోపల బియ్యపునూకతో ఉప్మా చేసింది. గిన్నెలో సర్దింది. ఊరగాయ ముక్కలు కూడ అందులో వేసింది. ఆ ఊళ్ళో అదే విలువైన, గౌరవప్రదమైన ఫలహారం. అరుదైన బంధువులకు పెట్టే అర్జంటు తయారీ ఫలహారం. ఇడ్లీలు, దోశెలూ ఎప్పుడో పండగలకూ పబ్బాలకూ చేసుకొనే ఫలహారం. అంత లోపల పెద్దిరెడ్డీ భాస్కరరెడ్డీ ప్రయాణానికి సిద్ధమయ్యారు. వాళ్లకు ఉప్మా పెట్టి సాగనంపింది.

అన్నీ సర్దిన తరువాత స్నానం చేసింది. రాత్రి రాఘవరెడ్డి నెరబైలు నుండి తెచ్చిన కొత్త పావడలు కనబడ్డాయి. ఒకటి పెట్టెలో పెట్టి ఒకటి కట్టుకుంది. పెట్టెలో దాచిపెట్టిన సిల్కు చీర కట్టుకుంది. అది నాగరత్న అక్క పెండ్లికి కొన్నది. ఊళ్ళో

పెండ్లికి ఈడొచ్చిన ఆడపిల్ల సాదా గుడ్డలతో వెళ్తే గౌరవంగా ఉండదని జానకమ్మ అప్పుడు నెరబైలులో తానే స్వయంగా కొని తెచ్చింది. కనకాంబరం వన్నె జాకెట్టు తొడుక్కొని ముఖానికీ, మెడకూ పౌడరు పూసుకుంది. కుండీలో పెంచుకొన్న మరువం మొలకల నుండి నాలుగు రెమ్మలు తుంచి వాటితోపాటు ఒక మందారపువ్వు జతచేసి జడలో తురుముకుంది. ఉప్మా గిన్నె చేతపట్టుకొని "అమ్మా బాయికాడికి పోతావుండా" అని చెప్పేసి తుర్రుమంది.

నిన్న నెరబైలు నుండి ఎరువు మూటలు తెచ్చినందుకు రాఘవుని ఒళ్ళు చీదరగా ఉండడంతో బావి దగ్గరికి వస్తూనే రాఘవుడు బావిలో దిగి సబ్బుతో రెండుసార్లు ఒళ్ళంతా రుద్దుకొని స్నానం చేశాడు. బనీను, లుంగీ ఉతికి ఆరవేశాడు. తువ్వాలు చుట్టుకొని నులకమంచానికి జారిపోయిన నులకత్రాళ్ళు బిగిస్తున్నాడు.

సీత అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళి ఉప్మాగిన్నె కిందపెట్టి ఒక గెంతులో రాఘవరెడ్డి వీపుమీద ఉప్పుమూటలాగా అతుక్కుంది. కాళ్ళతో అతని నడుమునూ, చేతులతో అతని మెడనూ చుట్టేసింది. అతని వీపును రొమ్ముతో గట్టిగా నొక్కిపట్టేసింది. అప్పుడే స్నానం చేసిన సబ్బువాసనతో ఘుమఘుమలాడుతున్న రాఘవుని మెడమీద, చెంపలమీద తన ముఖం పెట్టి రుద్దుతూ కిలకిల నవ్వసాగింది. శక్తికొద్దీ కాళ్ళతోనూ రొమ్ముతోనూ అతని శరీరాన్ని బిగిస్తూ ఉంది. షర్టూ బనీను లేని శరీరంపైన సీత స్పర్శ రాఘవునికి అదోలా ఉంది. పౌడరువాసనా, మరువం మొలకల వాసనా మత్తెక్కిస్తున్నాయి. మనస్సు పరవశించిపోతోంది. చేతులు వెనక్కిచాపి సీతముఖం తన ముఖం దగ్గరికి లాక్కున్నాడు. చెంపకు చెంప రుద్దాడు. నోటికి అందుబాటులోనికి వచ్చిన సీత పెదవినీ, చెంపనూ, చెవినీ కొరికాడు. ఇంకా... ఇంకా... ఏమేమో చేయాలని...

అంతలో అతని అంతరాత్మ మేలుకొంది. తన నిర్ణయం, తన హద్దులూ జ్ఞాపకం వచ్చాయి. మాటిమాటికీ తనను సవాలుచేస్తూ, రెచ్చగొడుతూ, తన పతనాన్నే లక్ష్యంగా పెట్టుకున్నట్లు ప్రవర్తిస్తున్న సీతమీద రాఘవునికి ఈసారి నిజంగానే కోపం వచ్చింది.

"ఏయ్ ఏయ్ ఏందిది? నీకేమి తిక్కాతిమురా. ఇట్లా పనులు చెయ్యొద్దని ఎన్నిసార్లు నీకు చెప్పేది. ఇట్లైతే మీ నాయనకు చెప్తా" అన్నాడు విసుగ్గా విదిలించుకునేందుకు ప్రయత్నిస్తూ.

"చెప్పుకో చెప్పుకో.. చెవి కోసుకో.. వేపాకిస్తా మంతరించుకో! నాకేమీ భయమా!" పాటలా సాగదీసింది సీత.

"అమ్మా నాయనా అంటే కూడా భయం లేకుండా పోయింది నీకు. బాగా తెగించి కూచున్నావు"

"ఎందుకూ నాకు భయం? మా నాయనా, భాస్కరమామా పొద్దున్నే లేచి మీ ఊరికి మద్దిలేటికి పోయినారు తెలుసునా? " అంది రాఘవుని వీపుమీద తను రొమ్మును ఇంకా గట్టిగా నొక్కుతూ.

"మా ఊరికా? ఎందుకు? " అన్నాడు ఆశ్చర్యంగా.

"నీ పుట్టు పూర్వోత్తరాలు, మంచి చెడ్డలూ విచారించి రమ్మని మా అమ్మే పంపింది"

"ఎందుకూ? " అన్నాడు మరింత ఆశ్చర్యంగా. అతని మనస్సుకేదో స్ఫురిస్తూ ఉంది కానీ ఆ స్ఫురిస్తున్న విషయం నిజమేనా అనే సందేహం బలంగా ఉంది.

"ఎందుకా? కోసుకొని కూరచేసుకొనేదానికి? ఏం మొగోడు! ఒక మొగపిల్లగాణ్ణి గురించి అవన్నీ ఎందుకు విచారిస్తారు ఎవ్వరైనా? అది కూడా తెలీదా? "

"మీ అమ్మ పంపించిందా? " అన్నాడు

రాఘవరెడ్డి నొక్కిపలుకుతూ.

"మా అమ్మే పంపించింది. నిన్న మావి టేళ భాస్కరమామ, మంగమ్మవ్వ మా ఇంటికొచ్చి శానా సేపు మాట్లాడినారు. నిన్ను ఇల్లటం తీసుకొని ఇంట్లోనే పెట్టుకోమని మా అమ్మకూ, నాయనకూ శానారకాలుగా సెప్పిరి. అన్నాల పొద్దుదాకా మాట్లాడిరి. కడాకు మా అమ్మ ఒప్పుకొని నాయన్నూ, భాస్కరమామనూ మీ ఊరికి పోయిరమ్మనె. వాళ్ళు ప్రొద్దున్నే ఎలబారి పోయిరి".

"అయితే మీ నాయనా అమ్మా కూడా ఒప్పుకున్నారంటావా? " అన్నాడు సగం ఆశ్చర్యంతో, సగం అప్పుడప్పుడే పెల్లుబికి వస్తున్న సంతోషంతో.

"ఒప్పుకోకపోతే మీ ఊరికెందుకు పోతారు? "

### కొత్తగాలి...

వయ్యారంగా క్యారీ బ్యాగు
నడిచి వస్తుంటే
చేతిసంచి, అల్లికబుట్ట
మూలన నక్కాయి

– అంకె పద్మప్రియ,
హైదరాబాద్

రాఘవరెడ్డి నోటమాట రాలేదు. నమ్మలేకుండా ఉండాడు. తన చుట్టూ ప్రపంచం గిర్రున తిరుగుతూ ఉంది. శరీరం గాలిలో తేలిపోతూ ఉంది. గుండె గొంతులోకి తన్నుకొస్తూ ఉంది. అదృష్టదేవత ఆలింగనం చేసుకున్నట్లుంది. చీకటింటిలో కొట్టుమిట్లాడుతున్న తనపైన ఒక్కసారిగా వేయి సూర్యకిరణాలు విరియగాచినట్లుంది.

సీత రెండు భుజాలూ పట్టుకొని ఊపుతూ "నిజమా? నిజంగా నిజమా సీతా? నిజం చెప్పు. తమాషా చెయ్యొద్దు. నా ప్రాణాలతో ఆట్లాడుకోవద్దు. తమాషా అయితే చెప్పెయ్" అన్నాడు ఆత్రంగా.

"ఇట్లాంటివి కూడా తమాషాకు చెప్తారేమి? " అంది సీత సిగ్గుపడుతూ.

"రాఘవరెడ్డి రెండు నిమిషాలు సీతముఖం తేరిపార జూచి ఆమె చెంపలను తన రెండు చేతుల్లో గట్టిగా ఇముడ్చుకొని చెంపలమీదా, కండ్లమీదా ముద్దులపైన ముద్దులు కురిపించాడు. సీతా సీతా అంటున్నాడు సన్నని ఎలుగుతో కలవరిస్తున్నట్లుగా, జపం చేస్తున్నట్లుగా.

సీత మనస్సు పరవశించిపోతూ ఉంది. శరీరం పులకించిపోతూ వుంది. హృదయం తీయగా మూలుగుతూ ఉంది. రాఘవరెడ్డి కౌగిలిలోని ఒత్తిడి బలం చాలడం లేదు. ఇంకా గట్టిగా ఎముకలు విరిగేలాగా బలంగా కౌగిలించుకోవాలని శరీరం కోరుతూ ఉంది. రాఘవరెడ్డిని పక్కవాటాన గట్టిగా కౌగిలించుకొని బల్లిలా కరుచుకుపోయింది. తీగలా అల్లుకుపోయింది.

రాఘవరెడ్డి ఉద్వేగంతో సంతోషంతో నిలబడలేకపోయాడు. నులకమంచం మీద వాలిపోయాడు. అతనితోబాటే సీత కూడా. అయినా పట్టు ఏ మాత్రమూ సడలించలేదు.

"ఈ సీత నాది. ఈ సీతంతా నాదే. ఈ ముఖం, ఈ మనస్సు, ఈ ప్రేమ, ఈ అదృష్టం అంతా నాదే. అబ్బా.." అంటూ ముద్దులు పెట్టాడు. దూరంగా జరిగి సీతను ఎగాదిగా చూచి మళ్ళీ కౌగిలించుకొని తలా, మెడా, వీపూ నిమరసాగాడు.

సీత స్పృహలోకొచ్చింది.

"చాల్చాలే సంబడం. ఇన్నాళ్ళకు తెల్లారింది పిల్లగాడి తెలివి. ఇన్నాళ్ళకొచ్చింది మొగోడికి ధైర్నం" అంది నవ్వుకుంటూ.

రాఘవరెడ్డి మంచం మీద కూర్చున్నాడు. సీతను పక్కనే కూర్చోబెట్టుకొని మెడను చేత్తో గట్టిగా పొదువుకున్నాడు.

"ఇన్నాళ్ళకు కాదు... ఇప్పుడు కాదు... అప్పుడే... ఆనాడే... నువ్వు ఏ ఇండ్లోళ్ళు అని అడిగినప్పుడు నేను రెడ్లమే అన్న ప్పుడు నువ్వు ఒక చూపు చూస్తివి చూడు. అప్పుడే. గంగపండుగ నాడు నువ్వు, నాగ రత్న నన్ను గురించి మాట్లాడుకోని నవ్వు కుంటిరే - ఆనాడే - నిన్ను తేనెటీగలు కుట్టి మనిద్దరం ఒక బొంతకింద దూరి ఒకర్నొకరు అతుక్కొని కూర్చుంటిమే- అప్పుడే. చలికి జొన్న రొట్టెలు తింటే బాగుంటుందని నేననంగానే జొన్న రొట్టె లు చేసి తెస్తివే - అప్పుడే - ఆనాడే - నా మనస్సు నీ మీద వాలిపోయింది. నిన్ను చుట్టుకునింది. నిన్ను అల్లుకుపోయింది. నువ్వే నా మనిషివి అనుకుంటి. కడల్లకా లమూ నువ్వు నాతోడే ఉండాలనుకొంటి. నీ చేతికూడే తినాల. నిన్ను నా రొమ్ముపైన వాల్చుకొని పండుకోవాల. ఇద్ద రమూ రాత్రింబగలూ ఒకరినొకరు ఇడవ కుండా తిరగతా ఉండాల అనుకుంటి. ఇంకా ఏమేమో అనుకుంటి కలలుకంటి.

కాని నా బుద్ధి ఒకప్రక్క నిలబడి 'ఇది మంచిదికాదు. ద్రోహం' అని ఎచ్చరిస్తా ఉంది. ఒకవేళ నేనే ముందు బయట పడితే అల్లరైపోదును గానీ ఫలితం ఉండదు అని భయపడతావుంటి. దొరక్క దొరక్క దొరికన ఈ నీడ కూడా పోగొట్టు కుంటానేమో అని భయం ఒక ప్రక్కన, ఆశ ఒక ప్రక్కన.

నాకూ ఒక ఇల్లు కావల్ల. నీలాంటి భార్య కావల్ల. సరికాపోళ్ళలో నేనూ ఒక మనిషిగా నిలబడల్ల. రాఘవరెడ్డి కూడా ఒక లెక్కకెక్కినోడు, ఒక సంసారి అనిపిం చుకోవల్ల అనేది నా కోరిక. నేను ఏ జన్మలో చేసిన పుణ్యమో నాకు నువ్వే భార్యగా దొరికినావు" రాఘవరెడ్డికి ఇక మాటలు రావడంలేదు.

రాఘవుని మాటలు వింటూ సీత కూడా ఇక విధమైన ఉద్వేగానికి లోనైంది.

"ఏ జన్మలో పుణ్యమోకాదు ఈ జన్మ

లోనే! నీ మనస్సు అట్లాంటిది. నీ మాట అట్లాంటింది. నీ నడవడిక అట్లాంటిది. నీ నీతి, నిబ్బరం అట్లాంటివి. అందుకే నేను ..నేను" సీత మరి మాట్లాడలేకపోయింది.

సీతను మాట్లాడనీయకుండా మళ్ళీ గట్టిగా హత్తుకున్నాడు రాఘవరెడ్డి.

"ఇంకసాల్లే. దీనికంతా ఇంకా శానాట్టై ముండాది. ఒదులు, ఇంటికి పోవల్ల"

రాఘవరెడ్డి, సీతా ఒకే గిన్నెలో చల్లారిన ఉప్మా ఊరగాయ కలిపి తిన్నారు.

సీత వెళ్తూవెళ్తూ "ఇంక శాన్నాళ్ళు లేదు. పట్టుచీర, తాళిబొట్టూ సరిచేసుకో. అవి నువ్వే తేవాల. తక్కిందంతా మా నాయన సూసుకుంటాడు" అని చెంగుచెంగున గంతులేస్తూ వెళ్లిపోయింది.

## కొత్తగాలి...

**ధనియాలు**
**మొలచిన చేనుకు**
**తనువంతా**
**స్ప్రే చేశారు**
**కొత్తిమిర సెంటు**

– ఆచార్య కొలకలూరి ఇనాక్, హైదరాబాద్

ఆ రోజంతా ఆక్కడ సీతగానీ, ఇక్కడ రాఘవరెడ్డిగానీ నేల మీద నడవలేదు.

★ ★ ★

సాయంత్రం నాలుగ్గంటలకు మద్దిలేటికి పోయిన పెద్దిరెడ్డీ, భాస్కరరెడ్డీ వాళ్ళతో బాటు రాఘవరెడ్డి మేనత్త శకుంతల మ్మానూ ఆమె మనుమడు పదేండ్ల పిలగాడినీ వెంటబెట్టుకొచ్చారు.

"మల్లా రాత్రికి వస్తాం ఊళ్లో నలుగురు పెద్దమనుషుల్ని పిలిపించుకో. రాత్రికే మాట్లాడి ఖాయం చేసుకుందాం" అని భాస్కరరెడ్డి వెళ్లిపోయాడు.

మేనత్త వచ్చిందని తెలిసి రాఘవరెడ్డి బావి దగ్గరినుండి పరుగులమీద వచ్చేశాడు. వస్తూనే మేనత్తను "బాగుండావా అత్తా? నీ ఒంట్లో ఎట్లుండాది? నరసింహ బావ, సుజాతక్క ఎట్లుండారు? వీడు నరసింహబావ కొడుకు కదూ? " అన్నాడు సంతోషం పట్టలేక మేనత్త రెండు భుజాలు పట్టుకొని ఊపేస్తూ.

"ఎట్లుండావురా నాయినా? నిన్ను చూస్తావుంటే మల్లా మా అన్నను చూచినట్లుండాదిరా.. బాగుండావా? ఆరునెలలైపోయె నీ పోవిడి తెలియక. అంతకు ముందు ఆర్నెల్లకో మూణ్ణెల్లకో ఒకసారైనా కనబడతావుంటివి. మీ అత్త లేదనుకుంటివేమిరా? " అంది కళ్ళు తుడుచుకుంటూ.

"ఊరుకోఅత్తా. నేనిట్లొచ్చేసినంక దూరా బారమై పోయె. వచ్చేదానికి కుదర్లా? "

"అవున్లే. ఒకచోట కట్టుబడిపోయినంక నీ యిష్టమొచ్చినట్లు రావాలన్నా పోవలన్నా కుదురుతుందా? "

"అదేంలేదత్తా.. అట్లాంటి నిర్బంధమేమీ లేదులే.. నేనే రాలేకపోతి"

"మీ నాయన పోయినంక నేను మీయింటికి వచ్చేదానికి పోయేదానికీ దోవలు మూసకపోయె. మీ అమ్మ బహురోసకత్తె. ఎన్నిసార్లు పిలిచినా నా ఇంటికి రాకనే పోయె. నా కొడుకూ ప్రయోజకుడై, ఒకింటోడై నలుగురిలో తలెత్తుకోని నిలబడినప్పుడు.. అప్పుడొస్తా మీ యింటికి అంటానే తానూ ఎల్లిపోయె. నువ్వా పూరొదిలి పొచ్చేస్తివి"

ఇట్లా కొంతసేపు జ్ఞాపకాలు తిరగదోడుకోవడాలూ, కళ్ళు తుడుచుకోవడాలూ, ఓదార్పులూ జరిగిపోయాయి.

వీళ్ళ సంభాషణ వింటూ ఉన్న జానకమ్మ హృదయం ఆర్ద్రమైపోయింది. శకుంతలమ్మ పట్ల ఒక విధమైన ఆత్మీయత నెలకొంది.

"ఆ తల్లి రోషమే వచ్చింది ఈ కొడుక్కు కూడా" అనుకుంది సీత.

చీకటి పడేలోపల శకుంతలమ్మ పెద్ది రెడ్డి బావీ భూమీ, ఇల్లూ పెరడూ, గొడ్డూ గోదా అన్నీ చూసేసింది. సీతను పలకరించి ప్రక్కన కూర్చో బెట్టుకుంది. జానకమ్మ వంటింట్లో ఉంటే అక్కడికి వెళ్లి ఆమె మాటతీరూ, మర్యాదా పరిశీలనగా చూచింది. మేనల్లునికి మంచి అండ దొరికినందుకు ఆమెకు ఆనందంగా ఉంది.

భోజనాలైనాక అందరూ అరుగుల మీద కూర్చున్నారు. భాస్కరరెడ్డివాళ్ళ ఇంటిలో అందరూ వచ్చేశారు. యెర్రంరెడ్డీ, ఉత్తారెడ్డి, ఆంజనేయాచారి, ఈడిగ కృష్ణయ్య, ఆదెప్పా వచ్చేశారు. సంగతి తెలిసి మాల పల్లెనుండి ఎంగిటిగాడూ, మునిగాడూ వచ్చి అరుగుల కింద బండ మీద కూర్చున్నారు. జగన్నాథరెడ్డీ, పుల్లారెడ్డీ వచ్చి రాఘవరెడ్డి ప్రక్కన కూర్చున్నారు. ఆడవాళ్ళందరూ లోపల గడపదగ్గర కూర్చున్నారు. మంగమ్మ మాత్రం మగవాళ్ళతో బాటు అరుగుమీదే కూర్చుంది.

శకుంతలమ్మ సీతను తన ప్రక్కనే కూర్చోబెట్టుకొని పొదివి పట్టుకుంది. భాస్కరెడ్డి ప్రారంభించాడు.

"పెద్దిరెడ్డి మామ మిమ్మల్నందర్నీ ఎందుకు రమ్మన్నాడంటే-

మొన్న పెద్దిరెడ్డి మామ కూతుర్ని అడిగే దానికి ఉదయమాణిక్యం నుండి ఒకరు వొచ్చినారు. పిలగాడు ఆర్టీసి డ్రైవరు. ఊర్లో ఒక పెంకుటిల్లు, కొంచెం చేనూ ఉంది. పిల్లగాడు బాగానే ఉండాడు, బిడ్డను ఇవ్వవచ్చు.

కాని నేనొకటి ఆలోశనజేస్తి. బిడ్డను కడగా ఇచ్చి పంపించేస్తే వీళ్లు లెయ్ లేని కాలంలో వీళ్ళను ఎవురు సూస్తారు? ఈ ఇల్లూ భూమి ఎవురు చూస్తారు? ఈ సొత్తంతా అమ్మేసి ఎత్తకపోయి అక్కడ కూర్చున్నా కూతురిల్లు పరాయి ఇల్లే కదా.

అందుకు నాకొక ఆలోశనొచ్చె. మంచి పిల్లగాణ్ణి చూచి ఇల్లటం పెట్టుకుంటే వీళ్ళ ఇంట్లో వీళ్ళు ఉండినట్లుంటుంది. వీళ్ళ బతుకు ఇక్కడే గడిసిపోతుంది. అట్లని ఎవుణ్ణంటే వాణ్ణి తెచ్చి ఇల్లటం బెట్టుకుంటే వాడు ఏకుమేకై కూసుంటే ఎట్లా?

మేమంతా అదే ఆలోశన జేస్తిమి. చేతిలో వెన్నబెట్టుకొని నెయ్యికోసరం ఊరంతా తిరిగినట్లు ఇంట్లోనే ఒక పిలగాడుండంగా ఎక్కడెక్కడో ఎతికేది ఎందుకు? అతని కాలం బాగాలేక వచ్చినాడో మన కాలం బాగుండి వచ్చినాడో రాఘవరెడ్డి మన పంచన జేరినాడు. సరి కులస్థుడు, మా అమ్మకు దూరపు సుట్టం కూడా. ఇన్ని నెలలుగా చూస్తా ఉండాము. ఎవరిచేతా ఏలెత్తి చూపించుకోకుండా బ్రతకతా ఉండాడు. సొంతగానికన్నా ఎక్కువ శ్రద్ధతో సేద్యం చేస్తా ఉండాడు"

> **కొత్తగాలి...**
>
> **కన్నీరు**
> **ఖర్చయితే**
> **దిగులు**
> **డెబిట్ అవుతుంది!**
>
> – కిలారు వెంకటేష్ చౌదరి,
> హైదరాబాద్

మునిగాడు కలగజేసుకున్నాడు.

"అది మేము సూళ్ళేదా, శెనిగ్గింజ లేసినపుడు, మడినాటినప్పుడూ రెడ్డికి పైలో బాగా లేకపోతే ఈ అబ్బేకదా అన్నీ సమాళించింది!"

ఆదెప్ప అందుకున్నాడు.

"పెద్దిరెడ్డీ! ఎందుకిన్ని మాటలు. ఒకే మాట. ఆ సీతమ్మను ఈ రాఘవరెడ్డికిచ్చి పెండ్లిచేసి లక్షణంగా ఇంట్లో పెట్టుకోండి. నేను శాన్నాళ్ళుగా ఈ మాట చెబుదామని అనుకుంటావుంటి. ఆ టైమురానీ చెబుదాము అని ఊరికే ఉంటి."

"మీకు తెలీదుగానీ మా మాలపల్లెలో అందరూ ఆ మాట శాన్నాళ్ళుగా అనుకుంటావుండారు. అయినా పెద్దోళ్ళ మాట మనకెందుకులే అని గమ్మునుంటిమి" అన్నాడు ఎంగిటిగాడు.

"కంసలోడు ఉండేచోట కథెయ్యకూడదంటారు పెద్దోళ్ళు. కంసలోడు ఏదో ఒక అడ్డుపుల్ల ఏస్తాడంట. నేను కంసలోణ్ణి. ఏదో ఒకటి అనకుండా ఎట్లుంటా!" అన్నాడు ఆంజనేయాచారి.

ఆచారి ఈ తీర్మానానికి వ్యతిరేకంగా ఏమీ చెప్పడని అందరికీ తెలుసు. తీర్మానానికి బలం చేకూర్చే మాటే చెప్తాడనీ తెలుసు.

"ఊ- కానీ- ఏం చెప్తావో చెప్పు" అంది మంగమ్మ.

> **కొత్తగాలి...**
>
> **నిన్న నీతి లేనివాడు**
> **కోతి కంటె పాడు**
> **నేడు నీతి గలవాడు**
> **నీడ లేని బీడు**
>
> – సి. కామేశ్వరరావు, కాశీబుగ్గ

"ఈ పిల్లగానికి ఎప్పటికీగానీ వాళ్ళ ఊరికి వెళ్ళిపోవాలని కోరిక పుట్టకూడదు. అందుకోసరం ఏం చెయ్యాలంటే, ఆ ఊర్లో ఈ పిలగానికి సంబంధించింది ఏదేదైతే వుందో అదంతా- ఇల్లుగానీ, భూమిగానీ అమ్మేసి వచ్చెయ్యల్ల" అన్నాడు ఆచారి.

ఈ మాట వినడానికి కటువుగా ఉన్నా ఇది అవశ్యం జరగవలసిన పని అని అందరికీ అర్థమౌతూ ఉంది.

"అక్కడ మావాడికి ఏమీలేదు. పూరిల్లుండె. అదీ కాలిపోయింది. మొండిగోడలున్నాయి. ఇంటిజాగా అమ్మేసి రావచ్చు వీడు మళ్లా అక్కడికి పోయి ఏంచేస్తాడు" అంది రాఘవరెడ్డి మేనత్త శకుంతలమ్మ.

"నేను కూడా అదే చెప్తామనుకుంటా వుండా. ఆ యింటి జాగాను అయినకాడికి అమ్మెయ్" అంది మంగమ్మ.

మళ్ళీ తానే అంది.

"ఏం రాఘవా? ఏమంటావు? మా సీతను పెండ్లిచేసుకొని ఈ ఇంట్లోనే ఇల్లటం ఉండి ఈ యింటి పీటకం నిలబెట్టాల. నీకు సమ్మతమేనా? " అంది.

"మీ యిష్టం పెద్దమ్మా" అన్నాడు రాఘవరెడ్డి తలవంచుకొని.

"ఏమ్మా- నీపేరేంది- శకుంతలమ్మా- ఆ పిలగాని పక్కన నువ్వేకదా పెద్దదిక్కు. నీ మాట చెప్పు" అంది మంగమ్మ.

"నాదేముంది? ఈ పొద్దుండి రేపెల్లిపోయేదాన్ని. వానికి పెద్దదిక్కైనా, చిన్నదిక్కైనా మీరే. ఈ ఊరివాళ్ళే. మీకందరికీ వానిపైనుండే ఆపేక్ష చూస్తావుంటే నా కడుపు నిండిపోతావుంది. నాకు అదృష్టం లేకపోయె. నా కూతురు వీనికంటె నాలుగేండ్లు పెద్దదైపోయె. నాకింకొక కూతురు, చిన్నది ఉండుంటే దాని కతే వేరేగా ఉండేది. బంగారట్లా పిల్లగాణ్ణి దూరం చేసుకుంటా వుండా" అని శకుంతలమ్మ కళ్ళు తుడుచుకుంది. శకుంతలమ్మ ప్రక్కనే కూర్చొని వుండిన సీత ఆమెను మరింత గాఢంగా పొదివి పట్టుకుంది.

"రాఘవా, ఈయన్నే మీ నాయననుకో. ఈయమ్మే అమ్మ అనుకో. వీళ్ళ మనస్సుకు ఏ కష్టమూ కలక్కుండా సూసుకో. ఇదే నీకు సెప్పేది" శకుంతలమ్మ గొంతులో కన్నీళ్ళు గురగురలాడాయి.

"బంగారట్లా మాటచెప్పింది తల్లి. ఈయమ్మను చూస్తానే తెలస్తావుంది రాఘవరెడ్డి అమ్మా నాయనా ఎట్లాంటోళ్లో" అన్నాడు మునిగాడు.

మునిగాని మాటలు అక్కడున్న వాళ్ళనందరినీ కదిలించాయి.

"ఇదే ఖాయం. మీ అందరి ముందర ఖాయం చేసుకున్న మాట. శూన్యమాసం పోయినంక మాఘ మాసంలో పెండ్లి పెట్టుకుందాం" అన్నాడు భాస్కరరెడ్డి.

"అమ్మా పెండ్లికి ఎవరో ఒకరు వొచ్చి చెప్తాం. మీ ఇంట్లో వాళ్ళందరూ రావల్ల" అన్నాడు పెద్దిరెడ్డి శకుంతలమ్మతో.

ఆ రాత్రి శకుంతలమ్మ మేనల్లుడి ప్రక్కనే పడుకొని చాలాసేపు బుద్ధిమాటలు చెప్పింది. ప్రొద్దున్నే బయలుదేరింది.

"రాఘవా, బండికట్టుకోని పోయి మీ అత్తను బస్సెక్కించి రా" అన్నాడు పెద్దిరెడ్డి. ఎంత గొప్ప మర్యాద! పులకరించిపోయింది శకుంతలమ్మ.



**12** **అ**ప్పుడప్పుడే తెల్లవారింది. కార్తీకమాసం చిరుచలిగా ఉంది. ముసలివాళ్ళు తువాళ్ళు చెవులకు చుట్టుకొని తిరుగుతూ ఉన్నారు. అందరూ ఎవరి హడావుడిలో వాళ్లున్నారు.

మబ్బులు లేకుండానే ఆకాశం భయంకరంగా ఉరుముతున్నట్లు, పెద్దశబ్దం చేస్తూ ఒక జీపూ, ఒక వ్యానూ వచ్చి రచ్చబండ దగ్గర నిలబడ్డాయి. పుట్టలోంచి పాములు బిలబిలమని బయటికి వచ్చినట్లు జీపులోంచి, వ్యానులోంచి పదిమంది పోలీసులూ, ఇద్దరు యస్సైలు, ఒక సర్కిల్ ఇన్‌స్పెక్టరూ కిందికి దూకారు. అందరి చేతుల్లోనూ తుపాకులు..

సర్కిల్ అరుస్తున్నాడు.

"ఇండ్లలోని మగాళ్ళనందరినీ ఈడ్చకరండి. ఎవర్నీ వదలొద్దు. ఎవడైనా పారిపోయేదానికి చూస్తే కాల్చి పారేయండి. పల్లె సుట్టేసుకొని రండి. పొండి."

పోలీసులు ఊరిమీద పడ్డారు. వీధి వీధీ తిరుగుతూ "మొగోళ్ళంతా రచ్చబండ కాడికిరండి. ఎవడైనా ఇంట్లో దాక్కున్నాడంటే వాని కాళ్లు చేతులూ విరగొడతాం" అంటూ వీధుల వెంట తిరుగుతూ ఉన్నారు.

ఊరు ఉలిక్కిపడింది. బిత్తరపోయింది. కంపించిపోయింది.

పోలీసుల ఆటోపం చూస్తే ఇదేదో ప్రమాదకరమైన సంగతి అని అర్థమౌతూ ఉంది. పోలీసుల చేత మెడతోపులూ, లాఠీ దెబ్బలూ తినకముందే రచ్చబండ దగ్గరికి వెళ్ళి నిలబడడం మంచిదని మగవాళ్ళందరూ "ఇదిగో పోతావుండాం, ఇదిగో వస్తా ఉండాం" అని గట్టిగా జవాబిస్తూ రచ్చబండ దగ్గరికి చేరుకున్నారు.

మాలపల్లి నుండి కూడా అందరూ వచ్చి నిలబడ్డారు.

భాస్కరరెడ్డీ, పెద్దిరెడ్డీ చొక్కాలు తొడుక్కొని భుజాలపైన తువ్వాళ్ళు వేసుకొని వచ్చేసరికి పదినిమిషాలు ఆలస్యమైపోయింది. అంతలోపల సర్కిల్ జనంతో ఏదో అంటున్నాడు.

"ఏమంద్రా! మీకు పోలీసులంటే లెక్కే లేదా. పోలీసోళ్ళ మాటలు మీ చెవుల్లో దూరవా? ఆపొద్దు ఈ యస్సై మీ పల్లెకొచ్చి ఏమి చెప్పి పోయె? నక్సలైట్లతో చేరకూడదు, వాళ్ళను ఊరిలోనికి రానివ్వకూడదు, వాళ్ళకు ఏమీ ఈయకూడదు, వాళ్ళ మాటలు వినకూడదు- అని చెప్పలే? మీ చెవులకెక్కలేదా? మనకు అన్నలుండారు, ఈ పోలీసులు మనల్నేంచేస్తారులే- అనుకుంటిరా? ఇప్పుడందర్ని జీపులెక్కించి స్టేషన్‌కు తీసకపోయి బొక్కలో తోస్తే ఏ అన్న వస్తాడు మిమ్మల్ని ఇడిపించడానికి-

ఏం? " అంటున్నాడు సర్కిల్ ఇన్‌స్పెక్టరు.

సర్కిల్ మాటలకు ఉత్తారెడ్డి సమాధానం చెబుతున్నాడు.

"ఏం చేసేది సార్, మీరొచ్చిపోయిన మరసటి రోజు పొద్దుగూకాక పదహైదు మంది తుపాకులూ, వేటకొడవండ్లూ ఎత్తుకోని మీరొచ్చినట్లే వచ్చి ఊరిమిందపడిరి. 'మీరు ఊర్లోకి రావద్దండి' అని వాళ్ళకు చెప్పేటోడెవడు? ఇట్లనే వాళ్ళుకూడా మమ్మల్ని గుంపుజేరమన్రి. ఏంటేటివో కతలు చెప్పిరి. గవర్నమెంటోళ్ళు బీదోళ్ళకు ద్రోహం చేస్తా ఉండారు. మేము పేదోళ్ళ ప్రక్కన నిలబడి పోరాడతా ఉండాం. మేము మీకు అన్నల్లాంటోళ్ళమని ఇంకా ఏమేమో చెప్పిరి" అన్నాడు ఉత్తారెడ్డి.

"ఆహా! అవన్నీ విని మీరు నమ్మిపోయి అన్నలారా రండి, భోంచేసి వెళ్ళండి, ఇదిగో ఇవన్నీ తీసుకుపోండి అని ఇచ్చి పంపిస్తిరో? " అన్నాడు సర్కిల్ వెటకారంగా.

ఇంతలోపల పెద్దిరెడ్డీ, భాస్కరరెడ్డీ పోలీసుల దగ్గరికి వచ్చేశారు నమస్కారాలు పెట్టుకుంటూ. పాత యస్సై వాళ్లనిద్దరినీ సర్కిల్‌కు చూపి ఏదో చెప్పాడు. సర్కిల్ అరుపులు తగ్గించి కాస్త మెత్తగా, అధికార దర్పం తగ్గకుండా ఇద్దరినీ పలకరించాడు.



"ఏమయ్యా పెద్దాయనా, భాస్కరరెడ్డీ.. మేము ఇంతకుముందే చెప్పినాము. నక్సలైట్లతో ఎలాంటి సంబంధం పెట్టుకున్నా అది నేరమనీ, కేసౌతుందనీ, శిక్ష పడుతుందనీ.. అది మీరు వినకపోతే ఎట్లా? ఏం? చెప్పినామా లేదా? "

"చెప్పినారు సార్"

"మరి ఇదంతా ఎట్లా జరిగింది? వాళ్లకు సరుకులిచ్చినారు, భోజనం పెట్టినారు. అది తప్పుకాదా? "

"ఏం చెయ్యమంటారు సార్. తుపాకులూ, వేటకొడవండ్లూ, బిచ్చువాలూ పట్టుకొని వచ్చేవాళ్లను వద్దంటే నిలుస్తారా? మీరు దగ్గరుండారా మీతో చెప్పుకోవడానికి? వాళ్లను ఎట్లనో ఒకట్ల వదిలించుకోవల్ల కదా? " అన్నాడు పెద్దిరెడ్డి.

"ఇట్టాంటి ఉపద్రవం మాకెప్పుడూ రాలేదు సార్. వాళ్లు ఏందేదో మాట్లాడతారు. 'ధన వంతులూ పెత్తందార్లూ మిమ్మల్ని దోపిడీ చేస్తా ఉండారు. ఆ దౌర్జన్యాలను ఎదిరించి రక్షణ కలిగించేదానికే మేము వస్తున్నాం' అంటారు. అప్పటికే మేము చెప్పనే చెప్పి నాము. 'అన్నలారా ఇక్కడ మమ్మల్నెవరూ దోపిడీ చెయ్యడం లేదు. మీ రక్ష ణతో మాకు ఏ అవస రమూ లేదు' అన్నాం.



వాళ్లు వింటే కదా. అర్ధరాత్రి వరకూ ఒక టే సొద. ఓమాటతో అడుక్కోవడం, మరో మాటతో బెదిరించడం. మే ఏం చెయ్యాల్ల చెప్పండి? " అన్నాడు భాస్కరరెడ్డి.

"వాళ్లతో మాటలు పెట్టుకుంటే అంతే. నైసుగా మాట్లాడి మిమ్మల్ని వల్లో ఏసుకుం టారు. వాళ్లను దగ్గర చేర్చకూడదు. వాళ్లతో మాటలు పెట్టుకోకూడదు. మీరు వాళ్లకు కావలసినవన్నీ సప్లై చేస్తావుంటే వాళ్లు మాకు చిక్కుతారా? మీరు వాళ్లకు లక్షణంగా భోజనాలు పెడతావుంటే వాళ్లు మాకు దొరుకుతారా? పల్లెల్లో వాళ్లకు ఏమీ దొరక్కపోతే వాళ్లు టౌన్లలోకి వస్తారు అప్పుడు మాకు దొరికిపోతారు. అది మీరు గుర్తు పెట్టుకోవాల" అన్నాడు సర్కిల్.

వాళ్లకు అన్నం పెట్టడాన్నే ఒక పెద్దనే రంగా మాటిమాటికీ పోలీసోళ్లు చెప్పడం పెద్దిరెడ్డికి మనస్తాపం కలిగించింది.

"సార్. మా పల్లెల్లో దొంగతనానికొచ్చిన దొంగనైనా సరే చేతికి చిక్కితే తొలి తొలీగా రెండు దెబ్బలు కొట్టి ఆనక వానికి కడుపునిండా అన్నం పెట్టేది మా గుణం, మా నీతి. మా పల్లెలోనికి వచ్చినవాడు కాలే కడుపుతో పోకూడదు. ఆకలి దగ్గర దొంగైనా ఒకటే దొరైనా ఒకటే! మీరేమను కున్నా సరే" అన్నాడు పెద్దిరెడ్డి దృఢంగా, కచ్చితంగా.

సర్కిల్ ఇన్‌స్పెక్టర్ ఖంగుతిన్నాడు. ఏమీ మాట్లాడలేకపోయాడు.

"సరే సరే, ఇప్పుడు మేము అడివిలోకి

కూంబింగ్ అపరేషన్‌కు వెళ్లాలి. అంటే అడివిలో నక్సలైట్ల కోసం గాలించడమన్న మాట" అన్నాడు పాత యస్సై.

"ఎంత దూరం గాలిస్తారు? ఈ అడవి ఈ పక్కన తిరుపతి నుండి ఆ పక్క కడప జిల్లాలోకి పోతుంది. ఎక్కడని ఎత కతారు మీరు" అన్నాడు ఆదెప్ప.

"ఎంత దూరం సాధ్యమైతే అంత దూరం వెతుకుతాం" అంటూ యస్సై ఆటూ ఇటూ చూచాడు జనంవైపు.

"ఏయ్ నువ్విట్రా, నువ్వు, నువ్వు, నువ్వు కూడా" అంటూ జగన్నాథరెడ్డినీ, పుల్లారెడ్డినీ, రాఘవరెడ్డినీ, కర్రోణ్ణీ ఒకప్రక్క నిలబడమన్నారు.

"మీరంతా మాతో కూడా అడివికి రావాలి. మాకు దోవ చూపించాల. అడివిలో తప్పిపోకుండా తిరిగిరావద్దా! అందుకు మీరు మాకు తోడురావాలి" అన్నాడు యస్సై.

అందరికీ గుండెలు గుభేలుమన్నాయి. ఇప్పుడు వీళ్ల వెంట వెళ్లకుంటే వీళ్లు ఊర్లో వాళ్లనందరినీ స్టేషన్‌కు పట్టుకుపోయేది ఖాయం. ఒకవేళ వెళ్తే రేపు అన్నలు ఏమంటారో?

మునిగాడు గాబరాగా ముందుకొచ్చాడు. "సార్ ఈయప్ప వద్దులేసార్. కొత్తగా పెండ్లయినోడు ఈ అడివిలో ఎప్పుడూ తిరిగినోడు కాదు. నేనొస్తాలెండి" అన్నాడు పుల్లారెడ్డిని చూపుతూ.

పుల్లారెడ్డి వెనక్కు వెళ్లిపోయాడు.

మునిగాడూ, కర్రోడూ ఒకరి మొగం ఒకరు చూచుకొని కళ్లెగరేసుకున్నారు.

"ఇదిగో షర్టులేసుకుని వచ్చేస్తాం" అని నలుగురూ ఇండ్ల మొగం పట్టారు.

"సార్లకు కాఫీ పెట్టిచ్చుకొస్తా. అంతలోపల మీరు ఏమైనా తినేసి రండి" అని భాస్కరరెడ్డి ఇంటికి వెళ్లాడు.

ఉత్తారెడ్డి ఆ నలుగురికీ వెనక నడుస్తూ "ఇదో నేజెప్పేది వినండి. యాడన్నా నక్సలైట్లు కనబడితే మీరు రెండు చేతులూ పైకెత్తేసి పక్కకొచ్చేయండి. వాళ్లూ వాళ్లూ కాల్చుకొని సావనీ. మీరు మాత్రం పోలీసుల ముందర నిలబడద్దండి. ఎవరైనా సరే - చేతులెత్తేసి నోళ్లను కాల్చకూడదు అది నీతి" అన్నాడు.

"ఆ నీతి ఇప్పుడెవరు సూస్తా ఉండాడు? " అన్నాడు మునిగాడు.

అందరూ వచ్చిన తరువాత జీపు, వ్యానూ అడవిలోకి బయలుదేరాయి. బండ్లు వెళ్లే దారి వెంట సుమారు రెండు కిలోమీటర్లు వెళ్లిన తరువాత ఇక జీపు వెళ్లడం కష్టమైపోయింది. అందరూ దిగి నడక ప్రారంభించారు.

"ముందుగా ఈ ప్రాంతంలో ఎక్కడెక్కడ నీటివసతి ఉందో అక్కడికి పదండి" అన్నాడు సర్కిల్.

ఉత్తరంగా రెండు కిలోమీటర్లు నడిచి ఒక మడుగు దగ్గరికి వచ్చారు.

"సార్, సార్, ఇక్కడ బీడీముక్కలూ, వక్కాకు ఎంగిలీ, అగ్గిపుల్లలూ ఉన్నాయి సార్", అని అరిచాడు ఒక కానిస్టేబుల్.

"ఇక్కడికి దగ్గర్లో ఏ పల్లెలున్నాయ్? " అని అడిగాడు సర్కిల్.

"ఎడంవైపు ఒక గంట నడిస్తే కాలువ పల్లె, ఈ పక్క అర్ధగంట నడిస్తే బలిజపల్లె వస్తాయి సార్" అన్నాడు మునిగాడు.

అక్కడేమీ నక్సలైట్ల ఆచూకీ దొరకలేదు. మరోవైపుగా మరో రెండు కిలోమీటర్లు నడిచి ఒక లోయలాంటి ప్రదేశంలోకి దిగారు. అక్కడ చెట్లు మరీ దట్టంగా ఉన్నాయి. ఒక వాగు పారుతూ ఉంది.

"సార్! సార్!" అరిచాడు మరో కానిస్టేబుల్. అందరూ అటు చూచారు. వరుసగా మూడేసి రాళ్లు పెట్టి వంటలు చేసిన చోటు కనిపించింది. పొయ్యిలో ఒక కట్టె దూర్చి కలబెట్టారు. అంతా బూడిద. అడుగున మినుకుమినుకుమని చిన్నచిన్న నిప్పురవ్వలు. ప్రక్కనే వార్చిన గంజి, మిరప

# చిత్రమైన స్కాలర్‌షిప్పులు

అమెరికాలోని చాలా యూనివర్సిటీలు విద్యార్థులకు స్కాలర్‌షిప్పులు ఇస్తాయి. ఉత్తమ విద్యార్థులకే కాక చదువుతో సంబంధంలేని విషయాల్లో కూడా స్కాలర్‌షిప్‌లను ఇవ్వడం విచిత్రం.

★ పెన్సిల్వేనియాలో ఓ కాలేజీలో కొత్తగా చేరిన విద్యార్థుల్లో ఎడమ చేత్తో రాసేవారికి వేయి డాలర్ల స్కాలర్‌షిప్ ఇస్తారు. దీన్ని ఫ్రెడరిక్ మేరి ఎఫ్ బెక్లీ అనేవారు ఇస్తున్నారు.




★ అల్లిక పనులు తెలిసినవారికి కాలిఫోర్నియా యూనివర్సిటీలో వందనుంచి వేయి డాలర్లదాకా స్కాలర్‌షిప్‌గా ఇస్తున్నారు. దీనిపేరు 'ది నేషనల్ మేక్ ఇట్ విత్ యువర్‌సెల్ఫ్ విత్ ఊల్' స్కాలర్ షిప్.

★ రెండో ప్రపంచయుద్ధంలో సబ్‌మెరైన్‌లో పని చేసినవారి పిల్లలకు ఏ యూనివర్సిటీలో చేరినా సరే 'ది డాల్ఫిన్ స్కాలర్‌షిప్ ఫౌండేషన్' కింద 1750 డాలర్ల స్కాలర్‌షిప్ ఇస్తారు.

★ ఐదడుగుల పది అంగుళాలు ఎత్తు దాటిన ఇద్దరు స్త్రీలకు, ఆరడుగుల రెండంగుళాలు ఎత్తు మించిన ఇద్దరు పురుషులకు వేయేసి డాలర్ల చొప్పున ఏ యూనివర్సిటీలో చదివేవారికైనా సరే స్కాలర్‌షిప్ ఇస్తోంది 'టాల్ క్లబ్ ఇంటర్నేషనల్' సంస్థ.

★ యూనివర్సిటీ ఆఫ్ నార్త్ కరోలినాలో చదివే గాట్లింగ్ అనే పేరు గల ఎవరికైనా 'ది జాన్ గాట్లింగ్ స్కాలర్‌షిప్' ప్రోగ్రాం కింద 6000 డాలర్లు స్కాలర్‌షిప్‌గా ఇస్తారు.

తొక్కలూ, వంకాయ తొడిమెలూ, ఎంగిలి విస్తరాకులూ కనబడ్డాయి.

"దొరికింది, నక్సలైట్ల స్థావరం దొరికింది. వాళ్లు రాత్రి కూడా ఇక్కడే ఉన్నట్లుంది. మనం వచ్చే సంగతి తెలుసుకొని ఈ తావు ఖాళీచేసి వెళ్లిపోయినట్లుంది" అన్నాడు సర్కిల్.

"మనం వచ్చే సంగతి వీళ్లకెట్లా తెలుస్తుంది సార్" అన్నాడొక కానిస్టేబుల్.

"వాళ్ల మనుషులు ఎక్కడా ఉండారు. ఈ పల్లెలో కూడా ఉండారు. ఇన్ఫర్మేషన్ అందించేస్తూ ఉంటారు. ఇట్లా ఇన్ఫర్మేషన్లు అందించేవాళ్లే మనదుంప తెంచేస్తూ ఉన్నారు. ముందు అట్టాంటోళ్లను ఎన్‌కౌంటర్ చేసి పారేయాల" అన్నాడు సర్కిల్.

చుట్టుప్రక్కల అంతా గాలించారు. గుట్ట దరిలో ఒక గుహలాంటిది కనబడింది. అంటే రెండు బండల మధ్య ప్రదేశం. లోపల కొన్ని పాత్రలూ, ఉప్పూ, పప్పూ, బియ్యంలాంటివి కనబడ్డాయి.

"ఆ బోకులు బయటికి లాగి చితగ్గొట్టేయండి" అన్నాడు యస్సై.

కర్రోడు ముందుకొచ్చి "సార్ వాటిని పాడుచెయ్యకండి సార్. మాకిచ్చేయండి ఇంటికెత్తకపోతాం. వాడుకుంటాం" అన్నాడు.

'సరే' అన్నట్లు చేయూపి ముందుకు కదిలాడు సర్కిల్.

ఆ వాగు దగ్గర పోలీసులందరూ వెంట తెచ్చుకున్న టిఫిన్లు తిని నీళ్లు తాగారు.

"ఇది కాకుల కోన సార్. ఇది సాధుగెవి. మునుపెప్పుడో ఇక్కడ ఒకసాధువు వుండి నాడంట.. ఈ చెట్లన్నీ ఆయన పెట్టినవేనంట" అన్నాడు మునిగాడు.

మళ్ళీ బయలుదేరారు పోలీసులు.

"సార్, సార్- ఆ ప్రక్క నీళ్ళుండవు. పోయినంత దూరమూ బండలూ, గుండ్లూ బోడిగుట్టలూ సార్. చెట్లు కూడా తక్కువ. అంతా బోదగంటల బీడే సార్" అన్నాడు మునిగాడు.

"సార్ ఈ ప్రక్క ఎంత దూరంపోయినా నీళ్ళు కనబడవు" అన్నాడు కర్రోడు.

"ఈ దోవన పోదాం రండి సార్" దారి తీశాడు మునిగాడు.

మరో రెండు కిలోమీటర్లు నడిచారు.

"సార్- సార్ ఇక్కడ మన్ను శానా లూజ్‌గా ఉంది సార్. తవ్విపోసినట్లుంది సార్" అన్నాడు ఒక కానిస్టేబుల్.

వెంటనే సర్కిల్ ఇన్‌స్పెక్టరు 'కిట్' లోంచి మెటల్ డిటెక్టర్ తీసి ఆ లూజ్ మట్టిపై అంతటా త్రిప్పిచూచాడు. ఏమీ సిగ్నల్స్ రాలేదు. మునిగాణ్ణీ, కర్రోణ్ణీ మన్ను తొలగించమన్నారు.

ఆరడుగుల పొడవూ, రెండడుగుల వెడల్పూ, రెండడుగుల లోతుగా గొయ్యి తేలింది. లోపల చిన్న చిన్న వైర్లు, గుడ్డపేలికలూ, రేకు ముక్కలూ కనబడ్డాయి.

"సో- ఇక్కడ ఆయుధాలు దాచారన్న మాట. మనం వచ్చే సంగతి తెలిసి వాటిని తీసుకొని పోయారన్నమాట. ఠట్- ఠట్! ఎవరో మన ఇన్ఫర్మేషన్ చేరవేస్తున్నార్రా. వాళ్ళెవరో తెలిస్తే ముందుగా వాళ్ళను కాల్చి పారేద్దును" అన్నాడు సర్కిల్.

అందరూ గడియారాలు చూచుకున్నారు. మధ్యాహ్నం రెండు గంటలవుతూ ఉంది. అందరి ముఖాలూ వాడిపోయి ఉన్నాయి. అందరిలోనూ విసుగూ, అలసటా కనబడుతున్నాయి.

"ఇక్కడి నుండి మనం జీపులు వదలివచ్చిన చోటికి దగ్గరి దారుందా? " అన్నాడు సర్కిల్.

"ఈ దిక్కుగా నేరుగా పోతే మన బండ్లుండే తావుకు బిరీన చేరుకోవచ్చు సార్. అదిగో అక్కడ రెండు తాటిమాన్లు కనబడతా ఉండ్లా? అక్కడే మనం జీపులు వదిలింది" అన్నాడు మునిగాడు.

రెండున్నరకు జీపుల వద్దకు వచ్చేశారు. ఊళ్ళోకొచ్చేసరికి మూడు దాటింది.

పెద్దిరెడ్డి ఇంట్లో భోజనాలు. ఇంట్లో గాలి రావడంలేదని అందరూ అరుగుల మీదనే భోజనాలు కానిచ్చారు. రెండు కోడి పుంజులు ఆ రోజు అవుట్.

భోజనాల తరువాత మళ్ళీ మీటింగు ప్రారంభమయింది.

సర్కిల్ మాట్లాడాడు.

"నక్సలైట్లు ఈ అడవిలోనే స్థావరాలు ఏర్పాటు చేసుకొని ఉంటారని తెలిసిపోయింది. మేం వచ్చే సంగతి వాళ్ళకెట్లనో ముందుగా తెలిసిపోయింది. వాళ్ళు స్థావరాలు ఖాళీ చేసి వెళ్ళిపోయారు. ఇట్లా మా సంగతి వాళ్లకు అందజేసే వాళ్ళను ఊరికే వదలము. ఏ మాత్రం సందేహం కలిగినా సింపుల్‌గా ఎన్‌కౌంటర్ చేసిపారేస్తాం. కేసూ లేదు, కోర్టూ లేదు. అంతే. కాబట్టి నక్సలైట్లకు దూరంగా ఉండండి. వాళ్ళకు ఏ విధంగానూ సహాయం చేయకూడదు. వాళ్లను ఊళ్ళోకి రానివ్వకండి. మంచినీళ్ళు కూడా ఇవ్వకండి. మీరూ అడవిలోకి వెళ్ళకండి" అన్నాడు సర్కిల్.

"మీరు చెప్పింది రైట్ సార్. వాళ్ళకు ఎంత దూరంలో ఉంటే అంత మంచిది సార్. వాళ్ళకు కావలసినవి సప్లైచేసే శక్తి మాకెక్కడుంది సార్. బక్క రైతులం. కచ్చితంగా మేమేమీ ఇవ్వలేము అని చెప్పేస్తా. ఈసారి వస్తే. కాని అడవిలోనికి వెళ్ళకుంటే మాకు ఎట్ట జరుగుతుంది సార్. ఒక మడక కొయ్య కావాలన్నా, మడికి ఆకు కావాలన్నా, ఇల్లు కప్పుకొనే బోద కావాలన్నా అడివికి పోవలసిందే కదా. వాళ్ళతో నేరుగా విరోధం పెట్టుకుంటే మా బ్రతుకులు సాగవు. పైకి వాళ్ళ మాటలు విన్నట్లే ఉంటాము. ఎంతైనా

మీరే మాకు దిక్కు. మీరు గవర్నమెంటు మనుషులు. మీరే మాకు రక్షణ. ఈ నక్స లైట్లు ఈ రోజు ఈ అడివిలో ఉండి రేపు ఇంకో అడవికి పోయేవాళ్ళు. ఎట్లైనా మీరు మాకూ, మేము మీకూ. మనకు తెగు తుందా సార్" అన్నాడు భాస్కరరెడ్డి.

సర్కిల్ ఇన్‌స్పెక్టర్ లేచి నిలబడ్డాడు. "నేను చెప్పేది ఒకటే మాట. కేసుల్లో తగు లుకొని కోర్టుల వెంట తిరగాలని కోరి కుంటే, లాఠీదెబ్బలు తినాలని కుశాలగా ఉంటే, చిప్పకూడు తినాలని ఆశగా ఉంటే ఎన్‌కౌంటర్‌లో చావాలని రాసిపెట్టుంటే నక్సలైట్ల ప్రక్క చేరండి. భూమి పట్టాలూ, బ్యాంకు లోన్లూ, ఊరి సౌకర్యాలూ కావా లంటే మా ప్రక్క ఉండండి. నక్సలైట్ల కద లికలను గురించి మాకు ఎప్పటికప్పుడు చెప్పండి. అంతే నేను చెప్పేది. అందుపైన మీ యిష్టం, మీ ఖర్మ".

పోలీసు జీపులు వెళ్ళిపోయాయి.

★ ★ ★

కార్తీక మాసం ముప్పై దినాలూ పెద్ది రెడ్డి ఇంటి ముందర పురాణ పఠనం జర గడం నాలుగైదు సంవత్సరాలుగా ఆనవా యితీ అయిపోయింది. మిట్టపల్లి స్కూలుకు చిత్తూరు పక్క నుండి దొరసా మిపిళ్ళై టీచరుగా వచ్చినప్పటినుండి ఈ ఆనవాయితీ ఏర్పడింది. పెద్దిరెడ్డి ఇంటి ముందర విశాలమైన బిడువు జాగా ఉండ డమూ, వాళ్ళ ఇంటికి పెద్దపెద్ద వసారా అరుగులుండడమూ అక్కడ పురాణ పఠ నానికి అనుకూలమయింది. కొండకింద పల్లెవాళ్ళేగాక మిట్టపల్లి నుండి కూడ కొందరు దొరసామి పిళ్ళైతో బాటు సాయంత్రమే వచ్చేసి పురాణం అయిపో గానే అయ్యవారితోబాటు వెళ్ళిపోతారు.

ఆ రోజు అభిమన్యువధా ఘట్టం జరుగు తోంది. దొరసామిపిళ్ళై అయ్యవారు కంచు కంఠంతో కొంతసేపు మామూలు వచనం గానూ కొంతసేపు రాగయుక్త వచనం గానూ పురాణం చెబుతున్నారు.

"ఆ ప్రకారంగా పద్మవ్యూహంలో జొర బడి యుద్ధంచేస్తూ ఉండేటటువంటి అభి మన్యుణ్ణి చుట్టూ కౌరవ ప్రముఖులందరూ కమ్ముకున్నారు. ద్రోణుడు అతని గుఱ్ఱా లను చంపివేశాడు, కృపాచార్యుడు సార థిని చంపివేశాడు. కర్ణుడు విల్లు విరగగొ ట్టేశాడు. పాపం అభిమన్యుడు పసివాడు .. క్రొత్తగా పెండ్లయినవాడు. ఆయుధాలు లేకుండా నేలపైన నిలబడి ఉన్నాడు. అటువంటి సమయంలో ఆ యొక్క శకుని, కృతవర్మ, బాహ్లికుడు మొదలైన వాళ్ళందరూ అభిమన్యునిపైన అనేక శస్త్రా స్త్రాలు ప్రయోగిస్తున్నారు..."

అప్పుడే దఢదఢమనే బూట్ల శబ్దాలూ, కట్టెల శబ్దాలూ చేసుకుంటూ పదహైదు మంది నక్సలైట్లు పెద్దిరెడ్డిబావి దోవన వచ్చి ఊరిమీదపడ్డారు. మునుపటిలాగే నినాదాలు చేసుకుంటూ విప్లవగీతాలు పాడుకుంటూ తుపాకులూ, వేటకొడ వండ్లూ ఊపుకుంటూ పెద్దిరెడ్డి ఇంటిముం దర పురాణం వింటున్న వాళ్ళనందనరినీ రచ్చబండ మీదికి రమ్మని కేకవేసి వెళ్ళి రచ్చబండపైన నిలబడ్డారు. పురాణం ఆగి పోయింది. జనం రచ్చబండకు చేరారు.

ఎవరి ముఖంలోనూ నెత్తురు చుక్క లేదు. గుండెలు దడదడలాడుతున్నాయి. మొన్న జరిగిన పోలీసు కూంబింగ్ ఆపరే షన్‌లో ఊళ్ళోవాళ్ళు పాల్గొనడం వాళ్ళకు కోపం తెప్పించి ఉంటుందని అర్థమవుతూ ఉంది. ఎవర్ని ఏం చేస్తారో, ఎట్లా తప్పిం చుకోవాలో తెలియడంలేదు. ఇప్పుడు పోలీ సులు వచ్చి కాపాడతారా?

రచ్చబండమీద నక్సలైట్ దళనాయకుడు ముందుకు వచ్చి ప్రారంభించాడు.

"మా పోరాటం ఎవరికోసం? "

"దోపిడీకి గురౌతున్న మీలాంటి రైతు కూలీల హక్కుల కోసం"

"మా ఈ ఉద్యమం దేనికోసం? "

"కర్షక కార్మికుల హక్కులకోసం"
"మేము తుపాకి పట్టింది దేనికోసం?
"బడాచోర్ల, పెత్తందార్ల తొత్తులై మమ్మల్ని హతమార్చడానికి పూనుకున్న పోలీసుల నుండి రక్షణకోసం"
"మేము మాసుఖజీవితాలను త్యాగంచేసి అడవులలో ఉంటున్నది ఎవరికోసం? "
"మీ కోసం, పీడితజన సంక్షేమంకోసం"
"ఇవన్నీ మీకు ఆనాడే చెప్పాం. కానీ మీరు చేస్తున్నదేమిటి? మమ్మల్ని పట్టుకో వడానికి వచ్చిన పోలీసులకు సాయపడు తున్నారు. మొన్న పోలీసులతోబాటు అడ వికి వెళ్ళినవారెవరు? లేవండి"
మునిగాడూ, కర్రోడూ, రాఘవరెడ్డి, జగ న్నాథరెడ్డి భయపడుతూ లేచి నిలబడ్డారు.
"మీరు ఉద్యమానికి ద్రోహం చేస్తు న్నారు. పీడిత ప్రజానీకానికి ద్రోహం చేస్తు న్నారు. మా విషయాలు పోలీసులకు మీ ద్వారానే తెలిసిపోతున్నాయి. కాకుల కోనలో మా స్థావరం పోలీసులకు తెల్సిపో యింది. బలిజపల్లెవాళ్ల ద్వారా మా పులి గుండు స్థావరం ధ్వంసమైపోయింది. ఆయుధాలు, వస్తుసామాగ్రి, రేషనూ పోలీ సుల వశమైపోయింది. ఇది మీకు న్యాయంగా ఉందా? మాకేనా మీరు ద్రోహం తలపెట్టవలసింది? "
ఎవరూ మాట్లాడలేదు. ముసలితనాన్ని అడ్డంపెట్టుకొని ఆదెప్ప మాటాడొచ్చు వద రుబోతుతనాన్ని అడ్డంపెట్టుకొని ఉత్తారెడ్డి మాటాడొచ్చు అతనే అందుకున్నాడు.
"అన్నా, మమ్మల్నెట్లా చావమంటా వన్నా. పోలీసులు తుపాకులు సూపి 'రండ్రా' అంటే పోకుండా ఉండేదానికి అవు తుందా? ఎముకలిరగ్గొట్టరూ. మీరైతే వాళ్ళను నిలవరించగలరేమోగానీ, మాకవు తుందా? " అన్నాడు ఉత్తారెడ్డి.
"అప్పటికీ వాళ్ళను దోవ తప్పించేస్తి నన్నా. జిల్లేళ్ళ మడుగుదగ్గర మీరుంటా రని నాకు అనుమానం తగిలె. అందుకే పోలీసోళ్లను ఆ ప్రక్క పోనీయకుండా ఇంకొక ప్రక్కకు మళ్ళించేస్తి" అన్నాడు మునిగాడు.
"అందరూ అట్లనే అంటా ఉండారు. బలిజపల్లెవాళ్ళు మాకేం తెలవదంటారు. కాలవపల్లోళ్ళు అదేమాట అంటారు. అయినా మాకు జరగవలసిన నష్టం జరి గిపోతా ఉంది. మా స్థావరాలు బయటప డిపోతా ఉండాయి. మద్దిమాను మడుగు దగ్గర దాచిపెట్టిన మా రేషన్ పోలీసులకు దొరికిపోయె. దయ్యాల దొనదగ్గర దాచిపె ట్టిన మా ఆయుధాలు పోలీసులకు దొరికి పోయె. ఇదంతా మీ పల్లెల వాళ్ళు చెప్పక పోతే వాళ్ళకెట్లా తెలుస్తుంది" అన్నాడు దళ నాయకుడు తీవ్ర స్వరంతో.
"మేమెట్ల చెప్తామన్నా, మీ స్థావరాలు మాకు తెలుసునా? మేము అడవిలో యానాడైనా అంతంత దూరం తిరిగి నామా? ఒకవేళ తెలిస్తే మాత్రం మేమెం దుకు చెప్తామన్నా? మాలాంటి వాళ్ళు మీరు. మీలాంటి వాళ్ళం మేము. మాకు అన్యాయం జరిగితే మా వెనక నిలబడేది మీరు. పోలీసోళ్ళు మా కష్టసుఖాలు పట్టించుకుంటా వుండారా? ఎద్దుపుండు కాకికి నొప్పా? " అన్నాడు జగన్నాథరెడ్డి.
"అవన్నీ మేం నమ్మం. మీలోనే పోలీసు ఇన్ఫార్మర్లు ఉండారు. ఇదిగో నువ్వు. నువ్వుచెప్పు మొన్న బాకరాపేట నుండి మీ ఇంటికి వచ్చినోడు ఎవరు? ఎందుకొచ్చి నాడు. నిజం చెప్పు" అన్నాడు దళనాయ కుడు కర్రోనివైపు వేలు చూపుతూ.
కర్రోని నెత్తిన పిడుగు పడినట్లయింది.
"అన్నా, అన్నా, నాకేమీ తెల్దన్నా. నేను చెర్నాకోలలు బాగా కడతా. చర్మం వారు ను సన్నగా తీసి బాగా జడ అల్లుతా. బాక రాపేట పుల్లిగాడు నా దగ్గర ఒక్కొక్క చెర్నాకోల పదేసి రూపాయలకు తీసక పోయి సంతల్లో అమ్ముకుంటాడు. మొన్నొచ్చి ఇరవై చెర్నాకోలలు కట్టించక

పోయినాడు. ఇంతకుమించి ఇంకేమీ లేదన్నా. దేవుని మింద ఒట్టు" అన్నాడు కర్రోడు తలపై చేయిపెట్టుకొని.

"వాడక్కడ పోలీసోళ్ళ సుట్టూ తిరగతాడు తెలుసునా? " అన్నాడు నాయకుడు.

"సత్తె ప్రమాణంగా నాకు తెల్దన్నా" అన్నాడు కర్రోడు.

"మొన్న రొంపిచెర్ల నుండి నీ దగ్గరకి ఒకడు వచ్చి మాట్లాడి పోయినాడు. వాడెవుడు? ఎందుకొచ్చినాడు. కథలు చెప్పకుండా నిజం చెప్పు" అన్నాడు నాయకుడు రాఘవరెడ్డి వైపు వేలు చూపుతూ.

"మద్దిలేటిలో నాకు రవంత ఇంటిజాగా ఉందన్నా. దాన్నమ్ముతావా అని అడిగేదానికి వచ్చినాడన్నా" అన్నాడు రాఘవరెడ్డి.

"అందరూ ఏదో ఒక కథ అల్లి చెప్తారు. ఆ కథలు మేము నమ్మాలంటారు. అదేం లాభంలేదు. మీలో పోలీసోళ్ళకు ఇన్ఫార్మర్లుగా పనిచేస్తా ఉండే వాళ్ళను మేము కనిపెట్టేస్తాం. మేము పట్టుకుంటే మాత్రం ఊరికే వదిలిపెట్టం" అన్నాడు నాయకుడు.

అంతవరకూ మౌనంగా ఉండిన మరో నాయకుడు అందుకున్నాడు.

"చూడండి, దొంగలు దొంగలు చేరి ఊళ్లు పంచుకున్నట్లు ఈ బడాచోర్లు కుమ్మక్కై దేశాన్ని దోచుకుంటున్నారు. పొలంలో దిగి కష్టపడేవానికి కడుపు నిండడం లేదు. పెత్తనం చెలాయించేవాడు బొజ్జ పెంచుకుంటున్నాడు. రైతు తన పంటను అమ్ముకొనేటప్పుడు ఈ వ్యాపారస్తులు అందరూ ఒకటైపోయి ధర తగ్గించేసి సరుకంతా కొనేస్తారు. తరువాత ధరలు పెంచేసి రెండుమూడింతలకు అమ్ముకుంటున్నారు. ఆ లాభంలో రైతుకు భాగం కావాలంటాము మేము. ఈ మనిషి తయారుచేసే చెర్నాకోలకు పుల్లిగాడు ఇచ్చేది పది. వాడు అమ్ముకొనేది ఇరవై అయిదూ, ముప్పై రూపాయలకు. ఆ ధరలో ఇతనికీ వాటా కావాలంటాము మేము. ఇది మచ్చుకు చెప్పిన వ్యాపారం. ఇలాంటి వ్యాపారాలు చాల ఉన్నాయి"

"ఉన్నట్లుండి గవర్నమెంటోళ్ళు కొలిమి పెట్టాలంటే లైసెన్సు ఉండాలి అనే రూలు పెట్టినారనుకో. ఏం? అట్లా పెట్టరనుకున్నావా? వాళ్ళ మనుషులకు లాభం కలిగించాలంటే ఈ గవర్నమెంటోళ్ళు ఏ రూలైనా పెడతారు. వాళ్ళు తలుచుకుంటే అసెంబ్లీలో చట్టం కూడ తెస్తారు. అసెంబ్లీలో ఉండేవాళ్ళందరూ వాళ్ళే కదా - అట్లాంటి చట్టం తెచ్చేకదా అప్పుడు బంగారు పనోళ్లనూ, గీత పనోళ్ళనూ నాశనం చేసింది. అట్లా రూలుపెట్టినారనుకో. లైసెన్సు నీకు దక్కనీరు. ఏ సలారు సాయిబో, ఏ శ్రీనివాసులు నాయుడో లైసెన్సు కొట్టేస్తాడు. అప్పుడు పనిచేసేది నువ్వే. నీకు దినకూలి. వాళ్ళకు లాభాలు. ఇది న్యాయమా అన్యాయమా మీరే చెప్పండి?

ఇలాంటి అన్యాయాలను మేము ఎదుర్కొంటాం. అందుకే ఈ బడాచోర్లకు మాపైన క్రోధం. మా ఉద్యమాన్ని నిషేధించి మమ్మల్ని నేరస్థులుగా ప్రకటిస్తున్నారు. అసలు సిసలు నేరస్థులు వాళ్ళు. మాపైన పోలీసుల్ని ఉసికొల్పుతారు.

ఇలాంటి పోలీసులకు మీరు సహకరించ కూడదు. మా ఆచూకీ వాళ్ళకు చెప్పకూ

### కొత్తగాలి...

**ప్రకృతి**<br>
**పురివిప్పి నాట్యం చేస్తే**<br>
**తల్లి ప్రకృతి!**<br>
**ప్రళయ నృత్యం చేస్తే**<br>
**సవతి తల్లి ప్రకృతి!!**

– తాజీప్రసాద్, చెన్నై

డదు. అలా చెప్పేవాళ్ళను మేము కచ్చితంగా పట్టుకుంటాం. వాళ్ళకు జరిగే శాస్తి అట్లా ఇట్లా ఉండదు. చాలా ఘోరంగా ఉంటుంది. జ్ఞాపకం పెట్టుకోండి. మీరు మాకేమీ ఇవ్వవలసిన పనిలేదు. మేము వేరే మార్గాల్లో తెప్పించుకుంటాము" అంటూ అందరూ లేచారు. వీడ్కోలు తీసుకొని అడవివైపు వెళ్ళిపోయారు.



ప్రొద్దుగూకి ఇంటికొచ్చిన పెద్దిరెడ్డికీ భాస్కరరెడ్డికీ నీళ్ళిచ్చి వాళ్ళు అరుగులమీద కూర్చున్న తరువాత జానకమ్మ కూడ అక్కడే కూర్చుంది.

"ఏమి చేసుకొస్తిరి. అయ్యవారు ఏమి చెప్పె? " అడిగింది జానకమ్మ.

"మాఘమాసం పదోదినం ముహూర్తం పెట్టినాడు అయ్యవారు. ఫిబ్రవరి నెల అయిదో తేది బేస్తవారం వస్తుంది. కాగితంలో రాసిచ్చినాడు" అని జేబులోంచి మడత వేసిన పెద్ద కాగితం తీసి జానకమ్మ చేతికిచ్చాడు భాస్కరరెడ్డి. నాలుగు మూలలా పసుపూ, కుంకుమా బొట్టుపెట్టిన కాగితం చూచి కండ్లకద్దుకొని అలాగే చేతిలో పట్టుకుంది జానకమ్మ.

పశువుల కొట్టంలో ఏదో పని చేసుకుంటున్న రాఘవరెడ్డిని పిలిచి లగ్న పత్రిక చూపించాడు భాస్కరరెడ్డి.

"మాఘ శుద్ధ దశమి, గురువారం సరియగు ఫిబ్రవరి నెల అయిదవ తేదీ ఉదయం ఎనిమిది గంటలపైన తొమ్మిది గంటలలోగా శుభ కుంభలగ్నమందు వివాహం" అని ఉంది అందులో.

జానకమ్మ అందరినీ కాళ్ళు చేతులూ కడుక్కురమ్మని లగ్న పత్రికను నట్టింట గోడకు వ్రేలాడుతూ ఉన్న వేంకటేశ్వర స్వామి పటం ముందర చెక్కస్టాండుపైన పెట్టి హారతిచ్చి అందరికీ చూపింది. అందరూ భక్తిగా హారతి కళ్ళ కద్దుకున్నారు. లగ్న పత్రికను ఒక గుడ్డలో చుట్టి ట్రంకు పెట్టెలో భద్రపరచింది జానకమ్మ.

పెద్దిరెడ్డీ, భాస్కరరెడ్డి, జానకమ్మా అరుగుల మీద కూర్చున్నారు.

"భాస్కరా! ఇంకెన్నాళ్ళు? ఒకటిన్నర నెలే కదా. శానా పనులుండాయి. ఎట్ల చెయ్యాల్నో ఏమో? " అన్నాడు పెద్దిరెడ్డి.

"అన్నీ జరిగిపోతాయి. మేమందరమూ ఉండ్లా? నువ్వు ఏమేమి చెయ్యాల్నో చెప్తా వుండు. మేము చేసేస్తాం. మనూర్లో ఒక పెండ్లి జరిగితే ఊర్లో వాళ్ళంతా తలా ఒక చెయ్యి వేసేది ఎప్పుడూ ఉండేదే కదా? "

"రామనాథంశెట్టి దగ్గర శెనిక్కాయల దుడ్లు రావల్ల. ఆ దుడ్లు తీసుకొచ్చి సీత మెళ్ళోకి రెండు పేటల చైను చేయించల్ల. ఇంకొక జత కమ్మలూ, ముక్కుపుల్లా, ఉంగరమూ చేయించల్ల. గుడ్డలు కొని కుట్టించల్ల. రాఘవునికి వాచీ ఉంగరమూ ఇయ్యాల" చెప్పుకు పోతున్నాడు పెద్దిరెడ్డి.

"మామా నీకు చెప్పేది మరిచిపోయినా. రాఘవుని ఊళ్లో ఇంటి జాగాకు బేరం వచ్చిందంట. రోడ్డు పక్కని రెండు కుంటల జాగా ఎనిమిది వేలకు అడగతా ఉండారంట. ఇచ్చేస్తానన్నాడు. ఒక వారం నిదానించు ఇంకొక వెయ్యైనా ఎగబడుతుంది అని నిలిపిపెట్టి. వారం పది దినాల్లో రాఘవునికి ఆ దుడ్లు వస్తాయి. పట్టుచీర, తాలిబొట్టు కొని మిగిలిన దాంతో సీతకు గాజులుగానీ, బొట్టు చైను గానీ చేపిస్తా అంటా వుంటాడు" అన్నాడు

భాస్కరరెడ్డి.

"అదంతా నువ్వే చూసుకో. పెండ్లినాడు పెండ్లికొడుకు మీ ఇంట్లో నుండే ఎలబారి రావల్ల" అన్నాడు పెద్దిరెడ్డి.

"ఇంకేమీ? ఈ రూములో నుండి ఎలబారి వస్తాడనుకుంటివా? " నవ్వాడు భాస్కరరెడ్డి. ఆ మాటతో జానకమ్మ ముఖంలో ఒక తృప్తి కనబడింది. మొదటిది రాఘవునికి తన పూర్వ నివాసంతో సంబంధాలు పూర్తిగా తెగిపోవడం. రెండవది పెండ్లి కొడుకు ఒట్టి చేతులతో నిలబడ్డాడనే చిన్నతనం తప్పిపోయి అందరు పెండ్లి కొడుకుల లాగానే ఇతడూ పెండ్లి కూతురికి సొంతంగా ఒక నగ చేయించాడని చూపే అవకాశం లభించడం.

"మడి ఆరిపోయింది. ఇంక నాలుగైదు రోజుల్లో కోసేసి నాలుగు రోజులు ముగ్గేసి కొట్టెయ్యచ్చు" అన్నాడు పెద్దిరెడ్డి.

"నాలుగు దినాలు కాకపోతే ఒక వారం ముగ్గనీ. ముగ్గకుంటే కొత్త బియ్యం వండితే ముద్ద కడుతుంది. పెండ్లిలో బాగుండదు" అంది భార్య.

"చెనిగ్గింజలు అట్లనే ఉండాయి. గాని గాడించల్ల.. నూనె కావొద్దూ"

"ఇంటికి సున్నం కొట్టించల్ల, ఇంటి ముందర ఈ బిడువు జాగాలో పల్చగా మన్ను తోలించి వార వారమూ పేడనీళ్ళు చల్లి గట్టించల్ల"

"మంగల మునిరామునికి చెప్పి మేలగాళ్ళను మాట్లాడ మనల్ల"

"వంటోళ్ళు కావాల్నా? "

"ఎందుకూ, బరువు గుండాలు దించడానికీ, పట్టడానికీ ఇద్దరు మొగోళ్ళుంటే ఆడోళ్ళే చేసేస్తారు వంట. పొయ్యికాడ మా అమ్మ కూసుంటే సాలు. అయిపోతుంది"

"కుమ్మరోళ్ళకు చెప్పొద్దూ, తొట్లూ, అరివేణి కుండలూ తెమ్మనొద్దూ!"

"పొయ్యిలోకి కట్టెలూ, పందిటికీ గుంజలూ, వాసాలు కొట్టుకోని రావల్ల"

"రేపు జగన్నాథుణ్ణీ, పుల్లారెడ్డినీ, నరసింహుణ్ణీ, ఇరగంరెడ్డినీ పిలిచి ఎవరెవరికి ఏమేం పనిచేప్తావో చెప్పెయ్. చేసేస్తారు. ఒక కాగితం మీద పెండ్లి తేదీ, ముహూర్తం టైము రాసి పెండ్లికి ఎవురెవుర్ని పిలవాల్నో వాళ్ల పేర్లూ, ఊర్లూ రాసి చాకల గురవనికి ఇచ్చెయ్"

"రాఘవుని మేనత్త దగ్గరికి రాఘవుడు పోనే పోతాడు. మనం కూడా ఒక మనిషిని పంపల్ల. ఆయమ్మను నాలుగు దినాలు ముందుగా రమ్మనల్ల"

ఇలా సాగిపోయాయి పెండ్లి ఏర్పాట్లను గురించిన మాటలు.

★ ★ ★

రొమ్ముచుట్టూ లోపల ప్రక్కటెముకలు

## వింతేముంది?

చుట్టూ పదిమంది కుర్రాళ్ళతో ఉన్న సోక్రటీస్‌ను ఒకనాడు కాలిస్టో అనే వేశ్య సమీపించి, 'నేను 'సై'.. అంటే చాలు నీ స్నేహితులు, శిష్యులు మొత్తం నా దగ్గరకొచ్చేస్తారు.. కానీ నా స్నేహితులనైతే కనీసం నువ్వు నీవైపు కన్నెత్తి చూసేలాగా కూడా చేయలేవు' అని అంది.

'ఔను నిజమే' అన్నాడు ఆ తాత్త్వికుడు. తర్వాత తనకూ, ఆమెకూ భేదం ఏమిటో



చెబుతూ, 'సులువైన అడ్డదారులగుండా నీవు తీసుకుపోతావు. నేను ఎత్తయిన సద్గుణ శిఖరాలు ఎక్కించడానికి శ్రమపడతాను. కష్టమైన మార్గం అంటే అందరూ వెనకడుగు వేయడం వింతేముంది? ' అన్నాడు.

అదిమి పట్టుకొని ఉన్నాయి. కాబట్టి సరి పోయింది కానీ లగ్నపత్రిక చూచినప్పటి నుండీ రాఘవరెడ్డి హృదయంలో ఆనందం, ఉద్వేగం పెల్లుబికి రొమ్మును పిక్కటించుకొని బయటికి వచ్చేస్తుందేమో అన్నంత ఉద్ధృతంగా ఉంది. పడు కున్నాడన్న మాటే కానీ నిద్రపట్టలేదు.

ఇది కలా, నిజమా, గాలికి ఎగిరిపోయే పుల్లాకు మాదిరి కొట్టుకుపోతూ ఉండిన తన బతుకు ఉన్నట్లుండి వడ్డించిన విస్తరి అయిపోయింది. అడుసులో నాటిన రాతి కూసంలాగా ఊగుతూ ఉండిన తన జీవితం కాంక్రీటులో వేసి బిగించినట్లయి పోయింది. ఎవరింత తిండి పెడ్తారా అని ఎగజూస్తూ ఉండిన తన బతుకు ఒకరి కింత పెట్టే స్థితికి వచ్చేసింది. నా అనే వాళ్ళు లేని తన ఒంటరితనానికి ఊళ్ళో వాళ్ళందరూ 'మేమంతా నీ వాళ్ళమే' అని వెన్నుదన్నుగా నిలబడుతున్నారు. ఒక ప్పుడు తనకు తల్లీ తండ్రీ, ఇల్లూ వాకిలీ లేకుండా చేసి ఊర్లోంచి తరిమేసిన దేవుడు 'అయ్యో పాపం' అనుకున్నాడేమో తనకు మళ్ళీ అన్నీ అమర్చి పెడుతున్నాడు. తల్లీ తండ్రీ లాంటి అత్తమామలు దొరికారు. అపురూపమైన భార్య దొరికింది.

సీత అంటే సీతే. ఏమి బుద్ధి, ఏమి గుణం, ఉన్న దాంట్లో ఒకరికింత పెట్టాలనే బుద్ధేగానీ తానూ, తనవాళ్లు మాత్రమే తినాలనే బుద్ధిలేదు. తనకున్నదే తనకు చాలు అనే బుద్ధే గానీ వాళ్ళకూ వీళ్ళకూ ఏవేవో ఉన్నాయి.. తనకు లేవే అనే అసం తృప్తి లేదు. అవన్నీ తనకు కావాలనే పేరాశా లేదు. తానంటే ఎందుకింత ఇష్ట పడిందో తెలియదు. గుడ్డిగా, గాఢంగా, వెనుకడుగు లేకుండా ధైర్యంగా ప్రేమిం చింది. ఆ ప్రేమ ఫలించేందుకు దారి కూడా చూపింది. తన కోరిక నెరవేర్చుకు నింది. సీత తోడూనీడా పట్టుకొని తాను మళ్ళీ మనిషౌతాడు. సరికులస్థులలో తలె త్తుకొని నిలబడతాడు. చూచేవాళ్ళ కళ్ళు చెదిరేలాగా ఇద్దరూ అన్యోన్యంగా కాపురం చేసుకుంటారు. బిడ్డల్ని కంటారు.

రత్నాల్లాంటి ఇద్దరు పిల్లలు చాలు. వాళ్ళను బాగా చదివించుకుంటాడు. పెద్ద ఉద్యోగాలు దొరికితేనే బయటికి పంపు తాడు. చిన్న ఉద్యోగాలకు పంపకూడదు. పల్లెలోనే నిలిపేస్తాడు. పొదుపుగా బతికి మరింత భూమి సంపాదించుకుంటాడు.

ఇదంతా సాధించాలంటే సీతా, తానూ ఒకరి మనసు ఒకరు తెలుసుకొని నడచు కోవల్ల. సీత తన అదృష్ట దేవత - ఎప్ప టికీ ఆమె మనస్సు నొప్పించకూడదు.

లోపల గదిలో ఒంటరిగా పడుకున్న సీత పరిస్థితి కూడా అలాగే ఉంది.

ఏ ఆడదానికి దొరుకుతుంది తనకు దొరికిన అదృష్టం. కాబోయే మొగుణ్ణి నాలుగైదు నెలలు పరీక్షించి- కోపంలో, సంతోషంలో, సుఖంలో, కష్టంలో అతనెట్లా ఎట్లా మారుతాడో, ఎట్లా ఎట్లా నడుచుకుం టాడో గమనించి తనకు సరైన భర్త అని నిర్ణయించుకొనే అవకాశం, అదృష్టం ఎంద రాడవాళ్ళకు దొరుకుతుంది?

పెండ్లిచూపులకని ఎవరో దారినపోయే దానయ్య వచ్చి మంచం మీదనో, కుర్చీ మీదనో కూర్చుంటాడు. ఆడపిల్ల ఒకసారి మంచినీళ్లు, రెండోసారి టిఫినూ, మూడో సారి కాఫీ తెచ్చి ఇస్తుంది. అంతే వానితల, చేతులు, పాదాలు కనబడతాయి. వాని బుద్ధి కనబడదు, గుణం కనబడదు. వాని అలవాట్లు కనబడవు. ఆడపిల్ల తల్లి దండ్రులకు కూడా అవన్నీ కచ్చితంగా తెలి యవు. వాళ్ళు వీళ్లూ చెప్పింది నమ్మేస్తారు. పెండ్లి నిశ్చయమైపోతుంది. గొర్రె కసాయి వాని ముందర తలవొంచుకున్నట్లు వాని ముందర తలవొంచుకొని కూర్చుంటే వాడు తాలిబొట్టు కట్టేస్తాడు. వానివెంట తలవొం చుకొని వెళ్ళిపోవాలి. పుట్టినప్పటి నుండీ ఆనాటివరకూ తనను సాకిన తల్లిదండ్రు

లనూ, తనవాళ్ళనూ, తన ఊరివాళ్ళనూ అందరినీ వొదిలేసి ఆ కొత్త మనిషితో వెళ్ళిపోవాలి. రేపటి నుండి తన బతుకు ఎట్లా ఉంటుందో తెలియదు. ఆ మొగుడు ఎట్లాంటివాడో, వాని ఇంట్లోనివాళ్లు ఎట్లాం టివాళ్ళో ఏమీ తెలియదు. అలాంటిచోటికి వానివెంట వెళ్ళిపోవాలి. వాళ్ళ కొంపలోనే నిలిచిపోవాలి. అంతవరకు ముక్కూ మొగమూ తెలియని వాని పక్కన పడుకో వాలి. తాను ఇన్నేండ్లుగా పదిలంగా దాచు కున్న అందాలూ, వయస్సూ, వాని ముందర పరిచెయ్యాలి. ఛీ ఛీ.. అదేం పెండ్లి? వాడేం మొగుడు? అదేం సంసారం?

ఈ సిగ్గులేని ఆడజాతి ఇంతకాలమూ దీనికి ఎలా అలవాటు పడిపోయింది?

దేవుడు తనకు ఇలాంటి అవకాశం ఇచ్చాడు కాబట్టి తన ఆలోచనలు ఇలా సాగుతున్నాయిగానీ, లేకుంటే తానూ ఈ పాటికి ఆ ఉదయమాణిక్యం పిలగాడితో ఛీ. ఛీ... ఆ ఆలోచనే అసహ్యంగా ఉంది.

తన మొగుడు తాను ఎరిగిన మొగుడు. నికార్సైన మనిషి. దాపరికంలేని మనిషి. మనస్సులో ఏమనుకుంటాడో అదే మాట్లా డతాడు. ఏం మాట్లాడతాడో అదే చేస్తాడు. ఇంట్లో సర్వ స్వతంత్రమూ ఇచ్చినా మిడిసిపడకుండా, హద్దులు మీర కుండా ఉన్నాడే ఆ నీతే తనను మెప్పించి ఇతడే తన మొగుడు అనుకొనేలా చేసింది.

తాను ఈ ఇల్లూ, ఈ ఊరూ వదిలిపెట్టే ప్రశ్నేలేదు. ఈ ఇల్లు ఎప్పటికీ తనదే. ఈ ఇంటిని ఇప్పటి మాదిరిగానే పదిమందికీ అన్నంపెట్టే ఇల్లుగానే పెట్టుకోవాలి.

నాగరత్నా, సావిత్రి, పద్మ నా సంసారం చూచి 'ఇల్లంటే సీత ఇల్లే ఇల్లు. మొగు డంటే సీత మొగుడే మొగుడు. బిడ్డలంటే సీతబిడ్డలే బిడ్డలు అనుకోవాలి.'

బిడ్డలు- అవును- ఇద్దరు చాలు. మగబి డ్డలైనా, ఆడబిడ్డలైనా సరే. బాగా చదివిం చాల. పెద్ద పెద్ద ఉద్యోగాలకు పంపాల.

నాగరత్నా, తమాషాకు అంటివో, ఎగతా ళికంటివో నీమాటే నిజమైపోయిందే. ఎట్టాంటి ఆలోచనొచ్చిందే నీకు అనాడు.

అబ్బ, ఇంకా ఒకటిన్నర నెల. నలభై అయిదు దినాలు. ఎప్పుడు గడిచేది! ఎప్పుడు అతని ఒళ్ళో వాలిపోయేది. ఎప్పుడు అతని రొమ్మున తలపెట్టుకొని నిద్రపోయేది! ఎప్పుడు అతని ఒళ్ళు తన ఒళ్ళూ పెనవేసుకొని పడుకొనేది! ఇంక బాయి దగ్గరా మేమే, సపారులోనూ మేమే. మర్రిమానుకిందా మేమే.

అవునూ. పెండ్లయినాక అతను వసారా గదిలో పండుకుంటాడా? ఈ గదిలో పండుకుంటాడా?

సీత నవ్వుకుంది.

ఇంత కాలంగా లేనిది, ఈ రోజు తన శరీరం ఒక రకమైన ఒత్తిడిని ఆశిస్తూ ఉంది. ఎదపైన బరువును కోరుకుంటూ ఉంది. ఒక కఠినమైన స్పర్శక్రింద నలగా లని శరీరం తహతహలాడుతూ ఉంది.

సీత మళ్ళీ నవ్వుకుంది. ఎప్పుడు నిద్రప ట్టిందో తెలియదు..

---

## 14

మద్దిలేటిలో రాఘవరెడ్డి ఇంటి జాగా తొమ్మిదివేలకు బేరం ఖరా రైపోయింది. టిఫిన్, టీ అమ్మే హోటలూ, చిన్న చిల్లర అంగడీ పెడితే బాగా జరుగు తుంది.

రమేష్‌నాయుడు ఎంతోకాలంగా రోడ్డుప క్కన టీ అంగడి నడుపుతూ ఉన్నాడు. తిరుపాలురెడ్డికి రోడ్డుపక్కన తాను కూడా ఒక టిఫిన్, టీ అంగడీ, చిల్లర సరుకుల అంగడీ పెట్టాలని చాలా రోజులుగా కోరిక. తావు దొరకలేదు. ఇప్పుడు రాఘవ రెడ్డి ఇంటిజాగా రోడ్డు పక్కనున్నది అమ్మ కానికి రావచ్చునన్న ఊహ కలిగింది. ప్రయత్నాలు మొదలుపెట్టాడు. ఎలాగో

తొమ్మిదివేలకు సెటిల్ అయిపోయింది.

పీలేరులో రిజిస్ట్రేషన్ జరగాలి.

రాఘవరెడ్డి ఇంట్లోవాళ్లకు చెప్పి పీలే రుకు బయలుదేరాడు. పదిగంటలకు పీలేరు చేరుకున్నాడు. బస్టాండులో తిరు పాలురెడ్డి కాచుకోనున్నాడు. టీ అంగట్లో టీ త్రాగి సబ్ రిజిస్ట్రార్ ఆపీసుకు వెళ్ళారు. దస్తావేజులు వ్రాయించి ఆఫీసులో దాఖలు చేసేటప్పటికి పదకొండున్నర. రిజిస్ట్రేషన్ పూర్తయ్యేసరికి ఒంటిగంట. రాఘవరెడ్డికి తొమ్మిదివేలు చేతికొచ్చాయి. తిరుపాల్ రె డ్డిని వెంటబెట్టుకొని వెళ్ళి బంగారు అంగ డిలో తాళిబొట్టు కొన్నాడు. తనకు బట్టలు కొన్నాడు. పట్టుచీర సెలెక్షన్ తనకేం తెలుసు? డబ్బు జానకమ్మచేతికి ఇచ్చేస్తే సరి. ఆ పని వాళ్ళు చూచుకుంటారు.

ఇద్దరూ హోటల్లో భోంచేసిన తరువాత తిరుపాలురెడ్డి వెళ్ళిపోయాడు.

రాఘవరెడ్డి బస్టాండువైపు నడుస్తూంటే ఎదురుగా ఓ కానిస్టేబుల్ అడ్డంగా నిల బడ్డాడు. తాను ఎటువైపు తొలిగితే అటు వైపు అడ్డొస్తున్నాడు. రాఘవరెడ్డి నిర్ఘాంత పోయి కానిస్టేబుల్‌వైపు తేరిపార చూచాడు. అరె! బాగా తెలిసిన మొగం.

"ఒరే రాఘవా బాగుండావారా?" అన్నాడు కానిస్టేబుల్ రాఘవరెడ్డి భుజం పైన చేయివేసి. అప్పుడు గుర్తుకొచ్చింది. అతను తన క్లాస్‌మేట్ గంగులు.

"ఒరే గంగులూ నువ్వారా? పోలీసు ఉద్యోగంలో చేరినావా? అమ్మానాయనా బాగుండారా? ఆ ఇంట్లోనే ఉండారా?" అన్నాడు ఆనందంగా.

"గుర్తుపడితివే. అంతా బాగుండారు. అదే ఇంట్లో ఉండాం. బాడుక్కుండిన ఇల్లు కొనేస్తిమి. నువ్వేంచేస్తా ఉండావు? మనం తొమ్మిదో తరగతి చదివేటప్పుడు మీనా యన చచ్చిపోయె. సదువు సాలిస్తివి. మల్ల కనబడనే లే. ఇప్పుడు మీ పల్లెలోనే ఉండావా? ఏం చేస్తావుండావు?"

"ఇప్పుడు మా పల్లెలో లేనురా. నెరబైలు దగ్గర కొండకింద పల్లెలో ఉండా. సేద్యం చేసుకుంటా ఉండా."

"అక్కడ భూములు సంపాదిస్తివా?"

"అక్కడ నాకు భూములెక్కడివి? ఒక రైతు దగ్గర సేద్యానికుండా! నీ డ్యూటీ ఎట్లా ఉంది?"

"ఏం చెప్పేది? పోలీసు ఉద్యోగం ముందు మాదిరి లేదు. ఒకప్రక్క రాజకీ యాలవాళ్లతో మొట్టికాయలు, మరోప్రక్క నక్సలైట్లతో సావు. ప్రాణాలరచేత పట్టు కోని బతకతా ఉండాము. మొన్నేమైందో తెలుసా! దిన్నెల అడివిలో కూంబింగ్ ఆప రేషన్‌కు పొమ్మనిరి. పదిమంది కానిస్టే బుల్స్, ఇద్దరు యస్సైలు, ఒక సర్కిల్ జీపూ వ్యానూ ఏసుకోని ఎలబారితిమి. అడివంతా తిరిగితిమి. దావ తప్పిపోతిమి. తిండీలే - నీల్లూలే కడాన దొంగ సారాయి కాచే యానాదోళ్లను పట్టుకొని దోవ కను క్కోని పీలేరు చేరేటప్పటికి అర్ధరాత్రి అయ్యింది. అట్లా వుంది మా బతుకు."

"అడవిలో నక్సలైట్లు కనబడలేదా?"

"ఎవురూ కనబడలే"

రాఘవరెడ్డి కొండక్రిందపల్లె దగ్గర జరి గిన కూంబింగ్ ఆపరేషన్ సంగతి గురించి చెప్పాడు.

మాట్లాడుతూ పోలీసుస్టేషన్ వరకూ వచ్చారు. గేటుదాటి లోపలికి వెళ్లారు. వరండాలో ఉన్నాడు యస్సై.

"ఏయ్ లెవన్ జీరో ఎవరతను?" అన్నాడు యస్సై.

"నా క్లాస్‌మేట్ సార్. చానా ఏండ్ల యింది చూచి. ఇప్పుడు కనబడ్డాడు"

"ఏ ఊరు"

"మద్దిలేరు! ఇప్పుడు నెరబైలు దగ్గర కొండక్రిందపల్లెలో ఉండాడంట సార్."

"నీకెన్నిసార్లు చెప్పాలయ్యా లెవన్‌జీరో, అడివి పక్కపల్లెల వాళ్లతో సావాసం చెయ్యకూడదని. వీళ్లలో నక్సలైట్ మను



షలుంటారు. వీళ్లవల్ల మన ప్లాన్లన్నీ ఒక్కక్షణంలో తుస్సుమంటాయి. అతన్ని పంపించెయ్."

"యస్ సర్. ఓరే రాఘవా. ఇంక ను వ్వెళ్లిపో" అన్నాడు గంగులు.

"ఓరే గంగులూ, ఫిబ్రవరి అయిదవతేది కొండకిందపల్లెలో నా పెండ్లి. నువ్వు తప్పకుండా రావల్ల" అన్నాడు రాఘవరెడ్డి.

"పత్రిక ఏదీ? "

"పత్రికలేసే అంత ఇది లేదులే. నోటి మాటగానే చెబతా ఉండా"

రాఘవరెడ్డి పోలీసుస్టేషన్ నుండి బయటకు వస్తూ ఉంటే కుడికాలు చెప్పు పట్టీ తెగిపోయింది. అటు ఇటూ చూచాడు. పోలీస్‌స్టేషన్‌కు ఎదురుగా ఒక చెట్టు కింద చెప్పులు కుట్టేవాడు కనబడ్డాడు. వాడి ముందర చెప్పులు వదిలాడు.

"ఏ ఊరప్పా మీది? " అడిగాడు చెప్పులు కుట్టేమనిషి.

"మాది నెరబైలు దగ్గర కొండకిందపల్లి"

"పోలీస్‌స్టేషన్‌లో నుండి వస్తావుండావు, ఏమైనా కేసా? "

"ఛ. ఛ. అట్లాంటిదేమీ లేదు. పోలీసు కానిస్టేబుల్ గంగులు నా క్లాసుమేటు. శానాళ్లకు కనబడితే మాట్లాడతా లోపలికి పోతి. వాడట్ల పోయె, నేనిట్లొస్తి. "

చెట్టుకు మరోప్రక్క బీడీ తాగుతూ కూర్చొని ఉండిన ఒక నడితరం మనిషి రెండుసార్లు దగ్గాడు.

చెప్పులు కుట్టే మనిషి అతనివైపు కోపంగా చూస్తూ "బీడీ తాగేదేల? దగ్గేదేల? దగ్గర్లోనే సస్తావు. లెయ్ లెయ్.

లేచి పొయ్యి, పని చూడు" అన్నాడు. ఆ మనిషి లేచి వెళ్లిపోయాడు.

కుట్టిన చెప్పును తొడుక్కొని చూచి వాడికి డబ్బులిచ్చేసి బస్‌స్టాండ్‌వైపు కొంచెం దూరం నడిచాడు రాఘవరెడ్డి. వెనక బిగ్గరగా కలకలం వినబడింది. వెనక్కి తిరిగి చూచాడు.

చెప్పులు కుట్టేవాణ్ణి ఇద్దరు పోలీసులు తన్నుకుంటూ, కొట్టుకుంటూ స్టేషన్‌వైపుకు లాక్కెళుతున్నారు.

రాఘవరెడ్డి సంగతేమిటో తెలుసుకుందామని దగ్గరికి వెళ్లాడు.

ఆ చెప్పులు కుట్టేవాడు నక్సలైట్ల మనిషి. పోలీసుస్టేషన్ ముందర కూర్చొని పోలీసుల కదలికలను ముందుగా తెలుసుకొని నక్సలైట్లకు చేరవేస్తున్నాడు. పక్కనే బీడీ తాగుతూ ఉండిన మనిషీ నక్సలైట్ల మనిషే. టంచనుగా ప్రతిరోజూ ఒకటైంలో అక్కడికి కొందరు మనుషులు రావడం వస్తువులూ, చీటీలూ మార్చుకోవడం పోలీసులు గమనించారు. ఈరోజు ఏదో ఆధారం దొరికినట్లుంది. ఒకడిని పట్టేశారు. రెండోవాడు తప్పించుకున్నాడు.

సాయంత్రం ఆరు గంటలకు రాఘవరెడ్డి ఇల్లు చేరుకున్నాడు. కొన్న వస్తువులు జానకమ్మకు చూపాడు. జేబులో దాచుకొన్న డబ్బు పెద్దిరెడ్డికి ఇవ్వబోయాడు.

"నా దగ్గరొద్దు. భాస్కరరెడ్డి చేతికి ఇయ్యి. ఈ వస్తువులు కూడా అక్కడే పెట్టు. పెండ్లికొడుకు అక్కణ్ణుంచే బయలుదేరాల" అన్నాడు పెద్దిరెడ్డి.

రాఘవరెడ్డి అన్నీ తీసుకొని భాస్కరరెడ్డి ఇంటికి వెళ్లాడు. అన్నీ శారద చేతిలో పెట్టాడు.

"భాస్కరన్నా. ఇదిగో మిగిలిన డబ్బు. ఆడోళ్లను తొడుకోనిపోయి పట్టుచీర కొనండి. మిగిలిన దాంతో సీతకు ఏదైనా చేయించండి" అన్నాడు.

"భోంచేసి పోదువు వుండరా అబ్బోడా" అంది మంగమ్మ నవ్వుతూ.

★ ★ ★

ఒక సర్కిల్ ఇన్‌స్పెక్టరూ, ఇద్దరు యస్సైలూ, పదహైదుమంది పోలీసులూ బాకరాపేట పోలీసుస్టేషన్‌లో సమావేశమయ్యారు. పోలీసుస్టేషన్ పరిసరాలకు ఎవరినీ రానివ్వకుండా ఇద్దరు పోలీసుల్ని కాపలాపెట్టారు.

"ఇంతవరకూ మనం మూడు కూంబింగ్ ఆపరేషన్లు చేశాం. ఒకటి కాస్త సక్సెస్ అయింది. పై అధికారులకు చూపడానికి కొన్ని వెపన్సూ, అమ్యూనీషనూ, కొంచెం రేషనూ కూడా దొరికింది. మిగతా రెండూ ఫెయిల్ అయినట్లే. కొండకింద పల్లె రైడింగ్‌లో వాళ్ల స్థావరం బయటపడింది కానీ ఏమీ దొరకలేదు. సత్తుబోకులు దొరికాయి. ప్రతి ఆపరేషనూ ఫెయిల్ అవుతూంటే పైవాళ్లు ఊరుకుంటారా?" అన్నాడు సర్కిల్.

"మనం రైడింగ్ చేస్తామనే ఇన్ఫర్మేషన్ నక్సలైట్లకు ముందే తెలిసిపోతుంటే మనం ఏంచేసేది సార్" అన్నాడొక యస్సై.

"అదే- అదే. నేను చెప్పేది అలా ఇన్ఫర్మేషన్ చేరవేసేవాళ్లను కనిపెట్టాలి. ముందుగా వాళ్లను ఎన్‌కౌంటర్‌చేసి పారెయ్యాలి. మీకు ఎవరెవరిమీద అనుమానముందో చెప్పండి" అన్నాడు సర్కిల్.

"అడవి పక్కనుండే ప్రతిపల్లెలోనూ ఈ

**కొత్తగాలి...**

**ఇద్దరూ**
**ఓడిపోయే**
**యుద్ధం**
**వివాహం**

– కిలారు వెంకటేష్‌చౌదరి, హైదరాబాద్

ఇన్‌ఫార్మర్లు ఉన్నారు సార్. నా మట్టుకు నాకు కొండకిందపల్లెలో ముగ్గురిపైన అనుమానంగా ఉంది" అన్నాడింకొక యస్సై.

"ఎవరు? " అడిగాడు సర్కిల్ ఆత్రంగా.

"ఆ చెర్నాకోలలు చేసి అమ్మేవాడు, ఆ రాఘవరెడ్డీ, ఆ ఉత్తారెడ్డి అనేవాడూ"

"నో-నో-నో ఉత్తారెడ్డి యూస్‌లెస్ ఫెలో- ఒట్టి చాటర్ బాక్స్. వాడితో ఏమీ డేంజరు లేదు. చెర్నాకోలలు అమ్మేవాడికి ఈ బాకరాపేటలో పుల్లిగానికి కనెక్షన్ ఉంది. పుల్లిగాడుండేది మన స్టేషన్‌కు దగ్గర. ఇక్కడి ఇన్‌ఫర్మేషన్ వాడివల్ల చెర్నాకోలల వాడికీ- వాడివల్ల నక్సలైట్లకూ చేరుతూండవచ్చు" అన్నాడు సర్కిల్.

"లేదుసార్. పుల్లిగాడికి ఇందులో సంబంధం ఉన్నట్లు కనవడదు. వాడు వారానికి నాలుగు రోజులు ఊళ్ళోనే ఉండడు. వాడి పెండ్లాం అప్పుడప్పుడూ మా ఇంట్లో ఆపనీ, ఈపనీ చేయడానికి వస్తుంది" అన్నాడు బాకరాపేట యస్సై.

"అదే-అదే- నా డౌటు. వారంలో నాలుగు దినాలు వాడు ఎక్కడెక్కడ తిరుగుతాడు? వాడి పెండ్లాం మీ ఇంటిలోనే ఎందుకు పనిచేస్తూ ఉంది? ఏమైనా వాణ్ణి ఒక కంట కనిపెట్టాలి. ఇంక మిగిలిన వాడు రాఘవరెడ్డి. వాడు పీలేరు పక్క నుండి వెళ్ళినవాడు. వాడి బ్యాగ్రౌండ్ మనకు తెలియదు. ఆ ఊరి వాళ్ళేమో వాడు చాలా మంచివాడంటారు. వాణ్ణి చూచినా అలాగే కనబడతాడు. ఏ పుట్టలో ఏ పాముందో ఎవరికి తెలుసు? నక్సలైట్లు వాణ్ణి పీలేరు దగ్గరి నుండి తెచ్చి ఇక్కడ ప్లాంటు చేసినారేమో అని నా అనుమానం" అన్నాడు సర్కిల్.

"ఉండొచ్చు సార్" అన్నాడు యస్సై.

"దేనికైనా మంచిది. కాలవపల్లెలో ఉండే మన ఇన్‌ఫార్మర్ సుబ్బయ్యకు చెప్పి పెట్టండి. రాఘవరెడ్డిపైనా, చెర్నాకోలవాడిపైనా ఒక కన్నేసి ఉంచమని."

"యస్ సార్."

"నెక్ట్స్ కూంబింగ్ ఎప్పుడు చేద్దాం? ఎక్కడ చేద్దాం? " అన్నాడు సర్కిల్.

"మొన్ననే దిన్నెల అడివికి వెళ్ళొచ్చాం. ఇంకా కొన్నిరోజులు పోనివ్వండి. ఈసారి వాళ్ళు కొండకిందపల్లె అడవికి వెళ్ళొచ్చు. అక్కడికి రెండోసారి పోలీసులు రారు అని నక్సలైట్లు అనుకొని అక్కడికి చేరుకోవచ్చు. కాకులకోన వాళ్ళకు చాలా అనుకూలమైన స్థావరం. తప్పకుండా అక్కడికే చేరుకుంటారు. సర్‌ప్రైజ్ రైడింగ్ చేద్దాం."

"దట్స్ గుడ్. నేను ఒక డేట్ ఫిక్స్ చేసి చెబుతాను.. బిరెడీ." అంటూ లేవబోయాడు సర్కిల్ ఇన్‌స్పెక్టరు.

"సార్ మన డిపార్టుమెంటులోనే నక్సలైట్ సానుభూతిపరులున్నారు సార్. మన ప్రోగ్రామ్స్ లీకు కాకుండా చూచుకోవాలి సార్"

"ఐ నో.. ఐ నో.. వాళ్ళు ఏనాటికైనా దొరకకుండా పోరు. దెన్ వియ్ విల్ సీ దేర్ ఎండ్" అన్నాడు సర్కిల్.

సమావేశం ముగిసింది.



**15** జిబ్బిడిమాన్ల మడుగు దగ్గర భోజనాలు వండుకొని తిని నాలుగు ఎండు దుంగలు పేర్చి మంటవేసుకొని చుట్టూ కూర్చున్నారు నక్సలైట్లు.

"ఈ మధ్య పోలీసోళ్ల కూబింగ్ ఆపరేషన్లు జోరయ్యాయి. మనం ఎంత జాగ్ర

త్తగా ఉన్నా అంతో ఇంతో నష్టపోతూనే ఉన్నాం. మన స్థావరాలు పోలీసులకు తెలిసిపోతున్నాయి. కొత్త స్థావరాలు వెదుక్కోవలసి వస్తూఉంది. కొత్త స్థావరాలకు మన సరుకులు చేర్చుకోవడం కష్టమైపోతూ ఉంది. ఇలాంటి పరిస్థితులు ఏర్పడడానికి కారణం ఏమిటో కనుక్కోవాలి.. ఏమంటారు? " అన్నాడు దళ నాయకుడు.

"వేరే కారణమేముందన్నా, ఈ పోలీసు ఇన్‌ఫార్మర్లే. వాళ్ళకు కాకపోతే మన దయ్యాలకోన, కాకులకోన, సాధుగెవి పోలీసోళ్ళకు ఎట్లా తెలుస్తుంది?

"ఆ ఇన్‌ఫార్మర్లు ఎవర్రై ఉంటారు? మీకెవరిపైనైనా అనుమానం ఉందా? "

"నాకు ముగ్గురిపైన అనుమానం"

"ఎవరు? ఎవరు? " ఆత్రంగా అడిగాడు నాయకుడు.

"ఒకడు మునిగాడు, రెండోవాడు రాఘవరెడ్డి, మూడోవాడు ఉత్తారెడ్డి."

"ఉత్తారెడ్డికి అంత ధైర్యం లేదులే. ఒట్టి వదరబోతు. ఇక మునిగాడు. వాడు మనకు అనుకూలమే. అడివిలో ప్రతి మూలా తెలిసినవాడు వాడొకడే. వాడు మొన్న పోలీసులను దారి మళ్ళించి మనకు కాస్త సహాయం చేశాడు."

"వాళ్ళు పైకి అట్లే కనబడతారు. కానీ గుండెలు తీసినబంట్లు."

"ఇక మిగిలింది రాఘవరెడ్డి. వాడు పీలేరు దగ్గరివాడు. వాడికి పీలేరు పోలీసుల్లో స్నేహితులున్నారు. వాడిపైనే నా అనుమానం" అన్నాడు దళనాయకుడు.

"కానీ ఊళ్ళోవాళ్ళందరూ అతన్ని చాలా మంచివాడనీ, అమాయకుడనీ అంటూ ఉండారన్నా" అన్నాడు మరో కామ్రేడ్.

"వాడా? వాడు వేలు చూపిస్తే హస్తం దాకా మింగే రకం. అంతటివాడు కాకపోతే బతకలేక జీతగాడుగా చేరినవాడు ఆ ఇంట్లో వాళ్ళకే టోపీ వేసి ఇల్లటం అల్లుడైపోతాడా? మొన్న పీలేరు పోలీసు స్టేషన్ ముందర చెప్పులు కుట్టుకుంటున్న మన వాడితో రెండు నిమిషాలు మాట్లాడినాడో లేదో వెంటనే పోలీసోళ్ళు వచ్చి మన మనిషిని పట్టుకెళ్ళారు. అంతటి కిలాడీ వాడు. వాడికి పీలేరులో బాగా కనెక్షన్‌లుండాయి. తెలివితేటలున్నాయి. డేంజరస్ ఫెలో."

"ఏమైనా వాణ్ణి ఒక కంట కనిపెట్టి ఉండాలి జగన్. నువ్వు వాళ్ళ బావి దరిదాపుల్లో తిరుగుతూ వాడితో ఎవరెవరు వచ్చి మాట్లాడతారో, ఎప్పుడెప్పుడు ఏమేం పనులు చేస్తూంటాడో గమనించు. ఈసారి పోలీసుల కూంబింగ్ తొందరగా ప్రారంభించేట్లు లేదు. ఈవైపు వచ్చేటట్టు కూడా లేదు. మనకు ప్రస్తుతానికి సాధు గెవే సరైన స్థావరం. దారిలో అక్కడక్కడా మందు పాతరలు పెట్టాలి. పైనుండి ఆర్డర్స్ వచ్చే వరకూ అక్కడే గడుపుదాం"

అందరూ సంచుల్లో దూరి అక్కడే పడుకొని నిద్రపోయారు.

★ ★ ★

"మడికోసి కుప్పేసి నాలుగు దినాలైపోయే. ఇంక ముగ్గింది సాలు. శానా ముగ్గితే అన్నం రుచుండదు. రేపు కొట్టెయ్యల్ల. కూలోళ్ళను రేపు రమ్మన్నా. ఒడ్లు రెండు దినాలు ఎండబోసి నాలుగు మూటలు మిషనుకేసక రావల్ల. కుప్పల కాడ ఈ రాత్రికి కావలి పండుకుంటే సాలు. కాలం మారిపొయ్యింది. మనుషుల బుద్ధులూ మారిపోయినాయి. ముందంతా మన పల్లెల్లో యాడేసిన వస్తువు ఆడనే ఉంటావుండె. ఇప్పుడా ధైర్యం యాడుంది? మొన్న కాలువపల్లె కాడ రెండుగుంటల మడి పులుముకొని పోయినారంట. కుప్పేసిందాన్ని ఇడిసిపెడతారా? " అన్నాడు పెద్దిరెడ్డి.

రాత్రి ఎనిమిది దాటింది- అందరికీ భోజనాలయ్యాయి. పెద్దిరెడ్డి మాటలు పూర్తికాక ముందే రాఘవరెడ్డి కావలికట్టె

చేత పట్టుకొని బయలుదేరతా ఉండాడు.

"అబ్బోడా! బ్యాట్రీలైటు, రగ్గు తీసక పో. మొబ్బుకాలం. ఓనిలో నడవాల. భద్రం. లైటేసుకోనే పో" అంది జానకమ్మ.

రాఘవరెడ్డి వెనక్కి తిరిగి జానకమ్మ అందించిన అయిదు సెల్సుల బ్యాటరీ లైటూ, కంబళీ తీసుకొని బయలుదేరాడు.

అమావాస్య ఇంకా మూడురోజులుంది. ఏ తెల్లవారు జాముకో వస్తుంది వెన్నెల. అదీ మసక వెన్నెలే. చుక్కల వెలుతురును చీకటి మింగేసింది. తెల్లగుడ్డలు కూడ నల్లనై పోతాయేమో అన్నంత చీకటి. కండ్లు తెరిస్తే కండ్లలోని తెల్లగుడ్డుకూడా నల్లనై పోతుందేమో అన్నంత నల్లని చీకటి. నోరు తెరిస్తే పండ్లుకూడా నల్లనై పోతాయేమో అన్నంత నల్లని చీకటి. చేత్తో తాకితే చేతికి మసి అంటుకుంటుందేమో అన్నంత నల్లని చీకటి.

మిట్టాపల్లం తెలీడం లేదు. ఓని పక్కన కంపచెట్లపైన మిణుగురు పురుగులు నక్షత్రాలు రాలుతున్నట్లు తిరుగుతున్నాయి. తీగలూ, పుల్లలూ కాళ్ళకు తగిలినప్పుడు ఎగిరిపడి లైటు వేస్తున్నాడు. అబ్బే! పాము కాదు తీగే. పురుగు కాదు పుల్లే అనుకుంటున్నాడు.

చెట్లపైన కీచురాళ్ళు 'గీ' అని అరుస్తున్నాయి. నీళ్ళున్న మడికయ్యల్లో కప్పలు బెకబెకలాడుతున్నాయి.

ఇంటి నుండి బావి దాకా దోవ తనకు కొట్టిన పిండే. అయినా చీకట్లో తడుముకున్నట్లుంది. సగం సగం పొడుచుకొచ్చిన రాళ్లు కాళ్లకు ఎదురుదెబ్బ తగులుతున్నాయి. నిదానంగా నడుస్తున్నాడు. తనకు తాను ధైర్యం చెప్పుకోవడానికి ఏదో సినిమాపాట బిగ్గరగా అందుకున్నాడు.

"చెంగావి రంగుచీర కట్టుకున్న చిన్నదీ.

దాని తస్సదియ్యా- అందమంతా చీరలోనె ఉన్నదీ".

అల్లంత దూరాన ఒక ఆడ దయ్యం, నాలుగైదు పిల్ల దయ్యాలూ నిలబడి చేతులూపుతున్నాయి. గుండె గుభీలుమంది. లైటువేశాడు. అబ్బే అవి ఈతచెట్లు.

'స్స్..' అంటూ ప్రక్కనే శబ్దం..

"పాము బుసా? "

టక్కున నిలబడిపోయి లైటువేశాడు.

పాము బుస కాదు. వెదురు పొదల్లో గాలిదూరి చేసే శబ్దం.

బావి దగ్గరికొచ్చేశాడు. బావికి అటుప్రక్కన ఒక మడికయ్యలో ఉంది వరికుప్ప.

సపారులోంచి పాత నులకమంచమూ బొంత, కొడవలీ తెచ్చుకొని కుప్ప ప్రక్కన మంచం వేశాడు. కొడవలి వరికుప్పలో గుర్తుగా దూర్చిపెట్టాడు. మంచంపైన బొంత పరుచుకొని రాగిగుబ్బ దిండు వేసుకున్నాడు.

## కొత్తగాలి...

**పచ్చదనం**
**పారిపోయింది**
**కోయిల మూగబోయింది**

– సువారపు రామచంద్రరావు,
తిరువూరు

ట్రాన్సిస్టరు ఉంటే దాన్ని పెట్టుకొని పాటలో, హరికథో వింటూ ఉండొచ్చు. తనూర్లో నలుగురైదుగురి దగ్గర ట్రాన్సిస్టర్లు ఉండేవి. చాలామంది ఇండ్లలో రేడియోలు ఉండేవి. ఈ కొండకింద పల్లెలో అలాంటివేవీ లేవు.

చలి ఎక్కువగా ఉంది. రగ్గు కప్పుకొని పడుకున్నాడు. పాట అందుకున్నాడు.

"గౌరమ్మా.. నీ మొగుడెవరమ్మా.. ఎవరమ్మా.. వాడెవరమ్మా.. గౌరమ్మా.."

రాఘవరెడ్డికి నవ్వు వచ్చింది.

"సీతమ్మా నీ మొగుడెవడమ్మా. ఎవ

రమ్మా వాడెవడమ్మా. సీతమ్మా" అని మెల్లగా పాడుకుంటూ నవ్వుకుంటున్నాడు.

సీత తనది. ఈ మడి తనది. ఈ వరి కుప్ప తనది. తానే.. తానొక్కడే కష్టపడి పండించింది. ఈ వడ్లకు తానుకూడా సొంతదారే.

ఇది తనకు కొత్తగా సంక్రమిస్తున్న బాధ్యతా, హక్కా, రెండూనా?

చేతి కావలికట్టె మంచంమీద తన ప్రక్కనే పెట్టుకున్నాడు, టార్చిలైటు దిండు క్రింద పెట్టుకున్నాడు.

దూరాన యర్రంరెడ్డి బాయికాడ ఇరగం రెడ్డి కావలున్నాడు. యర్రంరెడ్డి కొడుకు

> **కొత్తగాలి...**
>
> **మూడు మూడు వెరసి ఆరైతే**
> **అది వ్యాపారం**
> **మూడు మూడు కలిసి ఏడైతే**
> **అది వ్యవహారం**
>
> – వి. రాఘవేంద్రరావు, హైదరాబాద్

కొత్త పెండ్లికొడుకు కదా. కావలికి రాడు.

"ఇరగంరెడ్డీ" అని గట్టిగా కేకవేశాడు.

"ఓ" అన్నాడు ఇరగంరెడ్డి మరింత బిగ్గరగా. పలకరించిందెవరో గుర్తురాలేదు. వీళ్ళ కేకలు నిశబ్ద వాతావరణంలో ఊళ్ళో దాకా వినబడ్డాయి. ప్రతిధ్వనించాయి.

"నిద్రపోతా ఉండావా? " మళ్ళీ అరచాడు రాఘవరెడ్డి.

"రాఘవన్నా నువ్వొస్తివా కావలికి" అన్నాడు ఇరగంరెడ్డి గుర్తుపడుతూ.

"ఆఁ నేనే"

"బాగా చలిగా ఉంది. చలిమంటేస్తా. వస్తావా అన్నా? "

"ఒద్దు. ఈడికీ ఆడికీ శానాదూరం. నా దగ్గర రగ్గు ఉందిలే. కప్పుకుంటే చలుండదు. నువ్వు రగ్గు తెచ్చుకోలే? "

"లేదు. ఈత చాపుంది. కప్పుకుంటా"

అంత బిగ్గరగా గొంతు చించుకొని అరచుకోలేక ఇద్దరూ ఊరికే ఉండిపోయారు.

తలనిండా రగ్గు కప్పుకొనేటప్పటికి అంతగా చలి అనిపించడంలేదు. కాస్త కునుకు పట్టింది.

మర్రిమానికి ఆ పక్కన బూరుగ చెట్టు పైన గుడ్లగూబ "గుడుగుడుక్, గుడుగుడుక్" అంటూ ఉంది. ఆ శబ్దానికి భయపడి చెట్టెక్కుతూ ఉన్న ఒక ఉడత క్రిందికి దూకేసి ఎండుటాకులమీద గలగలమని పరుగెట్టుకొని వచ్చి మర్రిచెట్టు తొర్రలో దూరింది. ఈ రెండు శబ్దాలకు నిద్ర చెదిరి విసుగుతో కాకి "గమ్మున పండుకోలేరా? " అన్నట్లు కర్రుమంది.

చుక్కలు పడమటికి వాలుతూ ఉన్నాయి.

నిద్రలో రగ్గు తొలగిపోయి, సందులో చలిగాలి దూరి, చెవులోనికి దూరేటప్పటికీ రాఘవరెడ్డికి మెలకువ వచ్చింది. లేచి లైటువేసుకొని కుప్పచుట్టూ కనబడినంత దూరమూ చూశాడు. మళ్ళీ పడుకున్నాడు. నిద్రముంచుకొస్తూ ఉంది.

మరోసారి ఇరగంరెడ్డి "ఓహో" అని వేసిన కేకకు రాఘవరెడ్డి మేలుకొని తానూ "ఓహో" అని బదులు కేకేసి అటువైపు తిరిగి పడుకున్నాడు.

"ఇక్కడ మనుషులు మేలుకొని ఉన్నారు. కావలి ఉన్నారు" అని ఆగంతకులకు చేసే హెచ్చరిక అన్నమాట.

తెల్లవారుజామయింది. ఇంకా చీకటిగానే ఉంది. చలి మరింత ఎక్కువయింది. ఎంత చీకటైనా, ఎంత చలైనా చంద్రుడికి డ్యూటీ తప్పదు కదా!

పాపం సూర్యచంద్రులు వేళ తప్పకుండా డ్యూటీలు చేయవలసిందే.

ఇదేం గవర్నమెంటు ఉద్యోగమా ఏదో

సాకుపెట్టి ఎగ్గొట్టడానికి, సెలవుపెట్టడానికీ, గంటా గంటన్నరా లేటుగా రావడానికీ.

వాళ్ళ యజమాని నాలుగుదిక్కులా ముఖం పెట్టి చూస్తూ ఉంటాడు. నాలుగు నోళ్ళలో హెచ్చరిస్తూనే ఉంటాడు.

కాబట్టి ఇక విధిలేక చంద్రుడు కొండచాటునుండి బయటికి వచ్చాడు.

అసలే చలి. ఆపైన మసక వెన్నెల. అందుపై ఒక కాలు కురచ. తొందరగా నడవలేక తోడుగా శుక్రుణ్ణి వెంటబెట్టుకొని మెల్లమెల్లగా ఆకాశంలోకి ఎగబడుతున్నాడు చంద్రుడు.

చుక్క ఎక్కొస్తూ ఉంది. ఇక కాసేపటిలో తూర్పున పటమెగురుతుంది.

ఉన్నట్లుండి బూరగచెట్టు మీద గుడ్లగూబ గట్టిగా అరుస్తూ పైకెగిరింది. అల్ల నేరేడు చెట్టుపైనా, మర్రిచెట్టుపైనా ఉన్న పక్షులన్నీ కేరు కేరుమని అరుస్తూ పైకెగిరి గింగుర్లు కొట్టసాగాయి. ఎక్కడో నిద్రపోతున్న కోతులు మేలుకొని కొన కొమ్మలెక్కి కిందికి చూస్తూ అరవడం మొదలుపెట్టాయి. ఉడుతలూ, ఎంటవలూ, ఎండుటాకుల మీద పరుగులు తీస్తున్నాయి.

రాఘవరెడ్డి ఉలిక్కిపడి మేలుకున్నాడు. బ్యాట్రీలైటూ, చేతికర్రా తీసుకొని చుట్టూ లైటువేసి చూచాడు. వరికుప్పలోంచి కొడవలి తీసి మంచం మీద పెట్టుకున్నాడు.

ఇంత కలకలం ఎందుకు పుట్టింది. పక్షులూ, కోతులూ ఎందుకు బెదిరినాయి. ఏం జరిగింది? అడవిలోంచి పెద్ద మెకమేదైనా ఈ పక్కకొచ్చిందా? వేటగాళ్ళెవరైనా వచ్చారా?

నాలుగువైపులా లైటువేసి చూస్తుండగా అకస్మాత్తుగా ఒక్కసారిగా పది మంది ఒక్కపరుగున వచ్చి రాఘవరెడ్డిమీద పడ్డారు. ఒక్కదెబ్బతో కింద పడదోశారు. చేతికట్టె దూరంగా పడిపోయింది. బ్యాట్రీ లైటు ఎగిరిపడి ముక్కలైంది.

వారిలో ఇద్దరు ఊరివైపు పదడుగులు వెళ్ళి నిలబడి తుపాకులు మోహరించి నిలిచారు.

వచ్చినవాళ్ళు రాఘవరెడ్డిని లేవనీయకుండా నేలకేసి అదిమి తొక్కిపట్టారు. పెనుగులాడుతుంటే పెటపెటమని పిడిగుద్దులు గుద్దారు.

"ఏరా, పోలీసోళ్ళ తొత్తు నాకొడకా. మాపైనే నిఘా పెడతావా? అదే పనిగా పీలేరు పోయి మా గుట్టు పోలీసులకు చెప్తావా?" మరి రెండు గుద్దులు, తన్నులు. వచ్చినవాళ్ళు నక్సలైట్లని తెలిసిపోయింది.

"అన్నా- అన్నా- లేదన్నా- నా మాట వినన్నా- నాకేం తెల్దన్నా"

దండం పెట్టడానికి కూడ చేతులు లేవ

**కొత్తగాలి...**

**అరుదైన ఎర్రచందనం**
**అమూల్యమైన కర్రధనం**
**అధికారుల డొల్లతనం**
**అందరి సంపద దొంగతనం**

*– అంబటి వెంకటశివారెడ్డి,*
*యర్రగుంట్ల*

కుండా తొక్కిపట్టారు. సరిగా మాట్లాడడానికి కూడా వీలు లేకుండా గొంతూ, రొమ్మూ అదిమి పట్టారు. ఊపిరి పీల్చడం కూడా కష్టంగా ఉంది.

"ఏందిరా లేంది? నువ్వు ఈ నడమ పీలేరుకు పోలేదూ?" డొక్కలో గుద్దాడు ఓ నక్సలైటు.

"అన్నా- ఇంటి జాగా- రిజిస్ట్రేషన్ - నా పెండ్లి - గుడ్డలు-"

"కథలు చెప్పొద్దు లమ్డీకొడకా. అక్కడ పోలీసోడితో స్టేషన్‌కు పోలే. యస్సైతో మాట్లాడలే?"

మరో దెబ్బ.

"అన్నా- అన్నా వాడు - నా క్లాసు.."

"స్టేషన్ ముందర చెప్పులు కుడతా ఉండిన మా ఏజెంటును పోలీసులకు పట్టిచ్చింది నువ్వు కాదూ? "

"అన్నా, నాకేం తెల్దు. పదిరోజుల్లో నా పెండ్లి.."

"పెద్దిరెడ్డికే టోపీ వేసిన కంతిరీ నా కొడుకువు నువ్వు. చెప్పు, పోలీసోళ్ళు ఎంతిచ్చారు? "

నీడ లేకుండా చేస్తావు. మా ఉద్యమం బలహీనమైపోతుంది. మాకు మొదటి నుండీ నీమీద అనుమానమే. పోలీసులే నిన్ను మీవూరి నుండి ఇక్కడికి పంపారని అనుమానం. ఈ రోజుతో నువ్వు ఖతం"

"అప్పా, భాస్కరన్నా. సీతా" రాఘవుని కేకలు గొంతు నుండి బిగ్గరగా బయటపడలేదు. ఇద్దరు నక్సలైట్లు రాఘవుని పైకి తుపాకులు గురిపెట్టారు.



"లేదన్నా, దేవుని సాక్షిగా లేదన్నా"

బిగ్గరగా కేకలు వేయాలని ప్రయత్నిస్తున్నాడు. గొంతులో నుండి స్వరం రావడం లేదు.

"కారణం చెప్పకుండా ఖతం చెయ్యడం మా పద్ధతి కాదు. నీ వల్ల మా స్థావరాలు బయట పడిపోయాయి. మా ఆయుధాలు పోలీసులకు దొరికిపోయాయి. ఇదంతా నీబోటి ప్రజాద్రోహుల వల్ల జరిగింది. చెప్పు. మీ పల్లెలో నీలాంటి తొత్తు నా కొడుకులు ఎవరెవరున్నారు? పోలీసుల కంటే మీలాంటివాళ్ళే మాకు భయంకరమైన శత్రువులు. వాళ్ళు ఎదుటపడి పోరాడే శత్రువులు. మీరు కనబడని శత్రువులు. నిన్ను ఇట్లే వదిలేస్తే మాకు నిలువ

"నో-నో-నో వీడి కోసం బుల్లెట్లు వేస్ట్ చెయ్యకండి" అన్నాడు దళనాయకుడు. నలుగురు నక్సలైట్లు ఒకరినొకరు నెట్టుకుంటూ రాఘవుని మీద వంగి బిచువాలతో నాలుగు పోట్లు పొడిచారు. చావు తెగింపుతో బలంగా రాఘవుడు పెనుగులాడిన దెబ్బకు ఇద్దరు నక్స

లైట్లు క్రిందపడిపోయారు. నులకమంచం విరిగిపోయింది. ఆ కోపంతో వాళ్ళు మరో రెండు పోట్లు పొడిచారు.

అదిమిపట్టిన రాఘవుని నోటినుండి గొంతు నరాలు తెగిపోయేలా మూలుగులు వెలువడుతున్నాయి. తొక్కిపట్టిన రాఘవుని కాళ్ళూ చేతులూ విలవిల కొట్టుకుంటు న్నాయి. బిచువా పోట్ల నుండి చిమ్మిన నెత్తురు నక్సలైట్ల ముఖాలపైనా బట్ట లమీద పడింది.

వాళ్ళ ఉన్నతాదర్శాలకూ, ఉద్యమాశయా లకూ నెత్తురు మరకలంటు కున్నాయి. విప్లవ నినా దాలు రాఘవుని చావుకేక లతో కలిసి అపశ్రుతి వినిపించాయి. ఎర్రజండాకు ఆరుతూట్లు పడ్డాయి. సామా జిక న్యాయం విలవిల తన్నుకుంటూ ఉంది.

సరిగ్గా అదే సమయానికి ఊరివైపు తిరిగి తుపాకులు గురిపెట్టి నిలబడి ఉన్న వ్యక్తులు- "పోలీస్.. పోలీస్" అంటూ కేకలు వేశారు.

దూరంగా జీపు దిగి వస్తున్న పోలీసు లపై తుపాకులు పేల్చి వెనక్కి పరుగెత్తి క్షణంలో మాయమయ్యారు నక్సలైట్లు.

నక్సలైట్‌లు పేల్చిన తుపాకులు గురి తప్పాయి. పోలీసులు గభీమని బోర్లా పడు కొని తుపాకులు పొజిషన్‌లోకి తీసుకు



న్నారు.

పొద్దు పుట్టలేదు. కానీ బాగా తెల్లవారింది. నక్సలైట్లు పారిపోయేది చూచి పోలీసులు వాళ్ళను తరుముకోవాలనే ఉద్దేశ్యంతో మళ్ళీ లేచారు.

రాఘవరెడ్డి ప్రాణాలన్నీ కూడదీసుకొని తలయెత్తి పోలీసులవైపు చూచాడు.

'పోలీసులు వచ్చారు. తనను రక్షిస్తారు. ఆస్పత్రికి తీసుకపోతారు. అప్పటివరకూ ప్రాణాలు ఉంటాయా? క్షణం క్షణం రక్తం ధారగా కారిపోతోంది. ఆస్పత్రికి పోయేవరకూ ప్రాణాలుంటే చాలు. పెద్దిరెడ్డీ, భాస్కరరెడ్డీ ఏ పాటైనా పడి తనను కాపాడుకుంటారు'

విరిగిన మంచాన్నీ, పగిలిన టార్చిలైటునూ ఆసరాగా తీసుకొని శక్తినంతా కూడదీసుకొని లేచి నిలబడడానికి ప్రయత్నిస్తున్నాడు.

"వాడే- వాడే. పీలేరు పోలీసుస్టేషన్ దగ్గర చెప్పులు కుట్టే నక్సలైట్ ఏజెంటుతో మాట్లాడింది వాడే. ఇప్పుడు కూడా నక్సలైట్లు వాడి కోసమే వచ్చి మంతనాలు జరిపినట్లున్నారు. మనల్ని చూచి పారిపోయారు" అన్నాడు సర్కిల్.

"పారిపోయేట్లున్నాడు పట్టుకోండి" అన్నాడు యస్సై.

"ఆగండాగండి వాడి చేతిలో ఏదో ఉంది. ఏందది.. బాంబు కావచ్చు పైకి లేస్తున్నాడు బాంబు వేస్తాడేమో- ఫైర్" అన్నాడు సర్కిల్. ఒక తుపాకీ మ్రోగింది గుండు రాఘవుని పొట్టలో దూరింది.

"సార్" అన్నాడు రాఘవరెడ్డి చేతిని అడ్డంగా ఊపుతూ. గుండు దెబ్బకు అటువైపు తిరిగి వాలిపోతున్నాడు.

రెండో తుపాకి మ్రోగింది. గుండు వీపులో దూరింది.

అంతే.

రాఘవరెడ్డి విరిగిన మంచం మీద దబ్బున పడిపోయాడు. తల చేతులూ నిర్జీవంగా వేలాడుతున్నాయి. కాళ్ళు రెండు మూడుసార్లు కదిలి నిలిచిపోయాయి.

రాఘవుని రక్తంతో తూర్పు దిక్కున ఆకాశం యెర్రబడింది. చంద్రుడి ముఖం తెల్లగా పాలిపోయింది. చంద్రుడు భయపడి పారిపోయాడు.

సూర్యుడు తూర్పు తలుపు తెరిచి ఈ దృశ్యం చూచి అలాగే నిలిచిపోయాడు.

రాఘవుని రక్తం పోలీసుస్టేషన్ల గోడలకు ఎర్ర రంగు పూసింది. పోలీసుల తుపాకులు ప్రజారక్షణ చేసి పొగలు కక్కుతున్నాయి. పోలీసు టోపీలమీద మూడు సింహాలు నాలుకలు చాచి రక్తం నాక్కుంటున్నాయి.

పోలీసులు రాఘవరెడ్డి పడున్న చోటికి వచ్చారు.

"బాడీని జీపులో వెయ్యండి" అన్నాడు సర్కిల్.

జీపు దగ్గరికొచ్చింది. ఇద్దరు కానిస్టేబుళ్ళు రాఘవరెడ్డిని చచ్చిన గొర్రెను పట్టినట్లు కాళ్ళూ చేతులూ పట్టి జీపులో వేశారు. అందరూ జీపులెక్కారు. జీపు బయలుదేరింది.

సరిగా తెల్లవారనైనా తెల్లవారకముందే పెద్దగా శబ్దం చేస్తూ ఊరిలో దూరి, పెద్దిరెడ్డి బావిదోవన అడవివైపుగా దూసుకెళ్ళిన జీపు శబ్దానికి ఊరు ఉలిక్కిపడి మేలుకుంది. అప్పటికే వీధులలో చలిమంటలు వేసుకొని చలికాచుకుంటున్న జనాలు కొందరు "పోలీసులు, పోలీసులు" అంటూ కేకలు వేస్తున్నారు. క్షణాలపై ఇండ్లలోని జనమంతా వీధుల్లోకి చేరిపోయారు. అంత లోపలే 'ఢాం ఢాం' అంటూ నాలుగు తుపాకీ ప్రేలుళ్ళు వినబడేటప్పటికి అందరి గుండెలూ గుభేలుమన్నాయి.

"ఎక్కణ్ణుంచీ"

"పెద్దిరెడ్డి బాయికాణ్ణుంచి"

"పోలీసోళ్ళేనా కాల్చింది? "

"ఇంకెవురు. వాళ్ళే"

"ఎవరిమింద కాల్చినారో"

"పెద్దిరెడ్డి బాయికాడికి రాత్రి కావలికి పొయ్యిందెవురు"

"రాఘవరెడ్డే కదా? "

"అయ్యో, అయ్యో. ఇంకేముంది? కొంప మునిగింది"

"రాఘవరెడ్డినా? "

"ఏమో? "

అంతా పెద్దిరెడ్డి బావివైపు పరుగెత్తారు.

బాయి దగ్గరికి పోయేటప్పటికి జీపు ఎదురుగా కదిలివస్తూ ఉంది. జీపు ఆగలే దుకాని జనం అడ్డంగా వస్తూ ఉండడంతో హారన్ మ్రోగిస్తూ స్లో అయింది.. జనం దారి ఇచ్చారు. వెనుక చేరిన జనం జీపు లోనికి తొంగి చూచారు.

రాఘవరెడ్డి శరీరం కదలకుండా మెదల కుండా అస్తవ్యస్తంగా పడుంది. మెడ, చేతులూ వికారంగా, అస్తవ్యస్తంగా ఉన్నాయి. శరీరమంతా రక్తమయం.

"అయ్యో, అయ్యో, రాఘవరెడ్డి- కాల్చేసి నారు. అయ్యో రాఘవా" అంటూ జీపు వెంటపడుతున్నారు జనం. ముందున్న జనం రాఘవరెడ్డిని చూడాలని జీపు వెనక్కి వచ్చారు. అదే అదనుగా జీపు రయ్యిమని దాటిపోయింది.

జీపు పెద్దిరెడ్డి ఇంటి దగ్గరికి రాగానే సర్కిల్ "ఏయ్ టూనాట్‌టూ - వన్‌నాట్ వన్. రూము సర్చ్‌చేసి ఏమైనా ఉంటే ఎత్తకరండి... బిరీన.. క్విక్" అన్నాడు.

ఇద్దరూ రాఘవరెడ్డి రూములో వెది కారు. నాలుగు పుస్తకాలు దొరికాయి.

'ఖబడ్దార్'

'కదిల్తే కాల్చేస్తా'

'మిస్టరీ కిల్లర్'

'పెట్టెలో శవం'

అవేం పుస్తకాలో వాళ్ళకు తెలియదు.

"విప్లవ సాహిత్యం సార్" అన్నారు వెళ్లి నంత వేగంగా తిరిగొస్తూ. అది పత్రికల వాళ్ళు పోలీసులకు నేర్పిన ఊతపదం. ఖర్మచాలక ఒకవేళ అక్కడ భగవద్గీత దొరికినా అదీ 'విప్లవ సాహిత్యమే'

"ముందు జీపెక్కండి. జనం రాకముందే వెళ్లిపోవాలి. పుస్తకాలు కిట్ లో పెట్టు"

తుపాకీ పేలుళ్ళ శబ్దాలు విని వీధిలో నికి వచ్చి ఆందోళనతో నిలబడి ఉండిన జానకమ్మా, సీతా, పక్కింటి ఆడవాళ్ళు ఇద్దరూ జీపు ఇంటి ముందుకు రావడం చూచి గబగబా వెనక్కివచ్చి అరుగులమీద నిలబడ్డారు. ఇద్దరు కానిస్టేబుళ్ళు గదిలో దూరి మళ్ళీ బయటకు వచ్చి జీపు ఎక్కిన తరువాత జీపు వీధివైపు తిరగ్గానే జీపు లోపల అస్తవ్యస్తంగా రక్తమయమై పడి ఉన్న రాఘవరెడ్డి శరీరం వాళ్ళ కంటపడింది. జానకమ్మ "అబ్బోడా" అంటూ అరచి చతికిల పడిపోయింది.

"ఆc, ఆc" అంటూ సీత నిట్టనిలువునా వాలిపోయింది. కింద పడిపోనీయకుండా ఇద్దరు ఆడవాళ్ళు, జానకమ్మ పట్టుకొని లాక్కుంటూ వెళ్ళి గదిలో మంచంమీద పండబెట్టారు.

"ఇంకేం చేసేది దేవుడా.. అబ్బోడా, రాఘవా..." అంటూ జానకమ్మ గుండెలు బాదుకొని ఏడవసాగింది. అయిదారు మంది ఆడవాళ్ళు చేరిపోయారు.

నక్సలైట్లు రాఘవరెడ్డిపైన దాడి చేసినపుడు ఇరగంరెడ్డి మేలుకొని చలిమంట

## కొత్తగాలి...

**మా అమ్మ నిప్పు**
**మా ఆవిడ ఉప్పు**
**నేను నివురుగప్పిన నిప్పు**

– బలభద్రపాత్రుని ఉమామహేశ్వర శర్మ,
హైదరాబాద్

వేసుకొని చలికాచుకుంటున్నాడు. నక్సలైట్ల మాటలూ, గద్దింపులూ, దూరంనుండి సన్నసన్నగా వినబడుతున్నాయి. గబగబా లేచి అటువైపు పరుగెత్తాడు. అయిదారు నిమిషాల పరుగు. సరిగ్గా ఆ సమయానికే నక్సలైట్లు రాఘవరెడ్డిని కమ్ముకొని బిచువాలతో పొడవడం, రాఘవరెడ్డి మూలుగుతూ పెనుగులాడడం, నక్సలైట్లు ఇద్దరు పడిలేచి వాళ్ళు కూడా రాఘవరెడ్డిని పొడవడం, మంచం పటపట విరగడం వడ్లకుప్పపై తొక్కులాట ఈ బీభత్సమంతా క్షణాల్లో జరిగిపోవడాన్ని ఇరగంరెడ్డి సమీపానికి వస్తూవస్తూ చూడనే చూచాడు.

"ఆc ఆc" అంటూ ఉండిపోయాడు.

భయంతో నోటమాట రావడం లేదు. చేతులూ కాళ్ళూ ఆడడం లేదు. వెర్రిచూపులు చూస్తున్నాడు.

అప్పుడప్పుడు "అయ్యో... అయ్యో" అంటూ రొమ్ము కొట్టుకుంటున్నాడు.

జీపు వెళ్ళిపోయింది.

ముందుగా వచ్చిన జనంలో రాఘవరెడ్డిని పోలీసులు ఎత్తి జీపులో వేసుకోవడం చూచినవాళ్ళూ కొందరు ఉన్నారు. తరువాత వచ్చినవాళ్ళు అందరూ కలిసి ఎటు పోవడానికీ దిక్కుతోచక మర్రిచెట్టు దగ్గరా, సపారు దగ్గరా, వరికుప్ప దగ్గరా నిలబడి పోయారు. "అయ్యో, రాఘవా, రాఘవరెడ్డి" అని అరుస్తున్నారు. ఆర్తనాదాలు చేస్తున్నారు. రక్తం మడుగుకట్టిన నేలను ప్రక్కవాళ్ళకు చూపుతున్నారు.

జనాన్ని చూడగానే ఇరగంరెడ్డికి నోట్లో నుండి మాటలు బయటపడ్డాయి.

"రాఘవరెడ్డిని నక్సలైట్లు పొడిచేసిరి. పదిమంది. బిచువాలు, ఇక్కడ ఇక్కడ" అని తన రొమ్ము, కడుపూ, డొక్కలూ చూపుతున్నాడు.

"పోలీసులు - కాల్చేసిరి- ఈడ, ఈడ- కాల్చేసిరి" అని తన కడుపూ, వీపూ చూపిస్తున్నాడు. మతిభ్రమించిన వానిలా ప్రతి మనిషిని భుజాలు పట్టి నిలవేసి మరీ ఈ మాటలే చెబుతున్నాడు.

అడవివైపు చూసి "వాళ్ళు రాఘవరెడ్డిని పొడిచేసిరి" అంటున్నాడు.

జీపు వెళ్ళిన వైపు చూసి "వాళ్ళు రాఘవరెడ్డిని కాల్చేసిరి" అంటున్నాడు. చేతులు పైకెత్తి ఆకాశంవైపు చూస్తూ రొమ్ము, తలా కొట్టుకుంటున్నాడు. అవే మాటలు తనలో తానే అనుకుంటున్నాడు. శరీరం ఆపాదమస్తకం ఒణుకుతూ ఉంది.

జనాలు గొల్లుమన్నారు. గోలగోలగా మాట్లాడుకుంటున్నారు.

"ఊపిరుందా? "

"ఇంకా ఎక్కడ ఊపిరి"

"ఒకదెబ్బైతే సరే- వాళ్లు పొడిచింది ఎన్ని పోట్లో, వీళ్ళు కాల్చింది ఎన్ని గుండ్లో"

"తల చేతులు వాలిపోయినాయి.. చూళ్ళే? "

"చచ్చిన గొర్రెను ఎత్తి ఇసిరేసినట్లు ఇసిరేసిరి కదమ్మా పిల్లగాణ్ణి జీపులో"

"అయ్యయ్యో, వాళ్ళకేం పోయ్యేకాలం. బంగారట్లా పిల్లోణ్ణి పొట్టన పెట్టుకుండిరే"

"వాళ్ళు నాశనమైపోనీ, వాళ్ళ ఇండ్లలో పీనుగెళ్ళా"

"కండ్ల జూద్దామంటే కూడా వీల్లేకుండా జీపులో ఏసకపోయిరే"

"ఇదేం గోరం తల్లీ- ఎప్పుడూ వినిందీ లే- చూచింది లే"

"వాళ్ళూ, వీళ్ళూ వచ్చి ఊరిమీదపడి ఊరికే బెదిరించి పోతావుండారనుకుంటిమి కానీ ఇంతపని చేస్తారనుకోలే"

"రాఘవుడేమి భూస్వామా? పెత్తందారా? ఎవరికైనా అన్యాయం చేసినాడా, ఎవరిసొత్తయినా ఆశించినాడా? నక్సలైట్లు రాఘవుణ్ణి చంపాల్సిన పనేమి? పేదోళ్ళను కాపాడతాం అని పలికిరే. ఇదేనా వీళ్ళు పేదలను కాపాడేది? "

"ఈ పోలీసులు చట్టాన్ని కాపాడతాం,

న్యాయాన్ని కాపాడతాం అని పలికిరే- రాఘవరెడ్డి చట్టాన్ని మించినాడా, దుర్మార్గం చేసినాడా, బాంబులేసినాడా? పోలీసులు కాల్చాల్సిన పనేమి? "

"ఆబోతులు రెండూ కుముమ్ములాడు కుంటే మధ్య దూడ నలిగి చచ్చిందంట"

"పెండ్లి పది దినాలు కూడా లేదు. ఎంతగోరం జరిగిపోయే! వీళ్ళు ఎట్లా తట్టు కొనేది- ఏమైపోయేది? "

అందరూ తిరుగుముఖం పట్టారు. పెద్దిరెడ్డి ముఖాన కత్తివేటుకు నెత్తురు బొట్టు లేదు. కన్నీళ్ళు ధారగా కారుతున్నాయి. కాళ్ళు చచ్చుబడిపోతున్నాయి. నడవలేకపోతున్నాడు. యర్రంరెడ్డి పెద్దిరెడ్డిని పట్టుకొని నడిపిస్తున్నాడు. పెద్దిరెడ్డి లోపలి మనిషి. గట్టిగా ఏడవడంలేదు కానీ లోలోపల గుండె పగిలే దుఃఖాన్ని భరిస్తూ నడుస్తున్నాడు. కాదు, ఇద్దరు నడిపిస్తున్నారు. భాస్కరరెడ్డి పెదవుల బిగువున దుఃఖాన్ని ఆపుకొని నడుస్తున్నాడు.

అందరూ పెద్దిరెడ్డి ఇంటి ముందరికొచ్చి అరుగులమీద, బండలమీద నేలమీద కూర్చున్నారు. పెద్దిరెడ్డి గొంతుక్కూర్చొని మోకాళ్లపైన తలపెట్టి కుమిలికుమిలి ఏడుస్తున్నాడు. డొక్కలూ, వీపూ ఎగసెగసి పడుతున్నాయి. అప్పుడప్పుడు సన్నటి మూలుగు వినబడుతూ ఉంది. యర్రంరెడ్డి ఒకప్రక్క, ఆదెప్ప ఒకప్రక్క కూర్చొని పెద్దిరెడ్డి భుజాలమీద, వీపుమీద చేతులతో నిమురుతూ ఓదార్చుతున్నారు.

ఇంటిలోపల చాలామంది ఆడవాళ్ళు ఆలగోడు బాలగోడుగా ఏడ్చే ఏడ్పులు వినబడుతున్నాయి. పోలీసులనూ, నక్సలైట్లనూ శాపనార్థాలు పెడుతున్నారు.

ఇరగంరెడ్డి అరుగుమీద స్తంభానికానుకొని కూర్చున్నాడు. ఇంకా బెదురుపోలేదు. దిగ్భ్రాంతి నుండి కోలుకోలేదు. పదే పదే రెండు చేతులు ఆకాశం వైపు పైకెత్తుతున్నాడు. గొణుక్కుంటున్నాడు.

"కాల్చేసిరి.. "

"పొడిచేసిరి.. "

"కాళ్ళూ చేతులూ పట్టి - జీపులో ఏసుకుంద్రి" అంటూ కలవరిస్తున్నాడు.

"పాపం ఆ గోరం కళ్ళారా చూచినోడు కదా.. పిల్లగాడు బెదిరిపోయినాడు" అన్నారు కొందరు.

"రాఘవరెడ్డి మనూరొచ్చి తొమ్మిది నెలలయిందా- ఇంకా కాలే- రావడమూ అయిపోయె, పోవడమూ అయిపోయె. అంతా మూణ్ణాళ్ళ ముచ్చటైపోయె గదయ్యా"

"ఎక్కడ పుట్టినాడో ఎక్కడ పెరిగినాడో- ఇక్కడ రాసిపెట్టింది వాని చావు"

"ఎంతబిరీన ఎంతపేరు తెచ్చుకుండె!"

"ఊరికే చెప్పినా అర్థాయుష్షు బిడ్డకు అరచెయ్యంత కండ్లు అని"

"మగబిడ్డలేని పెద్దిరెడ్డికి ఒక ఆదరువు దొరికిందిలే అనుకుంటిమి. బిడ్డతో పెండ్లి కూడ నిశ్చయమైపోయె. పాపిష్టి దేవుడు ఇచ్చినట్లే ఇచ్చి ఎగరేసుకపోయె. పెద్దిరెడ్డికి నడుమే యిరిగిపోనట్లయిపోయెనే"

ఈ మాటల వల్ల పెద్దిరెడ్డి దుఃఖం మరింత ఎక్కువైంది. అందాకా లోలోపల కుమిలి కుమిలి ఏడుస్తూ ఉండినవాడు ఒక్కసారిగా బావురుమన్నాడు.

ఆనాడు భాస్కరరెడ్డి బోధించినప్పటి నుండీ ఆలోచించి ఆలోచించి తీసుకొన్న నిర్ణయాలూ, ఆ నిర్ణయాలపై కట్టుకొన్న

---

### కొత్తగాలి...

**అతను కనిపిస్తేనే**
**ఆమె వెన్నెల ఆకాశం**
**వాన చిటపటమంటేనే**
**మట్టికి పరిమళం**

– పాయసం సుబ్రహ్మణ్యా మహర్షి,
నెల్లూరు

---

పేకమేడలూ, కలలు గన్న సుఖజీవనమూ, అంతా ఒక్కసారిగా గాలి వానకు కొట్టుకు పోయాయి. మళ్ళీ తాను ఒంటరి. పెద్ది రెడ్డి రెక్కలు తెగిన పెద్దిరెడ్డి. నడుం విరి గిన పెద్దిరెడ్డి.

లోపల సీత మంచంమీద పడుంది. సగం తెలివిలో సగం మైకంలో పడుంది. చుట్టూ ఆడవాళ్ళు మాట్లాడే మాటలు లీలగా వినబడుతున్నాయి. కాని సరిగా అన్వయించుకోలేని మైకం కమ్మింది.

అప్పుడప్పుడూ తనలో తానే మాట్లాడు కుంటోంది. మాటలు అస్పష్టంగా వినబడు తున్నాయి, ఏం చెబుతుందో అని ఆత్రంగా ముఖం దగ్గర ముఖంపెట్టి వినేవారికి.

జానకమ్మ మాట్లాడలేక మాట్లాడలేక ఒక్కొక్క మాటే పలుకుతూంది.

"జీపులో ఆ పిలగాణ్ణి సూచి 'ఆc' అని పడిపోయింది. అప్పట్నుంచి ఇట్లా వుండా దమ్మా బిడ్డ. మూసిన కన్ను తెరవలే. నోటి మాటలే. ఏందేందో కలవరిస్తా వుంది. ఈ గోష్ట నేనెట్ల భరించేది. ఈ కడుపుకోత నేనెట్ట భరించేది. ఏ ఖర్మ చేసి నానని నాకీ శిక్ష ఏసినాడు పాపిష్టి దేవుడు. పొయ్యేవాడు దీన్ని కూడ తీసక పొయ్యుంటే ఒక ఏడ్పు ఏడ్చేసి ఉందుము కదా. ఆ సంపేవాళ్ళు మమ్మల్నందర్నీ సంపేసుంటే ఈ ఏడుపులే ఉండవు కదా? ఇది ఇంకెట్ట మన లోకంలో పడేది? దీన్ని ముందర పెట్టుకొని ఎన్నాళ్ళు ఏడు స్తును? " జానకమ్మ సీతపైన పడి బోరున ఏడ్చేసింది.

మంగమ్మ, శారద, నాగరత్న జానక మ్మను లేపి పొదివి పట్టుకొని కూర్చుండబె ట్టుకున్నారు.

"పాడు పిల్లగాడు.. పెద్దమ్మా, పెద్దమ్మా అని ఎంత ప్రియంగా పిలుస్తావుండె. మన భాస్కరుడంటే ఆ పిలగానికి ప్రాణం. ఏమి అక్కరపడినా 'అది ఎట్లన్నా, ఇది ఎట్లన్నా' అని అడగతా ఉండె. 'కొంత కాఫీ పెట్టీ వొదినా, తినేదానికి ఏమైనా ఉందా వొదినా' అని శారద ఎనకింటే తిరగతా వుండె" అంది మంగమ్మ.

ఆ మాట వింటూనే శారద దుఃఖం పట్ట లేక ప్రక్కనే ఉన్న నాగరత్న భుజంమీద ముఖం వాల్చి గట్టిగా ఏడ్చేసింది.

అంతలో పడుతూ లేస్తూ తూలిపోతూ సుడిగాలిలా వచ్చింది ఈడిగ కృష్ణయ్య కోడలు. ఆక్రోశిస్తూ వచ్చి జానకమ్మను కౌగిలించుకుంది.

"అమ్మా! అమ్మా! ఏడే మా అన్న, మా యన్నను ఏంజేస్తిరి? మా నాయన్ను ఏంజేస్తిరి. నాయనే కాదు- మా అమ్మ, నా కన్నతల్లి, నాకూ నా బిడ్డకూ ప్రాణం పోసిన దేవుడు యాడపోయె- మేము ఏమైపోయె- నెరబైలుకు పోయే నడిదోవ లోనే నాకు కాన్పొచ్చేస్తే నన్ను బండికింద పండబెట్టి 'అమ్మేయ్ భయపడొద్దు నేనుండా. కొంచెంసేపు నేను మొగోణ్ణి కాదనుకో, మీ అమ్మను అనుకో, నీకన్న తల్లిని అనుకో, సిగ్గుపడద్దు. ప్రాణం మీదికి వచ్చినప్పుడు సిగ్గూ, మర్యాదా సూడకూ డదు. అన్నీ నేను సూసుకుంటా' అని నాకు ఎంత ధైర్నం చెప్పె. తానెంత ధైర్యంగా నిలబడె. రోత అనుకోకుండా, అసయ్యం అనుకోకుండా అన్నీ చేసి సమా ళించి నన్నూ, నా బిడ్డనూ బండిలో ఏసు కోని ఇల్లు చేర్చినే, మా అన్న బాబా, ఎల్లి పోతివా, నాకు చెప్పకుండా ఎల్లిపోతివా? " అంటూ రెండు చేతులూ, మొగమూ పైకెత్తి దండం పెట్టి తలకొట్టుకుంటూ జానకమ్మ పాదాలపై వాలిపోయి రోదించ సాగింది.

ఆమె మాటలు విని, ఆమె శోకం చూచి ఆడవాళ్లందరూ మళ్లీ ఏడవసాగారు. అరు గుమీదున్న మగవాళ్ల హృదయాలు కూడా కరిగి కన్నీళ్లుగా ప్రవహించసాగాయి.

సీత అస్పష్టంగా కలవరిస్తూ ఉంది.

"అదిగో ఏటి గట్టున అద్దాల మేడ-

మేము కట్టుకున్నదే. నేనూ, మా రెడ్డీ కట్టుకున్నదే. అదిగో మల్లెతీగ- నేను నాటిందే. అది అల్లుకున్న పందిరి. మా రెడ్డి నిలబెట్టిందే- పువ్వులు- ఎంత బాగా పూసిందో- అంతా నాదే-"

జానకమ్మ వాపోతూ ఉంది.

"దీని పెండ్లికి సుట్టాలందరికీ చెప్పి పంపించేస్తిమి. ఇప్పుడేమని చెప్పి పంపల్ల, ఎట్ల చెప్పి పంపల్ల?"

సీత కలవరిస్తూ ఉంది.

"నాగరత్నా నాగరత్నా నీ నోట్లో చెక్కెర పొయ్య- ఎంత మంచి మొగుణ్ణి సూపిస్తివే. గంగ పండగనాడు నువ్వా మాట అనకుండావుంటే ఇదంతా జరిగేదా?"

జానకమ్మ అంగలారుస్తూ ఉంది.

"పిల్ల పిల్లగాడు ఇంట్లోనే ఉంటారు. మా కట్టె కడతేర్చేస్తారు అనుకుంటిమే"

సీత కలవరిస్తూ ఉంది.

"మేయ్ నాగరత్నా, సావిత్రి, పద్మా.. మీరు పెండ్లి చేసుకొని అమ్మా నాయన్లను వదిలేసి యెల్లిపోతారే.. నేను చూడు.. మా అమ్మా నాయన దగ్గరే ఉంటా. మీకా అదృష్టం లేదే. నాదేనే అదృష్టం"

జానకమ్మ అంటోంది "నేను ఒద్దనుకుంటూనే ఉంటి. అందరూ చేరి మెడ ఒంచి ఒప్పించిరి. ఇప్పుడు గోష్ట సూసేదెవురు?"

సీత కలవరిస్తూ ఉంది.

"బాస్కర మామా నువ్వెప్పుడు మా ఇంటికొచ్చినా చెక్కరేసి ఫస్ట్‌క్లాస్ కాఫీ పెట్టిస్తా"

జానకమ్మ సీతపైన చేతులేసి అంటూ ఉంది, "దేవుడిట్లా మా కొంప ముంచతాడనుకోలేదేయమ్మా. ఆ పిలగాడు ఇట్లా అన్యాయం చేసి పోతాడనుకోలేదమ్మా. నేనేం జేతును తల్లీ ఈ బిడ్డను...?"

"అయ్యయ్యో నా సంగటి కుక్కైత్తకపోయెనే" అంది సీత.

ఉన్నట్టుండి చేతులూ, కాళ్లూ, తలా తీవ్రంగా విదిలించుకుంటూ కలవరించసాగింది సీత. మాటలు అతుకులతుకులుగా వినబడుతున్నాయి.

"అయ్యో- అయ్యో- ఎల్లవ వచ్చేసింది. గాలివాన. అయ్యో మా అద్దాల మేడ ఏట్లో కొట్టకపోతావుంది. అమ్మా, నాయనా రండి రండి.. ఇన్నాళ్లూ కట్టుకున్న మేడ కూలిపోతూ ఉందే. అదిగో మల్లెపందిరి. ఎంతో ఆశతో పెంచుకున్న మల్లెతీగ- ఎల్లవలో పడికొట్టకపోతావుంది. రా నాయనా- పట్టుకో- అమ్మా పట్టుకో- నీ అల్లుడు బిడ్డలు- పట్టుకో నాయనా పట్టుకో భాస్కరమామా- పోయిరి- కొట్టకపోయిరి. ఏట్లోపడి కొట్టకపోయిరి. ఇంగ నాకేం మిగిలింది? అంతా పోయే. ఇంగ నేనెందుకు బతకల్ల? నేనెందుకు? ఎవురి కోసం? ఏం చూసుకొని బతకల్ల? అమ్మా నాయన్ను సూసుకో- నాయనా అమ్మను సూసుకో- నేను కూడ..."

సీత ఇంతసేపూ చేసిన ప్రేలాపనలు స్పష్టంగా వినబడలేదు. కానీ చివరి మాటలు కొన్ని స్పష్టంగా వినబడ్డాయి. అందరూ ఉలిక్కిపడ్డారు.

సీతకు స్మారకం వస్తూ ఉందేమో అనే ఆశతో 'సీతా- సీతా' అంటూ పట్టి ఊపసాగారు. తమకు తెలిసిన చిట్కా వైద్యాలు చేయసాగారు. సీత కన్ను తెరవలేదు.

సీత కండ్ల ముందర మర్రిచెట్టు కనబడతా ఉంది. మర్రి కొమ్మకు ఒక తాడు ఊగుతూ వేలాడుతూ ఉంది.

సీత కండ్ల ముందర వాళ్ల బావి కనబడతూ ఉంది. లోతు నీళ్లలో తన నీడ కనబడుతూ ఉంది.

సీత కండ్ల ముందర చెరువు కనబడతా ఉంది. చెరువులో పడిన వస్తువులన్నీ చేరి తెట్టె కట్టుకొని తేలుతూ ఉండటం కనబడుతూ ఉంది.

మర్రి చెట్టు, బావి, చెరువు ఒకటివెంట ఒకటిగా వరుసగా సీత కండ్ల ఎదుట కనిపిస్తున్నాయి.

# బతుకు దారి

సరోజ పెళ్లి ప్రకాశ్‌తో జరిగి మూడ్నెల్లయింది.. ఈ మూడ్నెలల్లో మూడువేల నరకాలు చూపాడతను. 'ప్రతీరాత్రి వసంతరాత్రి' అని ఆనందంగా పాడుకోవాలని ఆశపడిన ఆమె 'ప్రతీరాత్రి విషాదరాత్రి.. అసలైన కాళరాత్రి' అని మనసులో పాడుకుంటోందిప్పుడు..

అక్కడికీ పెళ్లికి ముందే దాన్ని అడ్డుకోవడానికి తను ప్రయత్నించింది. 'ఒకసారి కాదు.. రెండుసార్లు విధి నా జీవితంతో క్రూరాతి క్రూరంగా ఆడుకుంది. ఎలాగో జీవచ్ఛవంలా బతుకీడుస్తున్నాను. అలాంటి నన్ను ప్రేమా దోమా అంటూ వెంటాడడం తగదు.. ప్లీజ్ నన్నొదిలెయ్ ప్రకాశ్.. ఉన్న దూరపు బంధువుల అండదండలూ నాకు లేకుండా చెయొద్దు ప్లీజ్' అని పదేపదే అర్థించింది.

ట్యాంక్‌బండ్ 29 కథలు

అయినా అతగాడు వదిల్తేగా? కన్నెత్తి చూస్తే చాలు కనకాభిషేకాలే అన్నాడు. నవ్వితే నవరత్నాలు ఏరచ్చన్నాడు.. నువ్వు నీ అందమైన నవ్వు నా కోసమే పుట్టాయన్నాడు.. కాకపోతే వాళ్లిద్దరిలో దేవుడొకర్ని ఎత్తుకుపోవడం, మరొకర్ని దురాశే ఎగరేసుకుపోవడం జరిగేదా అన్నాడు.

ఏడాదిపాటు వెంటపడి వెంటపడి తిరిగాడు.. ఎటువెడితే అటే వచ్చాడు.. ఏవగించుకుంటే దులిపేసుకున్నాడు.. చీదరించుకుంటే చిరునవ్వులు చిలికాడు.. మాట్లాడకుండా మౌనవ్రతం పాటిస్తే గడ్డం పెంచుకుని నలిగిన ముఖంతో జాలి పుట్టించేలా తమ బజారులో తమ మేడ వంక చూస్తూ అటూ ఇటూ తిరిగాడు.. ఒక్కనవ్వే చాలు.. వద్దులే వరహాలు అన్నట్టు హావభావాలు పెట్టేవాడు.. ఒకసారి అతడి వైఖరి గమనించి తన అన్న చావచితక్కొట్టేడు.. తను కిటికీ కర్టెన్ చాటునుంచి అదంతా గమనిస్తూనే ఉంది.. కానీ పాపం అన్పించింది..

ఎంతైనా స్త్రీ కదా? ఏ అమ్మకన్నబిడ్డో తనకోసం దెబ్బలు తిన్నాడంటే పాపం అన్పించింది.. ఆడదాని మాతృహృదయమే మగాడికి మహాభాగ్యం!

క్రమంగా ఒక సానుకూల భావన తన మనసులో మొలకెత్తింది. కాస్తంత బెట్టు సడలించి అడపాదడపా మాట్లాడడం మొదలెట్టింది తను.

విషయం ఇంట్లో తెలియడంతో పెద్ద గొడవ! వదినైతే అపరకాళికే అయింది. 'ఒకడ్ని దేవుడు మింగాడు.. ఒకడు నీతో వేగలేక ఊళ్లుపట్టుకుపోయాడు.. అయినా సిగ్గులేక మరొకడ్ని చుట్టూ తిప్పుకుంటున్నావా? నీలాంటాడది ఉంటే ఆ కొంప కొల్లేరే! మా పిల్లలకు పెళ్లీ పేరంటాలు అయినట్టే?' అంటూ ముఖంమీదే ఛడామడా కడిగేసింది.

అన్నయ్య కూడా ముభావంగా మారిపోయాడు. వాడ్ననుకుని ఏం లాభం? సొంత అన్నయ్యేంకాదు. పెద్దమ్మ కొడుకు.

రెండురోజులు ఇంట్లో యుద్ధవాతా

రణం.. అన్నావదినల గదిలో అర్ధరాత్రి దాకా వాదోపవాదాలు వినబడుతూనే ఉండేవి. అవి తనగురించే అని తెలుసు.

మూడోరోజు పొద్దున్నే అన్నయ్య డైనింగ్ టేబుల్ దగ్గర కదిపాడు..

'చూడు సరూ! నేనొక మాట చెప్పాలను కుంటున్నా.. నువ్వేం అనుకోవద్దు.. మీ వదినా నేనూ నీ విషయంలో ఓ నిర్ణయా నికి వచ్చాం. అతను నీ వెంట పడడం.. నువ్వు అతనితో నవ్వుతూ మాట్లాడడం.. ఇదంతా మన కుటుంబానికి మంచిది కాదు.. అదీగాక దివ్య, కావ్య పెద్దవాళ్లవు తున్నారు.. అదీ ఆలోచించు! నువ్వు ఓకే అంటే అతనితో మాట్లాడతాను.. పెళ్లిచే సుకో! అతనెలాంటివాడో నాకంటే నీకు బాగా తెలుసు కాబట్టి ఇబ్బందే ఉండదను కుంటా! ఏదో ఓ లక్ష కట్నంగా ఇస్తాను..'

తను దెబ్బతిన్నట్టు చూసింది.

'వద్దన్నయ్యా.. నావల్ల మీకు ఇబ్బంది అనుకుంటే నేను వర్కింగ్ విమెన్స్ హాస్టల్ లో ఉంటాను..'

'ఎందుకు తల్లీ అక్కడైతే అడిగేవాడు ఉండడు కాబట్టి ఎంతమందినైనా వెంట తిప్పుకోవచ్చనా? ఏం కుదరదు. పోయిన పరువు చాలు.. ఫలానా వారమ్మాయి అని ఇప్పటికే లోకం కోడై కూస్తోంది.. మీ అన్నయ్య చెప్పినట్టు ఆ తలకుమాసిన వాడ్నే కట్టుకు ఊరేగు.. కాస్త మమ్మల్ని పరువుగా బతకనీ' అంటూ అరిచింది.

కళ్లనీళ్లు తిరిగాయి.

'ఆవిడలాగే అంటుందిగానీ మీరెళ్లి మాట్లాడండి.. మీరు బిజినెస్‌మాన్ కాబట్టి ఎక్కువ అడుగుతాడేమో? కుదరదని చెప్పండి.. ఆవిడేమన్నా మీ సొంతచె ల్లెలా? కాళ్లకు చుట్టుకున్న కంపను ఏదోలా వదిలించుకోవాలి తప్పుతుందా? .. లక్షపైన ఒక్కదమ్మిడీ కూడా ఇవ్వనని కరాఖండిగా చెప్పండి.. కావాలంటే మా అన్నయ్యను తీసుకెళ్లండి.. కచ్చితంగా మాట్లాడ్తాడు..' అంటూ విషయాన్ని తెగేసి లోనికెళ్లిపోయింది వదిన.

అన్నయ్య మౌనంగా వెళ్లిపోయాడు.

దరిమిలా మూడుముళ్లూ ముచ్చటగా మూడోసారి తనమెడలో పడ్డాయి.

'నీ అందం అజంతా శిల్పం.. నీ మనసు పారిజాత పుష్పం..' అంటూ తెగ పొగిడిన ప్రకాశ్ నిజరూపం తొలిరాత్రే బట్టబయలైంది.. నా నవ్వుకోసం, కడ గంటి చూపు కోసం పడిగాపులు పడిన ప్రకాశేనా? అని అన్పించింది.

'మీ అన్న అంత పెద్ద బిజినెస్‌మ్యాన్.. కేవలం లక్షే నా ముఖాన పడేశాడేంటి? పోయేటప్పుడు కట్టుకుపోతాడా? పదికోట్ల కుపైగా ఉందంటారు చుట్టుపక్కలవాళ్లు..'

'ఇద్దరు మొగుళ్లతో గడిపిన థర్డ్‌హ్యాండ్ శాల్తీని కట్టుకున్నందుకైనా బోనస్‌గా మరో రెండులక్షలు పడేయొచ్చుగా? '

'చూడమ్మాయ్.. నాకు మాత్రం ఇది తొలిరాత్రే! ఎంతైనా ఎక్స్‌పీరియన్స్ కలదా నివి నువ్వే నన్ను గైడ్‌చేయాలి సరేనా? '

'ఫర్వాలేదా? పనికొస్తానా? వాళ్లిద్దరి పాటి మగాణ్నేనంటావా? '

మాట్లాడే ప్రతిమాటతో ఒంట్లోని ఒక్కో అవయవాన్నే కోస్తూ దానికింత కారం రాస్తూ రాక్షసానందాన్ని పొందేవాడు ప్రకాశ్. అతడు తననెందుకు పెళ్లాడాడో అర్థమైంది. వద్దంటున్నా తమబరువు వది లించుకోడానికి అన్నావదినలు తనగొం తెలా కోశారో ఇంకా బాగా అర్థమైంది..

హుఁ దేవుడ్ని అనుకుంటాంగానీ మను షులు చేసే తప్పులకు ఆయన్నెలా బాధ్యుడ్ని చేస్తాం? అనుకుంది సరోజ. ఇప్పుడేంటి కర్తవ్యం? మరోసారి ఘోరంగా దెబ్బతింది తను.

అంతలోనే ఇంతకు ముందే జరిగిన బాగోతం గుర్తొచ్చింది.. రాత్రి పదిగంటల

వేళ బాగా తాగొచ్చాడు.. తలుపు తీయం గానే గుప్పున వాసన ముక్కులు బద్దలు కొట్టేసింది.. తూలిపడిపోతున్న అతన్ని పట్టుకుని ఓ వ్యక్తి లోపలకు తీసుకొచ్చాడు.. ప్రకాశ్‌ను నడిపిస్తూ తీసుకెళ్లి మంచంమీద పడుకోబెట్టాడు.

'గురూ.. నీ మందుకు వందనం గురూ.. నీ సాటిస్ఫాక్షన్‌కు నాది పూచీ! అనుబవించు రాజా.. అనుబవించు రాజా..' అంటూ ప్రకాశ్ ఏదో పలవరిస్తున్నాడు..

'థ్యాంక్స్ అండీ'

ఇక అతన్ని వెళ్లమన్నట్టు చెప్పింది తను తలుపు దగ్గర నిలబడి..

అతను కదల్లేదు సూటిగా ఆమె వంక చూశాడు..

ఆ చూపుకు ఆమె కలవరపడింది..

'ఈ రాత్రికి నిన్ను నాకప్పచెబుతాని, ఐదొందల రూపాయల మందు తాగాడు నీ మొగుడు నాదగ్గర..'

అతనూ తాగినట్టున్నాడు మాటలు ముద్దగా వస్తున్నాయి..

స్థాణువే అయిందామె.

ఆమెను బలంగా దగ్గరకు గుంజాడ తను.. గొంగళి పురుగులా చుట్టుకుంటున్న అతన్ని పట్టు వదిలించుకుని రివ్వున తలుపు తెరిచి బయటకొచ్చిన ఆమె బయటనుంచే చటుక్కున తలుపుగొళ్లెం పెట్టేసింది. అతను బూతులు తిడుతున్నా ఓ ఉన్మాదిలా పరుగెత్తుకుంటూ తిన్నగా ట్యాంక్‌బండ్‌కు చేరుకుంది..

ఏమిటి తను చేసిన తప్పు? ఎందుకు తన జీవితమిలా అవుతోంది? ఇంతటి నీచమైన అనుభవాలు పొందినా తనింకా బతికే ఉందేమిటి? మాయావులే తప్ప మనుషులు లేని ఈ లోకంలో ఎవరికోసం తను బతకాలి? ఎందుకోసం బతకాలి? క్షణం ముక్కుమూసుకుంటే ఈ బాధలన్నీ శాశ్వతంగా దూరంకావూ? ..

సాగర్‌నీళ్లలో ప్రతిబింబిస్తున్న తథాగత తుడి ప్రతిమను చూస్తూ ఆలోచిస్తున్న ఆమె భుజంమీద ఓ చెయ్యిపడింది..

ఉలిక్కిపడి తిరిగి చూసిందామె..

ఎవరో ఆడపోలీస్!

నవ్వుతూ చూస్తోంది తనవంకే!

'ఎవరు మీరు? ఏంకావాలి?' అన్నట్టు చూసింది సరోజ.

'సరూ.. గుర్తుపట్టలేదా? డిగ్రీలో నీ క్లాస్‌మేట్ వనజని! ఇప్పుడు సిటీలోనే నా పోస్టింగ్. డ్యూటీ ముగించుకుని వెళ్తుంటే కన్పించావు.. నువ్వా కాదా అని చాలాసేపట్నించీ పరిశీలించి చివరికి కన్‌ఫర్మ్ చేసుకున్నాను.. రా మా హాస్టల్‌కి వెళ్లి మాట్లాడుకుందాం'

'ఇప్పుడు కాదే మరోసారి వస్తాను' నీళ్లు నవిలింది సరోజ.

'మరోసారంటే మరోజన్మలోనా?'

చురుక్కుమని చూసింది సరోజ.

తర్వాత ఒక్కసారిగా వనజను చుట్టేసుకుని బావురుమంది..

'పర్లేదు.. నాకంతా అర్థమైంది.. వేళ కాని వేళ ట్యాంక్‌బండ్‌పై నలిగిన చీరతో వాడిన ముఖంతో ఓ అమ్మాయి ఒంటరిగా కూర్చుందంటే సీనేంటో అర్థమైపోయింది నా పోలీసు బుర్రకు.

ఎవరో వంచిత ఆత్మహత్య చేసుకోడానికే కూర్చుందని ఇందాకే అర్థమైంది.. కానీ ఆ వంచితవి నీవని నీ ముఖం చూశాకే తెలిసింది. థ్యాంక్‌గాడ్! సమయానికి నా కంటపడ్డావు.. పద నీ బతుక్కొక దారిచూపిస్తా! నేనూ ఒకప్పుడు నీ పరిస్థితిలో ఉన్నదాన్నే. నువ్వూ రేపు నీలాంటి వాళ్లకు బతుకు దారి చూపుదువుగాని..' అంటూ సరోజను పొదివిపట్టుకుని తీసుకెళ్లి జీపులో కూర్చోపెట్టింది వనజ ఐపీఎస్.

–చంద్రప్రతాప్

# చతుర ప్రవేశిక

## మే- 2010

మీ 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగల రేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. పెద్దిరెడ్డి కూతురు?
2. రాఘవరెడ్డి మేనత్త పేరు?
3. సీత మనసిచ్చింది ఎవరికి?
4. మచ్చనాలికోడు అంటే ఎవరు?
5. రాఘవరెడ్డి పోలీసు స్నేహితుడు?
6. సోక్రటీసుతోనే బడాయిపోయిన వేశ్య పేరు?
7. దొంగనోట్లకోసం ఎవరి వద్దకు బారులు తీరారు?
8. నయనతార ఏ మళయాళ సినిమాద్వారా రంగప్రవేశం చేసింది?
9. అజ్ఞేయ్‌కు జ్ఞానపీఠ అవార్డు తెచ్చిపెట్టిన రచన?
10. సరోజను కాపాడిందెవరు?

---

పంపినవారి పేరు: ---------------------------- వయసు (   )

చిరునామా: ------------------------------------------

------------------------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ప్రవేశికలకు చివరి తేదీ 19

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

## H.I.V / A.I.D.S. వ్యాధిగ్రస్థులకు శుభవార్త!!

H.I.V / A.I.D.S లు నయముకాని వ్యాధులని అనుకుంటున్నారా? దక్షిణ కాలిఫోర్నియా యూనివర్శిటీ పరిశోధన- 'మానవ శరీరంలలో A.P.O.B.EC-3G అనే ఎంజైము ఉంటుంది. H.I.V శరీరములోనికి ప్రవేశించిన వెంటనే దాన్ని అడ్డుకునే సామర్థ్యం కలిగిన ఎంజైము శరీరములోని ప్రతి కణములోను ఉంటుంది.' శరీరములోని ప్రతికణములో ఉన్న బలహీనపడిన A.P.O.B.EC-3G ఎంజైమును శక్తివంతం చేస్తే అది H.I.V ని నాశనం చేస్తుంది. తద్వారా CD-4 కౌంట్ పెరిగి సాధారణ స్థితికి వస్తుంది. H.I.V సోకిన వ్యక్తిని A.I.D.S నుండి కాపాడవచ్చు. H.I.V /A.I.D.S లు ప్రాణాంతకాలు కావు. CD-4 కౌంట్ (Immunity) ని మన మందుల ద్వారా 800మంది నుండి 1500వరకు పెంచుకొని H.I.V. Carriers గా పూర్తి జీవితకాలం ఆరోగ్యంగా జీవించవచ్చును.

## కేన్సర్ - CANCER - వ్యాధిగ్రస్థులకు శుభవార్త!!

*మెదడు *నోరు *థైరాయిడ్ గ్రంథి *స్తనములు *ఊపిరితిత్తులు *అన్నవాహిక *జీర్ణాశయము *పసరుతిత్తి *కాలేయము *పాన్‌క్రియాసిస్ *మూత్రపిండములు *ప్రాస్టేటు గ్రంథి *మూత్రకోశము *జీర్ణ కోశము *ప్రేగులు *గర్భాశయ కంఠము (సెర్విక్స్) *గర్భాశయము *అండములు *పురుషాంగము *వృషణములు *న్యూరోబ్లాస్టోమా *కందరములు *ఎముకలు *చర్మము *లింఫ్ గ్రంథులు *ఎక్యూట్ లింఫోబ్లాస్టిక్ ల్యుకేమియా *ఎక్యూట్ మైలాయిడ్ ల్యుకేమియా * క్రానిక్ లింఫోసైటిక్ ల్యుకేమియా *క్రానిక్ మైలాయిడ్ ల్యుకేమియా ఎంతో మంది క్యాన్సర్, ల్యుకేమియా వ్యాధిగ్రస్తులకు చికిత్స చేస్తున్నటువంటి ఆంధ్రప్రదేశ్‌లోని ప్రప్రథమ కేరళ ఆయుర్వేద వైద్యశాల, రేడియేషన్ థెరపీ, కీమోథెరపి, హార్మోన్ థెరపి, బయోలాజికల్ థెరపి, మరియు ఇతర వైద్యపద్ధతులను తీసుకుంటున్న వారు కూడా మా ఆయుర్వేద మందులు వాడవచ్చును.

## షుగర్ (DIABETES MELLITUS) అతి మూత్రము (DIABETES INSIPIDUS) వ్యాధి బాధితులకు శుభవార్త!!

35 సంగిరాల సుదీర్ఘకాల పరిశోధనా ఫలితం! అన్ని వయసుల వారికి ఎన్ని సంవత్సరముల నుండి షుగర్ వ్యాధి ఉన్నా (TYPE - II DIABETES. NON INSULIN DEPENDENT DIABETES MELLITUS. (NIDDM) 30 రోజులలో నియంత్రణలోకి వస్తుంది. (TYPE -1 DIABETES. INSULIN DEPENDENT DIABETES MELLITUS. (IDDM) 60 రోజులలో నియంత్రణలోకి వస్తుంది. కోర్సు అయిన తరువాత ఆహార నియమాలు యోగ, నడక, శరీర, వ్యాయామాలు లేకుండా పంచదార, బెల్లం, తేనె, ఖర్జూరము లాంటివి తీసుకుంటూ వ్యాధిని తగ్గించుట ఈ మందు యొక్క ప్రత్యేకత. షుగర్ పేషంట్లకు మాననిపుళ్లు, గాయములు, గాంగ్రీన్ లాంటివి 30 రోజులలో మాన్పించవచ్చును. (PER MONTH Rs.2000/-) TYPE - II COURSE 3 MONTHS. TYPE - 1 COURSE 6 MONTHS.

## త్రాగుడు మానండి! మాన్పించండి !! STOP -ALCOHOL !!

మీరు అనుకోకుండా బానిసలుగా మారిన త్రాగుడును ఆల్కహాలును(Alcohol), గంజాయి (Bang), నల్లమందు(Opium) (Morphine), బీడి, సిగరెట్, గుట్కా, కల్లు, సారాయి, మైకం పొగ (Cannabis), (Heroin) మొదలగు మత్తుమందులు (Tobacco-Pipe) పొగాకు పొగ పీల్చుట మా ఆయుర్వేద మందు ద్వారా మానవచ్చును, లేదా వ్యసనపరుడైన వ్యక్తిని తీసుకురాకుండా మరియు అతనికి తెలియకుండా మాన్పించవచ్చును. (Per Month Rs.1200/-) Course : 2 months.

## బట్టతల!! Baldness! నెరసిన జుట్టు!! Grey Hair!

చుండ్రు, జుట్టు రాలుట, పేను కొరుకుడు, జలుబు, కళ్ళ మంటలు, దీర్ఘకాల తలపోటు, మాడు పోటు, పార్శ్వపు నొప్పి, మెదడును చల్లబరుచుట, సుఖనిద్రను కలిగించి జ్ఞాపక శక్తిని వృద్ధిపరిచి తలలోని పేలను వదలగొట్టి, జుట్టును నల్లగా పొత్తుగా, పొడువుగా పెంచి బట్టతల నెరసిన జుట్టును శాశ్వతంగా నివారించును. Kerala Herbal Hair Tonic (Oil) 100ml Rs.400/-, 250ml Rs.900/-, Kerala Herbal Shampoo - 100ml Rs.50/-; 250ml Rs.120/-; Herbal Hair Capsules 60 - Rs300/- (Per Month Rs.750) Course : 6 Months.

## సంతానం లేని (Infertillity-Sterillity) దంపతులకు శుభవార్త!!

సంతానోత్పత్తి కణాలు తక్కువగా వున్న మగవారికి కణాలలో కదలిక లేని వారికి కణాలు పూర్తిగా లేనివారికి (Azoosperimia) వెరికోసిల్‌వీన్స్ (Varicoseviens) (Per month Rs.3000/-) Course : 3 months, స్త్రీలకు అండాశయముల నుండి అండములు విడుదలకాక పోవుట, అండవాహికలు మూసుకొని పోవుట (Fallopian Tubes Block), గర్భాశయ పొరలకు వ్యాధి సోకినా, ప్రొలాక్టిన్ హార్మోన్ ఎక్కువశాతములో ఉన్నా, లోపలి ద్రావల్లో ఆమ్లగుణము (Acid) ఎక్కువగా వున్నా, ఎండోమెట్రియాసిస్, అండములు చాలా చిన్నవిగా వున్నా రసాయన వాజీకరణ పద్ధతుల ద్వారా ప్రత్యేక చికిత్స చేయబడును. (Per Month Rs.3000/-) Course : 3 months.

## ఉబ్బసం (Asthma) ఎలర్జీ (Allergy) వ్యాధులకు ప్రత్యేక చికిత్స!!

జలుబు, దగ్గు, ఆయాసం, తుమ్ములు, పిల్లికూతలు, కఫ్ఫు, ముక్కునుండి నీరు కారుట, ఊపిరి ఆడకపోవడము, సైనసైటిస్ (Sinusitis) ఇసినోఫీలియా (Eosinophilia) దుమ్ము, ధూళి, ఏసి, ఐస్‌వాటర్, మంచు చల్లగాలుల వల్ల కలుగు ఎలర్జీ వ్యాధులకు Asthma Sanjivini 200ml Rs.300/- (Per month Rs.600/-) Course : 9 months.

❖**నూతన యవ్వన శక్తికి, శీఘ్రస్కలనము, హస్తప్రయోగము** (Masturbation) : నపుంసకత్వము (Impotency) అంగస్తంభన సరిగా లేకపోవుట, లైంగిక వాంఛ లేకపోవుట (Libido), రతి మధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొని పోవుట, వృషణములు కుష్శించి పోవుట (Atrophy of Tests), ప్రోస్టేటు గ్రంధి వాపు (Enlarge Prostate) per month Rs.2000/- Course : 3 months. ❖**సుఖవ్యాధులు** (Venereal Diseases) : వ్రణములు, పుండ్లు, సవాయి, కొరుకుడు గనేరియా సిఫిలిస్, గ్లీట్, షాంక్రాయిడ్, (per month Rs.1000/-) Course : 3 Months. ❖**హెర్పిస్ సింప్లెక్స్** (Herpes Simplex) హెర్పిస్ జోస్టర్ (Herpes Zoster) (Per month Rs.2000/-) Course : 3 months. ❖**స్తనముల బిగువుకు** : జారిన (వాలిన) స్తనములను చిన్నగా, మెత్తగా వున్న స్తనములను సైజును పెంచి, గట్టిగా, గుండ్రముగా చేసి స్త్రీలను అందముగా కనబడునట్లు చేయును, స్తనముల సైజును తగ్గించుటకు (Decrease) (Per month Rs.1000/-) Course : 3 months. ❖**స్త్రీలకు పొత్తికడుపు మీద గోకిన గీతలు,చారలు పోవుటకు** (Screch Marks) :(Per month Rs.1000/-) Course : 3 months. ❖**మలబద్ధకము** (Constipation) : (Per month Rs.3,00/-) Course : 1 month. **గ్యాస్‌ట్రబుల్, ఎసిడిటి, అల్సర్, అజీర్ణము** (Dispepsia), ఆకలి లేకపోవుట, కడుపులో నొప్పి, మంట (Gastritis) జీర్ణాశయములో ఆసిడ్ ఎక్కువై దానిలో మంట (Acidity), జీర్ణాశయములో పుండు (Peptic Ulcer) అంత్రమూలములో పుండు (Duodenal Ulcer) (Per month Rs.750/-) Course : 3 months. ❖**రక్తమొలలు, అర్శమొలలు** (Piles) Haemoroids, ఆసనములో చీలిక పుండ్లు, (Fissers) (ఆపరేషన్ లేకుండా) (Per month Rs.750/-) Course : 3 months. ❖**పులిపిర్లు** (Warts), **ఆనెలు** (Corns) Rs.300/- ❖**సోరియాసిస్** (Psoriasis) (Per month Rs.2000/-) Course : 3 months : **బొల్లి** (Leucoderma), (Per month Rs.2000/-) Course : 3 months. ❖**స్థూలకాయము** (Obesity) : అధిక బరువును, లావును తగ్గించుటకు (No Diet, No Exercise) (Per month Rs.2000/-) Course : 3 months. ❖ **సన్నగా బలహీనముగా** ఉండు వారు, బరువు పెరిగి, లావుకావటానికి, ఎత్తు పెరుగుటకు, (21సం||లోపు వారు) (Per month Rs.2000/-) Course : 3 months. ❖**కీళ్ళు కండరాల నొప్పులకు** :(Rheumatis arthritis) నరముల వాపు (Neuritis) (Backache), నడుము నొప్పి (Lumbago), మెడనొప్పి, వెన్ను నొప్పి (Spinalcord), తుంటి నొప్పి, సయాటిక ఆపరేషన్ లేకుండా (Per month Rs.750/-) Course : 3 months. ❖**పక్షవాతము** (Paralysis) (Per month Rs.5000/-) Course : 3 months. ❖**మూర్ఛ, అపస్మారకము**,(Fits) (Epliepsy) **పిచ్చి, ఉన్మాదము** (Mania) **హిస్టీరియా** (Hysteria) **జ్ఞాపకశక్తి తగ్గిపోవుట** (Loss of Memory) **నిద్రపట్టకపోవుట** (Insomnia), (Per month Rs.2000/-) Course : 3 months. ❖**చెవిపోటు** (Ear ache) : చెవినుండి చీము కారుట, చెవుడు, చెవిలో హోరు శబ్దము ఆపరేషన్ లేకుండా, (Per month Rs.750/-) Course : 3 months. ❖**నత్తిని తగ్గించుటకు** (Stammering): (Per month Rs.1500/-) Course : 3 months. ❖**స్త్రీల శరీరంపై వచ్చు అవాంచిత రోమములు తిరిగి మొలవకుండా చేయుటకు** :(Per month Rs.3,000/-) Course : 1 month.

అన్ని రకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి. మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు.

# కేరళ ఆయుర్వేద వైద్యశాల

10 A.M. TO 8 P.M.

ఓడియన్ 70 ఎంఎం థియేటర్ దగ్గర, BIG-C ఎదురుగా రేమాండ్స్ & Fantoosh Showroom ప్రక్కన, 1st FlooR
చిక్కడపల్లి మెయిన్‌రోడ్, హైదరాబాద్-20. ఫోన్ : 65526109, 9866155109, 9392355590

Note : పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు, ఉత్తరాలద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు పోస్టల్ ఛార్జీ రూ॥ 100/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా మీ ఫోన్ నెంబరుతో సహా పంపించండి. ఫోన్ ద్వారా సంప్రదించు వారు 10 A.M. - 2 P.M. & 5 P.M. - 8 P.M.

10 A.M. TO 8 P.M.

